రాజు

కవిరాజు

ప్రేమికుడు

నిర్మాత

హైదరాబాద్ నగర సంస్థాపకుడు

# మహమ్మద్ కులీ కుతుబ్‌షా

ఆంగ్లమూలం

నరేంద్ర లూథర్

అనువాదం

దేవిప్రియ




పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు - 500 001

1997

*Hyderabad Nagara Charithra - A Historical Profile of Hyderabad*

by - Narendra Luther



ప్రచురణల సంఖ్య - 195

ప్రథమ ముద్రణ - 1997

ప్రతులు : 1000

వెల రూ. 65/-

**ప్రతులకు :**

డైరెక్టర్

పబ్లికేషన్ డివిజన్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిదాయలయం

లలిత కళక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,

హైదరాబాద్ - 500 004.

ముద్రణ Sai Krupa Offset Printers,
Golconda 'X' Roads,
Hyderabad - Ph : 7640133.

ISBN.No. 81-86073-31-0

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

లలిత కళాక్షేత్రం, పబ్లిక్‌గార్డెన్స్,
హైదరాబాదు-500 004

# సమర్పణ

బోధన పరిశోధన, ప్రచురణ అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985వ సంవత్సరంలో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది. పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత, నాటక, నృత్య, లలితకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వలన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి. అన్ని విశ్వవిద్యాలయాల వలే కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్పపరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయామిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ.

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయంలో యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యాస్రవంతి శీర్షికను సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటి వరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీఖండం, శివరాత్రి మహాత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరుపొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది. ఈ మధ్యే చిల్లరదేవుళ్ళు నవలని ఆంగ్లంలోకి ప్రచురించడం జరిగింది. పోతన, వేమనల కవితలనీ, పాండురంగమహాత్మ్యం, కొయ్యగుర్రం కావ్యాల్ని హిందీలోకి ప్రచురించింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారుచేయించే కార్యక్రమంలో విశ్వసాహితిని, హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది.

భాషాభివృద్ధి కృషిలో భాగంగా 'తెలుగు భాషా చరిత్ర', 'ద్రావిడ భాషలు' అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ శాఖవారి సహకారంతో డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ రచనలు-ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది.

తెలుగువారికి, మరీ ముఖ్యంగా హైదరాబాదులో నివసించేవారికి కులీకుతుబ్‌షా ఎంతో ప్రియతముడు. ఈ నగర నిర్మాణానికి కారకుడైన కుతుబ్‌షా విలక్షణమైన వ్యక్తి ఆయన స్వభావంలో, ప్రవర్తనలో మరెవరితోనూ సరిపోల్చ లేని వైశిష్ట్యం వుంది. అందుకే అతను ఏకకాలంలో కవిగా, రాజుగా, విలాసపురుషుడుగా, గొప్ప భవన నిర్మాతగా కూడా దర్శనమిస్తాడు చిత్ర విచిత్రమైన ఈ వ్యక్తిత్వాన్ని శ్రీ నరేంద్రలూథర్ ఆకళింపు చేసుకున్నారు. హైదరాబాదు నగర నిర్మాతగా కుతుబ్‌షాను పరిచయం చేయడమంటే, ఆయన వ్యక్తిత్వంలోని అన్ని పార్శ్వాలనూ ఆవిష్కరించడమే. ఈ వైవిధ్యం వల్లనే కుతుబ్‌షా గురించి చరిత్రలో అనేక రకాలైన కథలు గాథలు వ్యాప్తిలోకి వచ్చాయి. వాటినన్నిటినీ దృష్టిలో ఉంచుకుని, తన పరిశోధనా పాటవాన్ని, సాహిత్య ప్రియత్వాన్ని జోడించి, కుతుబ్‌షా చరిత్రను ఒక సుందరమైన చారిత్రిక రచనా శిల్పంగా రచయిత తీర్చి దిద్దారు.

ఆనాటి హైదరాబాదు చరిత్ర మన కనుల ముందు సాక్షాత్కరించేలా ఒక కావ్యం పోకడలో రచన సాగింది. అందువల్లనే ఈ గ్రంథాన్ని ఆంధ్రులకు తప్పక పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ మూల గ్రంథాన్ని ఎంతో శ్రమకోర్చి రచించిన శ్రీ నరేంద్రలూథర్ గారికీ, తెలుగులోకి అనువదించిన శ్రీ దేవప్రియగారికి మా ధన్యవాదాలు.

కులీకుతుబ్‌షాను, హైదరాబాదు నగర చరిత్రను అర్థం చేసుకోవడానికి ఈ గ్రంథం ఎంతో ఉపకరిస్తుందని భావిస్తున్నాను. తెలుగు పాఠకుల విశేష ఆదరాన్ని పొందగలదని ఆశిస్తున్నాను.

నాయని కృష్ణకుమారి

హైదరాబాదు
తేది : 30-8-1997

**ఆచార్య నాయని కృష్ణకుమారి**

# ఈ పుస్తకం గురించి...

గోలుకొండ సామ్రాజ్యాన్ని క్రీ.శ. 1518 నుంచి 1687 వరకు పాలించిన కుతుబ్‌షాహి వంశంలో ప్రసిద్ధుడైన మహమ్మద్ కులీ కుతుబ్‌షాది బహుముఖ వ్యక్తిత్వం. ఆయన మహాప్రేమికుడు, గొప్పకవి, మహానగర నిర్మాత, సమర్థుడైన పాలకుడు.

గోలుకొండ రాజ్యానికి కొత్త రాజధానిగా హైదరాబాదు నగరాన్నీ, ఆ నగరానికి అమూల్యాభరణం వంటి చార్‌మినార్‌నూ నిర్మించిన వాడు కులీకుతుబ్‌షా. తాను ప్రగాఢంగా ప్రేమించిన ఒక సామాన్య వనితపట్ల అసామాన్యమైన మక్కువను వ్యక్తం చేస్తూ ఆయన హైదరాబాదుకి 'భాగ్‌నగర్' అనే పేరుపెట్టాడు. భవన నిర్మాణాభి లాషలో కులీ మొగల్ చక్రవర్తి షాజహాన్‌ని కూడా మించిపోయాడు తన రాజధాని నగరం "భూమిమీద స్వర్గానికి ప్రతిరూపంగా" నిలవాలని ఆయన ఆదేశించాడు. "హైదరాబాదు నిజంగా అటువంటి 'దేవతా' నగరమేనా? ఆసక్తికరమైన ఈ ప్రశ్నగురించి మీ చేతుల్లో వున్న ఈ పుస్తకం చర్చిస్తుంది. పన్నెండు పలు అంతస్తుల రాజప్రాసాదాలతో ఉద్యానవన నగరాన్ని నిర్మించిన కులీ కుతుబ్‌షా ఆ సంరంభంలో పడి పేద ప్రజల కోసం విశాలమైన ఒక వైద్యశాలను నిర్మించడం మరచిపోలేదు.

మహమ్మద్ కులీ లోని కవి ఆయన లోని చక్రవర్తిని మించి ఎదిగాడు. కులీ తొలి ఉర్దూ రాజకవి (సాహిబ్-ఎ-దివాన్) మాత్రమే కాదు, ఉర్దూ కవిత్వపు శైశవ దశలో దానికి పలుభంగులు చూపి, పలురంగులు అద్దిన వాడు కూడా ఆయనే. ఉర్దూ కవిత్వంలో తొలిసారిగా లౌకికతత్వాన్ని ప్రవేశపెట్టిన ఘనత కూడా కులీ కుతుబ్‌షాదే. ఆయన కవిత్వం ప్రజల హృదయ తంత్రులను మీటగలిగింది. పలు వేదికల మీద ఇప్పటికీ కులీ కవితలను గానం చేయడం కనిపిస్తుంది.

కులీ వ్యక్తిత్వంలోని అత్యున్నత లక్షణం ఆయనలోని లౌకికవాద దృక్పథం ఆచరణలో "షియా" అయివుండి కూడా ప్రపంచం, అందులోని మానవులూ మతాల పేరిట, కులాల పేరిట ముక్కలు చెక్కలై ఉండడాన్ని ఆయన నిరసించాడు. కులీ దృష్టిలో మసీదు ఎంత పవిత్రమైనదో మందిరం కూడా అంత పవిత్రమైనది.

బహుముఖ ప్రజ్ఞతో చెక్కుచెదరని ఖ్యాతిని సంపాదించుకొన్న ఈ నిరుపమాన చక్రవర్తిని గురించి ఒక సమగ్రమైన పుస్తకం వెలువడడం ఇదే ప్రథమం.

# ముందుమాట

భారతదేశచరిత్ర సుదీర్ఘమయినది. అత్యంత వైభవ భరితమయినది. ఎందరో రాజులు, చక్రవర్తులు, దురాక్రమణదారులు, సాహసికులు, నిరంకుశులు, ప్రజాకంటకులు, ప్రజా పీడకులు భారతదేశ చరిత్ర రంగస్థలం మీద కనిపించి కనుమరుగై పోయారు. మన చరిత్ర చాలా వరకు వారి విజయాల, వైఫల్యాల చిత్రణ వారి దారుణకాండలు,సాహస కృత్యాల చిట్టా. వారి మనోభావాలు, మనోవికారాల పట్టిక.వారి అహం, దుర్మార్గం, వైపరీత్యాలు, నిరాశ, దురాశల కథాసాగరం.

మరోవైపున కవులు, రచయితలు, కళాకారులు, శిల్పులు, బోధకులు, తత్వవేత్తలు, మునులు, పండితులు, సంస్కర్తలు అధికారాన్ని అందుకొని, సన్మార్గాన్ని అనుసరించి దేశ సామాజిక, సాంస్కృతిక చరిత్రకు ఎంతో విలువైన సేవలను అందించారు.

ఈ రెండు వర్గాలు పరస్పర విరుద్ధమైనవి. అయినప్పటికీ, వీరు వర్ణన పరంగాను, వర్ణాలపరంగాను ఓ అద్వితీయమైన, అద్భుతమైన జలతారు వస్త్రాన్నే కలనేశారు.

ఈ రెండు వర్గాలు కాక మరో వర్గం కూడా వుంది. వీరి సంఖ్య చాలా తక్కువ. ఈ స్వల్పవర్గం వారు భిన్నంగా, అద్వితీయ వ్యక్తిత్వాలతో పై రెండు వర్గాలను మించిపోయారు.

చరిత్రపుటలలో వీరిపేర్లు ప్రముఖంగా, శాశ్వతంగా నిలిచిపోయాయి. అశోకుడు, అక్బర్, నెహ్రూ- వారిలో కొందరు రాజులు. రాజకీయ అధికార మహాధిపుల చరిత్ర మొత్తం నిరంతర కలహాలు, దురాక్రమణలు, దుర్మార్గం, నిరంకుశ పాలనతో నిండి ఉన్నప్పటికీ వీరి పేర్లు ప్రముఖంగానే ప్రకాశిస్తాయి. ఓ సుదీర్ఘ సుందర స్వప్నం నిజం చేయడానికి వాళ్ళు కృషి చేశారు. ప్రజల ఆనంద

భరితమైన, అందమైన శాశ్వత భవిష్యత్తును గురించిన ముందుచూపు వారికి అత్యధికంగా ఉండేది. సామాన్య ప్రజల జీవన మర్మాన్ని కనుగొనడానికి నిరంతర కృషి చేసిన దార్శనికులు వీరు.

వారే కాక మరికొందరు ప్రముఖులు కూడా ఉన్నారు. జాతీయ స్థాయిన వారు కానరాక పోయినప్పటికీ, ప్రాంతీయ స్థాయిలో ప్రముఖంగానే వెలుగొందారు. దేశంలో మరెక్కడా సాటి లేదనిపించుకొన్న వాళ్ళువారు. వారిపేర్లు కూడా చిరస్మరణీయమైనవి.

ఇప్పటి ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న దక్కన్ ప్రాంతాన్ని పాలించిన మహమ్మద్ కులీకుతుబ్‌షా అటువంటి వారిలో ఒకడు. ఈయన క్రీ.శ. 1565 నుండి 1611 వరకు జీవించాడు. నలభై ఆరు సంవత్సరాల తన జీవితకాలంలో ముప్పయి ఒక్క సంవత్సరాలు గోలుకొండ రాజ్యాన్ని పాలించాడు. సుమారు 400 సంవత్సరాలు గడిచిపోయిన పిదప నేటికి కూడా ఆయన పేరు ప్రజల హృదయాలలో చిరస్మరణీయంగా నిలిచి ఉంది. ప్రజలు ఎంతో ప్రేమతో ఆయనన్ను గుర్తు చేసుకొంటారు. ప్రతి సంవత్సరం ఆయన జన్మదిన వేడుకలు జరుపుకోవడం ద్వారా ఆయనకు నివాళులర్పిస్తారు. ఈ పుస్తకం ఆయన మీద ఒక సుదీర్ఘవ్యాసం వంటిది. ఆ మహోన్నత వ్యక్తి సాధించిన ప్రజాదరణకు గల కారణాల అన్వేషణ ఇది. రాజులకు మాత్రమే సాధ్యపడే జీవితాన్ని ఆయన సంపూర్ణంగా జీవించాడు. ఆయన యుద్ధాలను కోరుకోలేదు. అనివార్యంగా వచ్చిపడిన యుద్ధాలలో మాత్రమే ఆయన పోరాడాడు. ఆయన విజయాలు విశిష్టమైనవి. ఆయన మద్యాన్ని సేవించాడు. ఆహ్లాదాన్ని అనుభవించాడు. కవిత్వం రాశాడు. రాజులలో, యువరాజులలో అరుదుగా కనిపించే అతిగాఢమైన అనురాగంతో ఒక సామాన్య వనితను నిష్కపటంగా ప్రేమించాడు. ఆయన నూతన రాజధానిగా హైదరాబాదు నగరాన్నీ, దానికి మకుటాయమానంగా చార్మినార్‌ను నిర్మించాడు. ఆయన బహుముఖ వ్యక్తిత్వం గలవాడు. రాజు, ప్రేమికుడు, కవి, నగర నిర్మాత - ఇవన్నీ మిళితమయిన ఆయన మహోన్నత వ్యక్తిత్వం ఆయన పేరును చిరస్మరణీయం చేసింది.

ఈ వ్యక్తి కథనే మనం ఇక్కడ చెప్పుకోబోతున్నాం. ఆయన కీర్తి ఇంత సుదీర్ఘకాలం ఎందుకని నిలిచి ఉంది? వర్తమానంతో ఆయనకు సంబంధం ఉందా? ఇటువంటి ప్రశ్నలకు జవాబీయడానికి ఈ పుస్తకంలో చిత్తశుద్ధితో ప్రయత్నం జరిగింది.

ఒకగమనిక. ఇది పండితుల కొరకు వ్రాసిన చరిత్ర కాదు. సామాన్యులకోసం ఒక సామాన్యుడు రచించిన కథ. నాలుగువందల సంవత్సరాలు గడిచిపోవడంతో ఎన్నో వాస్తవాలు మరుగున పడిపోవడం, కల్పితగాథలు వాటిని కప్పివేయడం అనివార్యమైపోయింది. పురాణ, ఇతిహాసాల ప్రభావం వల్ల కొన్ని వాస్తవాలు కథలూ, గాథలుగా మారిపోయాయి. పాక్షిక పరిశీలకులు, సమకాలీన చరిత్రకారులు, పక్షపాత దృష్టి గల చరిత్రకారులు, దురభిమానం గల వ్యాఖ్యాతలు విపరీతమైన గందరగోళం సృష్టించారు. అయితే వాస్తవాన్ని పునర్నిర్మించడానికి అవసరమైన సమాచారం ఉంది. కనుక, పరిశోధనలో వెలువడిన వాస్తవాలకు మాత్రం ఖచ్చితంగా కట్టుబడి, కథాకథన శైలికి అడ్డుపడకుండా వుండాలనే సదుద్దేశ్యంతో పాదసూచికలను అధికార పత్రాలకు సంబంధించిన వివరణలను చేర్చలేదు.

ఈ కథకు నేడు కూడా ప్రాధాన్యత ఉంది. కథలోకి వెళితే ఆ ప్రాధాన్యత ఏమిటో అర్థం అవుతుందని భావిస్తున్నాను.

నరేంద్ర లూథర్

# కృతజ్ఞతలు

నా మిత్రులు, హైదరాబాదు నుండి వెలువడే ఉర్దూ దినపత్రిక "సియాసత్" సంపాదకులు కీ.శే. ఆబిద్ అలీఖాన్ నన్ను ఈ పనికి పురికొల్పారు. మొదట్లో చాలాకాలం నేను వారి సూచనను వినమ్రంగానే కాదన్నా, చివరికి ఒప్పుకొన్నాను. ఈ పుస్తకరచన పూర్తయిన తరువాత నేను ఎంతో సంతృప్తిని అనుభవించాను. నాకొక నూతనమైన అనుభవాన్ని అందించినందుకు వారికి నా కృతజ్ఞతలు.

నాకు సహాయ సహకారాలు అందించిన వారందరికి నేను హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ప్రాథమిక చర్చలలో, నాకు సరైన మార్గం చూపడంలో ప్రొ॥ ధర్మేంద్ర ప్రసాధ్ చాలా సహకరించారు. ఈ పుస్తక ప్రచురణకు ముందే వారు కన్ను మూయడం దురదృష్టకరం. వారికి ఎంతో ప్రీతిపాత్రమయిన ఈ పుస్తకాన్ని అచ్చులో చూసి వారు ఎంతో ఆనందించి ఉండేవారు!

హైదరాబాద్‌లోని సాలార్‌జంగ్ మ్యూజియమ్‌లోని గ్రంధాలను, ఇతర సౌకర్యాలను వినియోగించుకొనేందుకు అనుమతించి, సహాయ సహకారాలు అందించిన అప్పటి మ్యూజియమ్ డైరెక్టర్ డా.ఎమ్.ఎల్. నిగమ్, ఇతర అధికారులు, సిబ్బందికి నా కృతజ్ఞతలు. ఈ పుస్తకంలో ముద్రించిన కొన్ని రేఖాచిత్రాల ఫోటోలను తీసుకోవడానికి వారు నాకు దయతో అనుమతి ఇచ్చారు.

నా అవసరాలను పూర్తిగా తీర్చిన మ్యూజియమ్ లైబ్రేరియన్ శ్రీ పి. రమేష్ సౌజన్యాన్ని నేను ప్రత్యేకంగా పేర్కొనక తప్పదు

తమ శాఖా గ్రంధాలయాన్నీ, ఇతర సౌకర్యాలను వినియోగించుకోవడానికి అనుమతించిన ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖ డైరెక్టర్ డా. వి.వి. కృష్ణశాస్త్రి గారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు

సంబంధిత ఉపయుక్త రికార్డులను, నిర్దేశాలను పరిశీలించేందుకు అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అభిలేఖనాలయం (Archives) డైరెక్టర్ డా. దావూద్ అష్రాఫ్ గారికి నా కృతజ్ఞతలు ఈ పుస్తకంలో పేర్కొన్న భాగ్‌నగర్ ఖ్వాజాకి చెందిన సీలు లభ్యంగా ఉన్న విషయాన్నికూడా వారే నా దృష్టికి తెచ్చారు.

తమ గ్రంథాలయాన్ని ఉపయోగించుకునేందుకు అనుమతించిన ఇదార-ఎ-అదబియాత్-ఇ-ఉర్దూ వారికి కూడా నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉర్దూశాఖకు చెందిన డా. సయిదా జాఫర్‌కి, 'దక్కనీ' లోని అనేక అభివ్యక్తీ కరణలను వివరించి, మహమ్మద్ కులీ కవిత్వంలోని విషయాలను విపులంచేసిన మాజీ ఉర్దూ ప్రొఫెసర్, ప్రముఖ విద్యావేత్త డా. జీనత్ సజీదాకి నా హృదయపూర్వక కృతజ్ఞతలు

ఈ పుస్తకం లిఖిత ప్రతిలోని సంబంధిత భాగాలను పరిశీలించి విలువైన వ్యాఖ్యలను, సలహాలను అందించిన ఉస్మానియా యూనివర్సిటి ఉర్దూ శాఖాధిపతి డా. ముఘాని తబుస్సుమ్, చరిత్ర శాఖకు చెందిన డా. సాదిక్‌నక్వి, హైదరాబాద్ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీకి చెందిన ఎస్. పి. షొరె - వీరికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు.

నా చిరకాల మిత్రులు, తెలుగు రచయిత, ఎన్.వి. గోపాలశాస్త్రి, ఉస్మానియా విశ్వవిద్యాలయం ఇంగ్లీషు శాఖకు చెందిన వై. సత్యనారాయణ, మీరా, రాఘవేంద్ర మాన్వి, టైప్ ప్రతిని శ్రద్ధగా పరిశీలించి సహాయపడ్డారు. వారికి నా కృతజ్ఞతలు.

ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఏదో ఒక విధంగా నాకు సహాయం అందించిన అందరికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు.

– రచయిత

## అనువాదకుడి అప్పీలు

ఉర్దూ, ఆంగ్లభాషలలో ప్రసిద్ధ రచయిత, పరిశోధకులు శ్రీ నరేంద్ర లూథర్ గారి ఈ ప్రతిష్టాత్మక ఆంగ్ల రచనను తెలుగులోకి అనువదించే అవకాశం కల్పించినందుకు తెలుగు విశ్వ విద్యాలయం వారికి ధన్యవాదాలు తెలియ జేస్తూ, అనువాద ప్రతిని సిద్ధంచేయడంలో జరిగిన అసాధారణమయిన ఆలస్యానికి మన్నించవలసిందిగా వేడుకుంటున్నాను. మహమ్మద్ కులీ కుతుబ్‌షా జీవిత చరిత్రను అనువదించే అవకాశం తొలినుంచి చరిత్ర విద్యార్థినయిన నాకు లభించడం నాకెంతో ఆనందం కలిగించింది. దీని అనువాదంలో నేను ఎదుర్కొన్న సమస్య ఏదయినా వుంటే అది కులీ కవితల విషయంలోనే. దక్కనీ ఉర్దూ నుంచి శ్రీ లూథర్ యిచ్చిన ఇంగ్లీషు వచనానువాదాలను ఆధారం చేసుకుని ఉర్దూ లిపిలో వున్న వాటిని చదివించుకుని, హిందీలిపిలో వున్న వాటిని స్వయంగా అర్థం చేసుకుని ఈ కవితలను అనువదించడానికి ప్రయత్నించాను. ఇవి సారాంశంలో భావానువాదాలుగా మారాయి. అనువాద ప్రతులు రాయడంలో సాయం చేసిన పాత్రికేయ సోదరులు ఆర్. బాలక్రిష్ణకి, అబ్దుల్ వాహెద్‌కి ఈ సందర్భంగా ధన్యవాదాలు చెప్పకుండా వుండలేను.

ఎంతో సహనం, సంయమనం చూపి, పట్టుపట్టి నాచేత ఈ అనువాదాన్ని చేయించిన తెలుగు యూనివర్శిటీ ప్రచురణల విభాగం మిత్రులకూ, రిజిస్ట్రార్ శ్రీ సుబ్బారావు గారికీ, డిప్యూటీ రిజిస్ట్రారు శ్రీ రామసుబ్బారెడ్డి గారికీ ఎంత కృతజ్ఞత తెలియజేసినా తక్కువే.

నాపట్ల గల ప్రత్యేకమయిన అభిమానంతో, నమ్మకంతో ఈ బృహత్కార్యాన్ని నాకు అప్పగించిన ఆనాటి వైస్ ఛాన్సలర్ డా. సి. నారాయణ రెడ్డి గారికీ, అమవాద గ్రంథాన్ని ఆదరించిన నేటి వైస్ ఛాన్సలర్ ఆచార్య నాయని కృష్ణకుమారి గారికీ, ధన్యవాదాలు చెప్పడం నా బాధ్యత. ఇందులోని సుగుణాలు శ్రీ నరేంద్ర లూథర్‌వి, లోటు పాట్లు నావని వేరే చెప్పనక్కరలేదు కదా.

9-4-1995,
హైదరాబాదు.

భవదీయుడు
దేవిప్రియ

# విషయసూచిక

# నేపథ్యం

ఈ కథ క్రీ.శ. పదహారు, పదిహేడు శతాబ్దాలలో జరిగింది. ఇది భారతదేశ చరిత్రలో మధ్యయుగం వుత్తరార్ధానికి చెందిన కాలం. ఆ కాలంలో ఈ దేశం ఎలా ఉండేదో మనం ఓసారి పరికించడం అవసరం.

ఇక్కడ మనం ముందుగా గుర్తించవలసిన అంశం ఒకటి వుంది. భౌగోళిక ఏకత్వం ఉన్నప్పటికీ, రాజకీయంగా, మనం నేడు అనుకొంటున్న అర్థంలో భారతదేశం ఎప్పుడూ ఒక దేశంగా లేదు. వంశపారంపర్య భూస్వామ్య విధానం వల్ల దేశం అనేక రాజ్యాలుగా, సామంతరాజ్యాలుగా, సంస్థానాలుగా, జమిందారీలుగా చీలి ఉండేది. చక్రవర్తుల పాలనలో ఉన్నప్పుడు సైతం దేశం సమర్థవంతమైన కేంద్రీయ అధికార నియంత్రణలో లేదు.

చక్రవర్తులు, రాజులు, సామంతులు వివిధ వర్గాలతో నిరంతరం పోరాడుతూ కొన్ని సందర్భాలలో భూభాగాలను జయిస్తూ, కొన్ని సందర్భాలలో కోల్పోతూ ఉండేవారు. వివిధ రాజ్యాల సరిహద్దులు నిరంతరం మారుతూ ఉండేవి. విధేయత కేవలం ఒక ప్రాంతీయ రాజ్యానికి మాత్రమే చూపేవారు, నేడు మనం భారతదేశం అని పిలుస్తున్న దేశానికి కాదు. జాతీయ ప్రభుత్వం అన్నది ఏదీ లేదు కాబట్టి దేశభక్తి అంటే జాతీయ ప్రభుత్వం పట్ల ప్రేమ అనే భావన ఉండేదికాదు. అసంఖ్యాకంగా ఉన్న ఆయా రాజ్యాల పట్ల విధేయత ఉండేది.

పన్నెండవ శతాబ్దం చివరలో ఢిల్లీ తురుష్కుల (టర్కీవారి) పాలనలోకి వచ్చింది. అప్పటి నుంచి గంగానది లోయనుండి బెంగాల్ వరకు విస్తరించిన భారతదేశానికి ఢిల్లీ సుల్తాన్ ప్రధాన అధికార కేంద్రమయ్యారు. ఆ తర్వాత వచ్చిన సుల్తానులందరూ ఢిల్లీ నుండి అన్ని దిశలలోనూ తమ సామ్రాజ్యపు సరిహద్దులను విస్తరించుకోడానికి ప్రయత్నించారు.

జాతీయ ప్రభుత్వం, ప్రజాస్వామ్యం, సార్వత్రిక ఓటు హక్కు- పార్లమెంటరీ తరహా ప్రభుత్వం, లౌకిక వాదాల భావనలకు అలవాటు పడి ఉన్న ఆధునిక పాఠకులు, ఆకాలం నాటి దృశ్యాన్ని- తురుష్క చక్రవర్తులు ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించి దేశంలో అధిక భాగాన్ని క్రమంగా తమ ప్రత్యక్ష లేదా పరోక్ష పాలనలోకి తెచ్చుకొన్న ఆనాటి భారతదేశ చిత్రాన్ని ఒకసారి పరిశీలించడం అవసరం.

**ఇస్లామ్ పరిపాలనా విధానం :** తురుష్క సుల్తానుల విధానం ఇస్లామీయ సూత్రాలకు అనుగుణంగా ఉండేది. ఇస్లామ్ మత సూత్రాల ప్రకారం సార్వభౌమాధికారం దైవానిది. రాజు దేవునికి ధర్మకర్త తుది తీర్పు రోజున రాజు దైవానికి జవాబు చెప్పుకోవాలి. సూత్రబద్ధంగానైతే రాజవంశీకులు, ఇతర అధిపతులు సుల్తాన్‌ని ఎన్నుకోవలసి ఉంటుంది. కాని, ఆచరణలో రాజులు తమ బల సంపదతో అధికారాన్ని సాధించుకునే వారు. అధికార వ్యామోహితులు, వారి అనుచరుల ఖడ్గఘాతానికి గురైన శిరస్సులతో సింహాసనా మార్గం నానా బీభత్సంగా ఉండేది. రాజుల ఎంపిక కూడా రాజవంశీకులకు మాత్రమే పరిమితం. రాజ్యాధికారం జ్యేష్ఠ పుత్రుడిదే అన్నది సూత్రం. అయితే వారు శారీరకంగా, మానసికంగా యోగ్యులై ఉండాలి. అందుకే విజేతలైన వారు పోటీదారులను అంధులుగా చేయుటం ప్రబలంగా ఉండేది. పరిపాలన, న్యాయాధికారాలకు సంబంధించి రాజు సర్వోన్నత అధికారి. శాసన సభలాంటిదేదీ లేదు. న్యాయ సూత్రాల క్రోడీకరణ లేదు. షరియత్ ముస్లిముల పవిత్రగ్రంథం ఖురాన్, ప్రవక్త మహమ్మద్ ప్రబోధనలు, సంప్రదాయాలు-'హదీస్' ల-ప్రాతిపదికన న్యాయ, పరిపాలనా విధానాలుండేవి. షరియత్‌కు తోడుగా 'ఇజ్మా', 'ఉర్ఫ్' పద్ధతులు ఉండేవి ప్రవక్త సహచరులలో ముఖ్యుల ఏకాభిప్రాయాలను 'ఇజ్మా' అని, స్థానిక ఆచార వ్యవహారాలను 'ఉర్ఫ్' అని పేర్కొంటారు. వీటితో పాటుగా పైరెండు వర్గీకరణల పరిధిలోకి రాని శిస్తు, సైనిక వ్యవహారాలు, ఉద్యోగ నియామకాలు వంటి విషయాల్లో రాజు శాసనాలను, ఆజ్ఞలను జారీ చేసేవాడు. వీటిని 'ఫర్మానా' లంటారు. ప్రజలందరికీ ఒక సామాన్య నేర చట్టం వర్తించేది. పౌరసమస్యల

విషయంలో మతపరమైన వ్యక్తిగత చట్టం వర్తించేది. ముస్లిమేతరులు జిజియా పన్ను చెల్లించవలసి ఉండేది. అన్ని విషయాలలోనూ రాజుకు గల అధికారాలు తిరుగు లేనివి. ఆధునిక పరిభాషలో ఈ విధానం రాజకీయ, మత పరమైన నిరంకుశ పాలనా విధానం. పరిపాలనలో నిరంకుశత్వపు స్థాయి సుల్తాన్ వ్యక్తిత్వం మీద ఆధారపడి ఉండేది.

ఆ కాలంలో సమాజంలో బానిసత్వ పద్ధతి అమలులో ఉంది. అయిత బానిసలకు వారి ఉత్తమ సేవలకు మెచ్చి తరుచుగా స్వేచ్ఛను ప్రసాదించడం జరిగేది. వారు సమాజంలోనూ, పదవుల్లోనూ పైకెదగడం మీద ఎలాంటి పరిమితులుండేవి కావు. వాస్తవానికి వారిలో కొందరు సైన్యాధికారులయ్యారు. కొందరు మంత్రులయ్యారు. రాజులైన వారు సైతం ఉన్నారు. క్రీ.శ. 1206 నుంచి 84 సంవత్సరాల పాటు భారతదేశాన్ని ఏలిన 'బానిస వంశాన్ని' స్థాపించిన ఢిల్లీ ప్రథమ సుల్తాన్ కుతుబ్-ఉద్దీన్-ఐ బక్ బానిసే. పాలకులు అల్ప సంఖ్యాకులు కావడం చేత స్థానిక ఆచార వ్యవహారాలను గురించి తెలియని వారు కావడం చేత, ముస్లిమేతరులు కూడా ఉన్నతపదవులు అధిష్టించడం సహజంగానే జరిగింది.

మొత్తం మీద మధ్య యుగానికి ఒక పురోగమనంలేని స్వభావం కనబడుతుంది. ప్రజలు గతాన్ని 'ఆదర్శవంతంగా' భావిస్తూ ఉండేవారు. హైందవం, ఇస్లామ్ రెండు మతాలూ బోధించిన 'పరలోక' చింతన ప్రజలలో ఉదాసీనతను, నియతివాదబద్ధతను వున్నదానితో సంతృప్తినీ, ఆజ్ఞానుకూలతనూ ప్రోత్సహించింది. సమాజ తిరోగమన తత్వం, సనాతన ఛాందసత్వం కలసి రాజకీయ నిరంకుశాధికారం బల పడడానికి దోహదం చేశాయి. మత భావనలు వేళ్ళూనిన విద్యావిధానం జ్ఞానాన్నికాక అవాంఛనీయమైన పండితీ ప్రకర్షను ప్రోత్సహించింది.

రవాణా, ప్రసార సాధనాలు లేని కారణాన ప్రజలు ఒకరికొకరు దూరమైపోయారు. వివిధ ప్రాంతాల ప్రజల మధ్య ఆలోచనల, అభిప్రాయాల విస్తరణ వేగంగా జరిగేది కాదు. శీఘ్ర సమాచార సౌకర్యం పరిపాలనా యంత్రాంగానికి

మాత్రమే అందుబాటులో ఉండేది ఈ విషయంలో కూడా ప్రజలమీద ప్రభువులదే పై చేయిగా ఉండేది. మనుగడ కోసం కళలు, సాహిత్యం ప్రభువుల పోషణ మీద ఆధారపడి ఉండేవి. ఈ పరిస్థితి ప్రభువుల ముఖస్తుతినీ, స్తోత్ర పాఠాలను ప్రోత్సహించింది. అవసరాలకోసం కళా స్వాభావిక ప్రవృత్తిని ప్రయోజనకారిత్వానికి అనుగుణంగా మళ్ళించుకోవాల్సివచ్చేది.

**దక్షిణ భారత ఆక్రమణ :** ఉత్తర, దక్షిణ భారత దేశాల చరిత్రకి రాజకీయంగా కొంతమేరకు ప్రత్యేకత ఉంది. వింధ్యపర్వతాలు, నర్మదానది ఈ రెండు ప్రాంతాల మధ్య రెండు సరిహద్దులను యేర్పరిచాయి. అయితే సువిశాల సామ్రాజ్య ఆకాంక్షగల వారికి ఈ సరిహద్దులు అవరోధాలు కాలేదు. తురుష్కులు ఢిల్లీని ఆక్రమించిన ఒక శతాబ్దం తరువాత దక్షిణదేశ ఆక్రమణ జరిగింది.

క్రీ.శ. 1294 లో దేవగిరి రాజ్యాన్ని ముట్టడించడం ద్వారా అప్పటి కారా గవర్నర్ అల్లా ఉద్దీన్ ఖిల్జి దక్షిణ దేశ ఆక్రమణను ఆరంభించాడు. 1306-7 లో దేవగిరి పాలకుడు రామచంద్ర దేవ్ ఒప్పందం ప్రకారం ఢిల్లీకి చెల్లించవలసిన కప్పం చెల్లించక పోవడం వల్ల ఖిల్జీ దేవగిరిని స్వాధీనం చేసుకోడానికి మలిక్‌కాఫుర్‌ని పంపాడు. ఆ తరువాత క్రీ.శ. 1308 లో వరంగల్ మీద కూడా దండెత్తి లొంగదీసుకున్నాడు. క్రీ.శ.1323లో వరంగల్‌ను ఢిల్లీ సామ్రాజ్యంలో ఒక ప్రాంతీయ రాజధానిగా చేసి దాని పేరును సుల్తాన్ పూర్‌గా మార్చారు.

క్రీ.శ. 1325 లో ఢిల్లీ సుల్తాన్‌గా అధికారం చేపట్టిన మహమ్మద్ తుగ్లక్ తన సువిశాల రాజ్యాన్ని నియంత్రించడం కోసం ఢిల్లీ కంటే దేవగిరి అనువైనదని భావించి కొంత కాలం పాటు తన రాజధానిని అక్కడకు మార్చాడు. దేవగిరి పేరును కూడా ఆయన దౌలతాబాద్‌గా మార్చాడు రోమన్ పరిపాలనా విధానంలోని సెంచూరియన్స్ వలె ప్రతి వంద గ్రామాలకు ఒక గవర్నర్ ఉండే నూతన పరిపాలనా వ్యవస్థను ఆయన ప్రవేశపెట్టాడు. తుగ్లక్ చాలా కఠిన పాలకుడు 1346లో కొందరు గవర్నర్లు ఆయన మీద తిరుగుబాటు చేసి తమలో ఒకడైన ఇస్మాయిల్‌ను రాజుగా

ఎన్నుకొన్నారు. 1347లో తనకంటె బలవంతుడు జాఫిర్‌కు అనుకూలంగా ఇస్మాయిల్ పదవి నుంచి తప్పుకొన్నాడు. అల్లా-ఉద్దీన్-హసన్-బహమన్ షా బిరుదుతో జాఫర్ బహమనీ రాజవంశాన్ని స్థాపించాడు. పద్దెనిమిది మంది పాలకులతో ఈ రాజవంశమే క్రీ.శ. 1518 వరకు సమర్ధవంతంగా పరిపాలించింది ఆ తరువాత 1527 వరకు ఈ రాజవంశం నామ మాత్రంగా మనుగడ సాగించింది.

బహమనీ రాజవంశానికి, గంగూ బ్రాహ్మణ్ అనే హిందువుతో సంబంధం యేదో ఉందనే గాథను చరిత్రకారులు తిరస్కరించారు. ఈ ప్రచారగాథ ప్రకారం హసన్ ఒకప్పుడు గంగూ అనే బ్రాహ్మణుని వద్ద సేవకుడు. గంగూ, హసన్ను చాలా ప్రేమగా చూడడమే కాక అతను ఏదో ఒకనాడు చక్రవర్తి కాగలడని కూడా ఊహించాడని చెపుతారు. అతని జోస్యం నిజం కావడంతో హసన్ తన విశ్వాసాన్ని చాటుతూ, తనకు ఉపకారం చేసిన పెద్దమనిషి ఇంటి పేరును తన పేరుతో కలుపుకొన్నాడని అంటారు. అయితే హసన్, బహమన్ అనే ఇంటిపేరు స్వీకరించడానికి అసలు కారణం తాను ఆ పేరుగల పారశీక రాజవంశానికి చెందిన వాడినని అతడు విశ్వసించడమే.

# సుల్తాన్ కులీ

**సు**ల్తాన్ మహమ్మద్‌షా లష్కరి పరిపాలనా కాలం(1463-82)లో, టర్కీలోని హమ్‌దాన్ నుంచి పారిపోయి వచ్చిన ఓ సేనానాయకుడు ఆయన దర్బారుకి చేరాడు. అతడు 'నల్ల గొర్రెలు' అనబడే టర్కీ తెగకి చెందినవాడు. 'నీలం గొర్రెలు' గా పేరుపడిన ప్రత్యర్థి తెగ ధాటికి తట్టుకోలేక 'నల్ల గొర్రెలు' గా పిలువబడే ఈ తెగ అధికారాన్ని కోల్పోయింది. ఈ తెగనాయకులను ప్రత్యర్థి తెగవారు పట్టి, బంధించి నానా హింసలకు గురిచేయసాగారు. ఈ నేపథ్యంలో పరాజితులైన 'నల్ల గొర్రెలు' తెగకు నాయకుడైన ఒవైస్ కులీ తన కుమారుడు సుల్తాన్ కులీని, అతడికి తోడుగా తన సోదరుడు అల్లాకులీని భారత దేశానికి పంపించాడు. ఆ బాబాయి కొడుకులు ఆ విధంగా బహమనీ కొలువులో ప్రవేశించారు. అక్కడ వారికి సాదర స్వాగతం లభించింది.

బహమనీరాజు సుల్తాన్ కులీ పట్ల మక్కువ పెంచుకొన్నాడు ఆ యువకుడికి కూడా బహమనీ రాజ్యం బాగా నచ్చింది ఈ బాబాయి కొడుకులు ఇరువురు రెండవసారి భారతదేశం వచ్చిన తరువాత అల్లా కులీ తిరిగి వెళ్ళిపోయాడు. కాని సుల్తాన్ కులీ ఇక్కడ ఉండి పోయాడు. ఇరవై సంవత్సరాల నవ యువకుడైన కులీకి బహమనీ కొలువులో చిన్న ఉద్యోగం లభించింది.

సుల్తాన్ కులీ చాలా అందగాడు ఉత్సాహం గలవాడు యుద్ధవిద్యలలో నేర్పరి, విజ్ఞుడు. ఈ అర్హతల వల్ల అతడు అతి స్వల్ప కాలంలోనే పైకెదగగలిగాడు. మహమ్మద్‌షాలష్కరి కాలంలో దక్కన్‌లోకి విదేశీయుల ప్రవేశం అత్యధికంగా ఉండేది. రాజును ఆశ్రయించిన సన్నిహితులు విదేశీయులూ, దక్కనీలుగా విడిపోయారు. ఈ రెండు వర్గాల మధ్య నిరంతరం వివాదాలు, తగువులు సాగుతూ ఉండేవి. 1487 లో రాజు మహమ్మద్ (1482-1518) పైన దక్కనీయులు చేసిన హత్యా ప్రయత్నాలన్నీ సుల్తాన్ కులీ విఫలం చేశాడు. ఈ సంఘటన తర్వాత రాజవర్గాలలో అతడి పలుకుబడి గణనీయంగా పెరిగింది. 1493లో గోవాలో

తిరుగుబాటును కూడా కులీ అణచివేశాడు. ఈ విజయం తరువాత కుతుబ్-ఉల్-ముల్క్ అనే బిరుదు, తెలంగాణా గవర్నర్ పదవి కులీని వరించాయి. అతడి యుద్ధనైపుణ్యం, సాహిత్య ప్రావీణ్యాల కారణంగా అతడిని 'కత్తి-కలం' రెండింటినీ సమంగా నడుపగల 'సవ్యసాచిగా' కీర్తించారు.

సుల్తాన్ కులీని తెలంగాణా గవర్నర్‌గా నియమించిన తరువాత క్రీ.శ. 1495-96లో అతడికి గోలుకొండ కోటను కూడా జాగీరుగా బహూకరించారు. సుల్తాన్ కులీ ఆ కోటను పటిష్టం చేసి, మహమ్మద్ నగర్ అని నామకరణం చేసి, తన రాజధానిగా చేసుకొన్నాడు. మరికొన్ని పరగణాలను జయించి సుమారు 70 కోటలను ముట్టడించి తన రాజ్యపరిధిని మచిలీపట్నం వరకు విస్తరింపజేశాడు.

విదేశీయులు, దక్కనీయుల మధ్య వైరం వలన చివరకు బహమని రాజ్యం విచ్ఛిన్నం కాక తప్పలేదు. క్రీ.శ. 1518 నాటికి బహమనీ గవర్నర్లు ఒక్కొక్కరుగా స్వాతంత్రం ప్రకటించుకొన్నారు. అహమ్మద్‌నగర్, భోజపూర్, బెరార్, బీదర్, గోలుకొండ అనే ఐదు చిన్న రాజ్యాలలో గోలుకొండ చివరిది.

సుల్తాన్ కులీ క్రీ.శః 1501 లో తనను షియాగా ప్రకటించుకొన్నాడు. 'కుత్‌బా' నుంచి బహమని రాజు పేరును తొలగించి, పర్షియాకి చెందిన షా ఇస్మాయిల్ సఫనా పేరును చేర్చాడు. మసీదులలో మధ్యాహ్న ప్రార్థన తరువాత అధికారంలో ఉన్న చక్రవర్తి పేరిట 'కుత్‌బా' చదివేవారు. ఇస్లామ్‌లో సార్వభౌమత్వానికి ఇది ఒక సంకేతం. కుతుబ్‌షాహి వంశంలోని ఎనిమిది మంది రాజులలో ఆరవ రాజు కాలం వరకు షియా కుత్‌బా అమలులో ఉండేది. క్రీ.శ. 1633లో మొగల్ పాలకులతో 'లొంగుబాటు ఒప్పందం' జరిగిన పిదప దీనిని రద్దు చేశారు.

సుల్తాన్ కులీ నిజానికి బహమని రాజులనుంచి సర్వ స్వతంత్రుడే అయినప్పటికీ, ఆయన లాంఛనంగా తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించలేదు. అలాగే అతడు ఐదుసంవత్సరాల పాటు చిట్టచివరి బహమని రాజు అనంతరం కూడా ఉన్నప్పటికీ ఎప్పుడు 'రాజు' బిరుదాన్నీ స్వీకరించలేదు తొలి ముస్లిం రాజులకు

సాధారణ పర్యాయపదమైన 'సుల్తాన్' అనేది కూడా ఆయనకు పెద్దలు పెట్టిన పేరులోని భాగమే తప్ప బిరుదు కాదు. ఆయన పూర్తి పేరు సుల్తాన్ కులీ. అంటే రాజసేవకుడు అని అర్థం. బహమని సుల్తాన్ అతడికి ఇచ్చిన కుతుబ్-ఉల్-ముల్క్ బిరుదు నుంచి అతడి వంశం ఆ పేరు పెట్టుకుంది 'బారె మాలిక్' గా, అంటే గొప్ప చక్రవర్తిగా ఆయన అందరికి పరిచయం. సుల్తాన్ కులీ సమాధి పైన కూడా ఇదే పేరు ఉంది.

సుల్తాన్ కులీ ఇంచుమించుగా తొంబై సంవత్సరాల వయసు వరకు అంటే క్రీ.శ. 1543 వరకు పరిపాలించాడు. ఒకరోజు ఆయన ప్రార్థనలో ఉండగా హత్యకి గురయ్యాడు. ఆయన కుమారుడు జంషీద్ తో లాలూచీ పడి విరోధులు సుల్తాన్ కులీని హత్యచేసినట్లు చెప్పుకొంటారు.

**జంషీద్ :** జంషీద్, సుల్తాన్ కులీ పెద్ద కుమారుడు కాదు. ఈ రాజసింహాసనం కోసం జరిగిన పోరాటంలో రక్తధారలు ప్రవహించాయి. ఇతడు తన సోదరులలో ఒకడిని అంధుని చేశాడు. రెండవ సోదరుడైన ఇబ్రాహీమ్ పారిపోయి ముందు బాజీపూర్‌కు, అక్కడ నుంచి హిందూ రాజ్యమైన విజయనగరానికి చేరాడు. అక్కడ ఇబ్రాహీమ్‌కు ఏడు సంవత్సరాల పాటు రాజకీయ ఆశ్రయం లభించింది. విజయనగరం పాలకుడు రామరాజు అతడిని చాలా అభిమానంగా చూసుకొన్నాడు. అక్కడ ఇబ్రాహీమ్ భగీరథి అనే హైందవ మహిళను వివాహమాడాడు.

**ఇబ్రాహీమ్ కుతుబ్‌షా :** జంషీద్ 1543 నుంచి 1550 వరకు పాలించాడు. అతడు కడు శక్తిమంతుడైన రాజుగా ఎదగడమే కాక పొరుగున ఉన్న ప్రత్యర్థి అలీబరీద్ రాజ్యంలోని కొంతభాగాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. జంషీద్ రాచవ్రణం వల్ల మరణించాడు. జంషీద్ కుమారుడు సుభాన్ తన తండ్రి చనిపోయేనాటికి పసికందు ఫలితంగా రాజవంశీకులలో తదుపరి చక్రవర్తి ఎవరనే విషయమై వివాదం తలెత్తింది. రాజవంశ శ్రేయోభిలాషుల మనోభీష్టం, ప్రజాభిప్రాయం మేరకు విజయనగరంతో ప్రవాసంలో ఉన్న జంషీద్ సోదరుడు యువరాజు ఇబ్రాహీమ్‌ను పిలిచి సింహాసనం

అధిష్ఠింపచేశారు ఇతడు ఈ రాజవంశం స్థాపకుడైన సుల్తాన్ కులీకి ఆరవ, ఆఖరి కుమారుడు. అంతేకాదు, 'కుత్‌బా' పఠనం పర్షియా రాజు పేరున జరుగుతున్నప్పటికీ, రాజుగా ప్రకటించబడిన మొదటివాడు. సింహాసనం అధిష్టించే నాటికి ఇబ్రాహీమ్ వయసు 20 సంవత్సరాలు సింహాసన మెక్కిన తర్వాత జంషీద్ కుమారుడు బాల సుభాన్‌ను చంపేశారు. ఇతడి రాజ్యం కేవలం ఆరు నెలలు మాత్రమే సాగింది. అందుకే ఈ బాలపాలకుడికి కుతుబ్‌షాహిల చరిత్రలో అంత ప్రాధాన్యత లేదు.

ఇబ్రాహీమ్ తన రాజ్యంలో అప్పటివరకు కొరవడి ఉన్న శాంతి భద్రతలను నెలకొల్పాడు. దొంగలు, బందిపోట్లను రాజ్యం నుంచి తరిమివేశాడు. తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకొని విస్తరించాడు. వివిధ శాఖల అధికారులు, రాజవంశీకుల మీద నిఘా కోసం ఇతడు ఒక గూఢచారి విభాగాన్ని ప్రారంభించాడు. గోలుకొండ కోటను పునర్నిర్మించాడు. 800 మీటర్ల చుట్టుకొలత గల ప్రాకారాన్ని ఎనిమిది ఉక్కు ప్రవేశ ద్వారాలతో, బురుజులతో సుదృఢం చేశాడు. ఈ పనికి ఆ కాలంలోనే ఇరవై ఒక్క లక్షల రూపాయలు ఖర్చయ్యాయని అంటారు.

హిందూ సామ్రాజ్యమైన విజయనగర సామ్రాజ్యంలో రాజకీయ నిర్వాసితుడుగా చాలాకాలం ఉండటం అక్కడ ఒక హిందూ మహిళను వివాహం చేసుకోవడం స్థానిక భాష అయిన తెలుగుపట్ల, హిందూ ప్రజల పట్ల అతడి వైఖరిని ప్రభావితం చేశాయి. ఇబ్రాహీమ్ పార్సీ, ఉర్దూ, తెలుగు భాషలను సమంగా ఆదరించాడు. హిందువులలో ఇతడికి విశేష ప్రాచుర్యం ఉంది. ఇతడి పట్ల గల గౌరవం వల్ల హిందువులు 'మల్కిభ రాముడని' 'అభిరాముడని' పిలిచేవారు. ఇప్పటికీ గోలుకొండ కోట సమీపంలో అలనాటి నుంచీ నివాసముంటున్న, హిందూ మతానికి చెందిన 'లోథా'లు అతని పట్ల గల భక్తికి చిహ్నంగా ప్రతినెల ఇబ్రాహిమ్ కులీ కుతుబ్‌షా సమాధి వద్ద కానుకలు సమర్పించడం, గొర్రెలను బలి యివ్వడం గొప్ప విశేషం. దీర్ఘకాలం విజయనగరంలో అజ్ఞాతవాసం చేయడం వల్ల దక్కన్

రాజకీయాల పట్ల ఇతడికి మంచి అవగాహన ఏర్పడింది. ఇతడు మొగల్, ఇరానీ రాజదర్బారులకు తన ప్రతినిధులను పంపాడు.

ఇబ్రహీమ్ ప్రజోపయోగ కార్యాల పట్ల కడు శ్రద్ధ వహించాడు. హైదరాబాద్, సికిందరాబాద్ జంటనగరాలను కలుపుతున్న హుస్సేన్ సాగర్ సరస్సును ఇతడే నిర్మించాడు. హైదరాబాద్ నగరానికి 25 కి.మి. దూరంలో ఇబ్రహీమ్ పట్నం వద్ద కూడా ఇతడు మరో సరస్సును తవ్వించాడు. మూసీనది మీద మొదటి వంతెనను కూడా క్రీ.శ. 1578 లో ఈయనే కట్టించాడు. ఇప్పుడు మూసీపైన గల అయిదు వంతెనలలో ఇదీ ఒకటి. ఈ వంతెననే పురానా పూల్ (పాత వంతెన) అని పిలుస్తున్నారు.

విజయనగర సామ్రాజ్యం పైన దండెత్తడానికి 1564లో అహమ్మద్‌నగర్, బీజపూర్, బీదర్, గోలుకొండ సంస్థానాల కూటమి ఏర్పడడం ఇబ్రహీమ్ పరిపాలనా కాలంలోని ప్రధాన రాజకీయ, సైనికపరిణామంగా పేర్కొనవచ్చు. ప్రఖ్యాత తళ్లికోట యుద్ధం లేక బనిహట్టి యుద్ధం1565లో జరిగింది. విశిష్ట యుద్ధ వ్యూహం, విజయనగర రాజు రామరాయలు ప్రదర్శించిన మితిమీరిన ఆత్మవిశ్వాసం కారణంగాకూటమి సైన్యాలు అనూహ్యమైన ఘన విజయాన్ని సాధించాయి. దీనితో ఆ హిందూ సామ్రాజ్యానికి పెద్దదెబ్బ తగిలింది. అంతేకాక, దక్షిణ భారత చరిత్రను కూడా ఇది గొప్పగా ప్రభావితం చేసింది ఈ యుద్ధంలో సుమారు లక్షమంది చనిపోయారు. విజయనగర సామ్రాజ్య రాజధాని, విజయనగరాన్ని కూటమి సైన్యాలు కొల్లగొట్టాయి. కనీవినీ ఎరుగని ఈ దోపిడి కూటమి రాజ్యాలకు ఐశ్వర్యాన్ని చేకూర్చింది.

అయితే కూటమి ఏర్పడడం అన్నది కేవలం అవకాశవాద చర్య అని ఆ తర్వాత రుజువయ్యింది. తక్షణ లక్ష్యం సాధించిన వెంటనే అంటే విజయనగరాన్ని జయించిన వెంటనే కూటమి చీలిపోయింది. తళ్ళికోట విజయం తరువాత కొద్ది కాలానికే మన కథా నాయకుడు మహమ్మద్, ఇబ్రహీమ్ హిందూ భార్య భగీరథికి జన్మించాడు.

ఇబ్రహీమ్ తన సామ్రాజ్యాన్ని ప్రస్తుత ఒరిస్సా రాష్ట్రపు సరిహద్దుల వరకు విస్తరించాడు.

కోటలో రద్దీని, ఒత్తిడిని తగ్గించే ఉద్దేశంతో నగరాన్ని పశ్చిమదిశగా విస్తరించడానికి ఇబ్రహీమ్ కొన్ని చర్యలు తీసుకొన్నాడు. ప్రస్తుత ఇబ్రహీమ్ బాగ్ ఆ దిశలోనే ఉంది. కానీ, ఆ తరువాత నగరం మరోదిశగా విస్తరించింది.

1580లో ఇబ్రహీమ్ కుతుబ్ షా చనిపోయే నాటికి, గోలుకొండ సుదృఢమైన రాజ్యం అయింది. ఆ తర్వాత ప్రగతి, వైభోగాల యుగం ప్రారంభమయింది.

# అనగనగా ఒక యువరాజా

**జననం :** ఇబ్రహీమ్ క్రీ.శ. 1580లో చనిపోయాడు. మహమ్మద్ కులీ ఆయన పెద్ద కుమారుడు కాదు. ఇతడి జననంగురించి పెద్దగా వివరాలు లేవు. చాలా ఏళ్ళ తరువాత మహమ్మద్ కులీ ఆస్థానకవి 'విజాహి' తన 'కుతుబ్ ముష్కరీ' లో ఇతడి జననాన్ని గూర్చి కవి సహజమైన అతిశయోక్తులతో రాశాడు. కుమారుని జనన సందర్భంలో సుల్తాన్ ఇబ్రహీమ్ అనుభవించిన అపరిమితమైన ఆనందాన్నీ, ఆయన చేసిన అపారదానాలను 'విజాహి' తన కావ్యంలో వర్ణించాడు. ఆ సందర్భంగా జరిగిన ఉత్సవాలను గూర్చి ఆయన ఇలా రాశాడు!

"...................... ఈ ఉత్సవాలలో సేవలందించడానికి దేవతలు దిగివచ్చారు. వారికి రాజు సమర్పించిన బంగారంతో ఒక స్వర్ణగగనమే రూపొందింది. ఆకాశానికి కూడా అమితమయిన బంగారం లభించింది. ఆ బంగారాన్ని దాచుకొనే స్థలం వెదుకుతూ ఆకాశం రేయింబవళ్ళూ అటూ ఇటూ తిరుగుతూ వుండిపోయింది. (ఆకాశం అలా తిరుగుతుందనేది ఆనాటి నుంచి నేటి వరకు కూడా ఉర్దూ కవిత్వంలో కనిపించే విశ్వాసం) భూమికి కూడా అపార సంపద ఇచ్చారు. తన సంపదను దాచుకోడానికి స్థలం ఇవ్వమని భూమి స్వర్గాలను వేడుకోవలసి వచ్చినంత సంపదను ఇచ్చారు. అంతు లేని ఈ దాన ధర్మాలన్ని అయ్యాక రాజు రత్నాలతో స్వయంగా వసంతోత్సవాన్ని జరుపుకున్నారు. మహమ్మద్ కులీ జనన సందర్భంగా బంగారం మట్టికంటె చౌక అయిపోవటంతో విరివిగా పంచిపెట్టారు. ఎన్నో ఆభరణాలు, వజ్రవైఢూర్యాలు నేల అంతటా విరజిమ్మినట్లు చెల్లాచెదురుగా పడి ఉండడంతో సరసులలోని హంసలు ఆహారాన్ని ఏరుకోడానికి ఒడ్డుకు చేరాయి. బంగారం విలువ పడిపోవడం వల్ల వన్నె కోల్పోయింది......"

మహమ్మద్ జనన కాలాన వేసిన జాతకచక్రం అతడిని "ప్రపంచ మానవాళికి అన్నపానీయాలు సమకూర్చే వాడి" గా పేర్కొంది.

ఇక్కడ రెండు విషయాలు గ్రహించడం అవసరం. విజయనగర సామ్రాజ్యాన్ని అణిచివేసిన తళ్ళికోట యుద్ధం జరిగిన సంవత్సరంలోనే అతడు పుట్టి ఉంటాడు. భవిష్యత్ సుల్తాన్‌కు శక్తివంతమైన పొరుగు రాజ్యం నుండి సహజంగా ఉండే ప్రమాద భయాన్ని లేకుండా చేయుటం కోసమే ఆ యుద్ధం జరిగి వుంటుంది. ఇది మొదటి అంశం. ఇతను హిందూ విజయనగర రాకుమారికి జన్మించిన చక్రవర్తి కనుక అతని ఆలోచనల పైన, దృక్పథం పైన, ప్రవర్తన పైన ఆ ప్రభావం వుండవచ్చుననేది మనం గమనించవలసిన రెండవ అంశం.

**సింహాసనారోహణ** : మహమ్మద్ కులీకి ఇద్దరు జ్యేష్ఠ సోదరులు ఉన్నారు. సహజంగానే, సింహాసనాన్ని అధిష్టించగలనని అతడు ఆశించి ఉండడు. అయితే అతడి అన్నలలో ఒకడైన అబ్దుల్ ఖాదిర్ తండ్రికంటె ముందు చనిపోయాడు. దానితో సింహాసనానికి ఒకే ఒక్క జ్యేష్ఠ సోదరుడు పోటీదారుగా మిగిలాడు. కులీకి ముందు మధ్యయుగ భారతీయ చరిత్రలో ఇటువంటి సందర్భాలలో సామాన్యంగా జరిగే యుద్ధం, రక్తపాతం వంటి హింస కులీ సింహసనారోహణ సమయంలో జరిగిన దాఖలాలు లేవు. అయితే పదిహేను సంవత్సరాల బాల యువకుడు కులీని సింహాసనం మీద కూర్చుండ బెట్టడానికి కొన్ని కుట్రలూ కుతంత్రాలూ జరిగాయి. ఇతనికి ముగ్గురు కనిష్ట సోదరులున్నారు. వారిలో ఇద్దరు ఇతని పరిపాలన ప్రారంభ కాలంలో చనిపోయారు. చివరి సోదరుడికి, కులీతో సత్సంబంధాలుండేవి. ఆఖరి దశలో ఒక్కసారి తప్ప ఎప్పుడూ అతనితో కులీకి ఎలాంటి ఇబ్బందులూ యెదురు కాలేదు.

మహమ్మద్ కులీ రాజ్యాభిషేకం సమయంలో అతని అన్న యువరాజు హుస్సేన్ కులీకి, గోలుకొండ ప్రధాని మీర్‌షా మీర్ కుమార్తెతో వివాహం నిశ్చయమై వుంది. ఇబ్రహీమ్ మరణసమయంలో మీర్‌షా బీజపూర్ సుల్తానుకు వ్యతిరేకంగా, నిజామ్‌షాహి సైన్యం వెంట గోలుకొండ దళాన్ని నడిపిస్తూ నల దుర్గంలో ఉన్నాడు. మీర్ షా మీర్ సహజంగానే తన కాబోయే అల్లుడికి రాజ్యం దక్కాలని ప్రయత్నించి ఉండేవాడు. కాని, ఆయన రాజధానిలో లేకపోవడం మహమ్మద్

కులీకి అనుకూలించింది. ఈ విధంగా కులీ అభిమానులకు అతని పట్టాభిషేకానికి తగిన వ్యూహరచన చేసే అవకాశం లభించింది. కొందరు ఉన్నత రాజుద్యోగులను కలుపుకొని కులీ తనను రాజుగా ప్రకటిస్తున్నట్లు తండ్రి ఇబ్రహీమ్ పేరిట వీలునామాను సృష్టించాడు. మీర్‌షామిర్ రాజధానికి తిరిగి వచ్చి మారిన పరిస్థితులలో తన కుమార్తెను కులీ అన్నకు బదులు, మహమ్మద్ కులీకి ఇచ్చి వివాహం చేశాడు. యువరాజు కులీ బహుశ మీర్‌షామీర్ మద్దతు పొందడం కోసం, తన పరిస్థితిని స్థిరపరచుకోవడం కోసం ఈ వివాహం చేసుకొని వుంటాడు.

నల దుర్గం ముట్టడి అప్పటికి కొంతకాలంగా కొనసాగుతూ వున్నదే. సైన్యంలో నైతిక బలాన్ని పెంచడంకోసం, స్వయంగా సైన్యానికి నాయకత్వం వహించమని మీర్‌షామీర్ కొత్త రాజుకు సలహా యిచ్చాడు. పరిపాలన ప్రారంభంలోనే విజయం సాధించడం కూడా రాజుకు శుభ ప్రారంభం అవుతుందని హితైషులు భావించారు. మహమ్మద్ కులీ స్వయంగా సైన్యానికి నాయకత్వం వహించాడు. ప్రత్యర్థి సైన్యానికి చాంద్ బీబీ నాయకత్వం వహించింది. ఆమె సైన్యాధికారులు కులీ సైన్యాన్ని వేధించి చంపడానికి 'బెర్గీ' అనే మరాఠి, గెరిల్లా దళాలను వినియోగించారు. ఈ దళాలు శత్రు సైన్యానికి ఆహార సరఫరాను నిరోధించి, క్షామంలో చిక్కుకొనేలా చేశాయి. ఈ విధంగా ఇరుపక్షాల ఈ యుద్ధం ఎలాంటి ఫలితం లేకుండా ఒక సంవత్సరకాలం కొనసాగింది విసుగు చెందిన కులీ వ్యక్తిగత పర్యవేక్షణ విరమించుకుని రాజధానికి తిరిగి వచ్చాడు.

ఈ విఘాతం వల్ల సహజంగానే కులీకి ప్రధాని (మామగారు) సలహా పట్ల అనుమానాలు రేకెత్తాయి. ఫలితంగా ఆయనను పదవి నుంచి తొలగించి పర్షియాకు పంపించాడు. కానీ, ప్రధాని మార్గమధ్యంలోనే చనిపోయాడు. ఈ ప్రధాని కుమార్తె అయిన మహమ్మద్ కులీ భార్య గురించి తదుపరి ఎక్కడా ప్రస్తావన లేకపోవడం వల్ల తండ్రి వెంట బహుశ ఆమెను కూడా పర్షియాకు పంపించి ఉంటారని భావిస్తున్నారు.

**తిరుగుబాటు!** ఆ తరువాత కులీ అలీఖాన్ లూర్ చేసిన తిరుగుబాటును అణచవలసి వచ్చింది. లూర్ తిరుగుబాటు తొలుత పరిపాలనకు సంబంధించిన చిన్న సమస్యగా ప్రారంభమైంది. ఇప్పటిగుంటూరు జిల్లాలోనికొండవీడు దుర్గానికి అధిపతిగా లూర్‌ని నియమించడం జరిగింది. అయితే అతను ఆ బాధ్యతను స్వీకరించడానికి వెళ్ళినప్పుడు అక్కడి దుర్గాధిపతి ఎదురుతిరిగాడు. లూర్ ఆ విషయాన్ని తన రాజుకు విన్నవించుకోకుండా, ఒకప్పటి విశాల విజయనగర సామ్రాజ్యంలో మిగిలిన పెనుకొండ రాజ్యాన్ని పాలిస్తున్న వెంకటపతిరాజు సహాయాన్ని కోరాడు. తరుచుగా ఒకరిపై ఒకరు కత్తులు దూసుకుని మధ్యయుగ సంప్రదాయానుసారం శాశ్వత విధేయత లనేవి ఉండని ఆనాటి స్థితికి అనుగుణంగా లూర్ తన సొంత సైన్యాన్ని సమకూర్చుకొని కొన్ని దుర్గాలను విజయవంతంగా స్వాధీనం చేసుకొన్నాడు. కాని అచిర కాలంలోనే గోలుకొండ సైన్యాలు అతన్ని ఓడించి హతంచేశాయి. ఈ సందర్భంగా వెంకటపతి చేతిలో కుతుబ్‌షాహి సైన్యాలు కొన్ని ఇబ్బందులు ఎదుర్కోక తప్పలేదు.

ఈ తిరుగుబాటు కుతుబ్‌షాహి సైనిక వ్యవస్థలో, పౌరపాలనా వ్యవస్థలో పునర్వ్యవస్థీకరణకు దారి తీసింది ఆ తర్వాత తనకు వ్యతిరేకంగా లూర్‌కు సహాయం చేసిన వెంకటపతి వ్యవహారాన్ని తేల్చుకోకముందే కులీ నూతన రాజధాని నగర నిర్మాణానికి పూనుకొన్నాడు. ఈ మధ్యకాలంలోనే మహమ్మద్ కులీ తన పాత ప్రత్యర్థి బీజపూర్ సుల్తాన్‌తో కూడా యుద్ధం చేయవలసి వచ్చింది.

**వెంకటపతితో ఘర్షణ :** కులీ క్రీ.శ.1597 లో బలమైన సైన్యాన్ని దక్షిణ దిశ దండయాత్రకు పంపాడు. ప్రధాన సైన్యాన్ని ఆయన స్వయంగా నడిపాడు. నంద్యాల, కలగూరు హిందూ రాజులను సులభంగానే జయించాడు. కప్పం చెల్లిస్తూ సామంతులుగా ఉండాలనే షరతు మీద వారి సంస్థానాలను వారికే వదిలేశాడు. ఆ తరువాత కులీ కృష్ణానది దాటి గుత్తి, కర్నూలు గండికోట కోటలను ఆక్రమించాడు.

ఈ విజయాలు కులీకి వెంకటపతి రాజు రాజధాని పెనుగొండ మీద దాడి

చేసే గుండె ధైర్యాన్నిచ్చాయి. కానీ విచిత్రంగా అక్కడ కులీ యెటువంటి ప్రతిఘటననూ ఎదుర్కోలేదు. మూడు రోజుల పాటు పోరాట విరమణ పాటిద్దామని, ఆతర్వాత శాంతి ఒప్పందం కుదుర్చుకుందామని వెంకటపతిరాజు ప్రతిపాదన చేశాడు. సుల్తాన్ దానికి అంగీకరించాడు. రాజావారు ఈ మూడు రోజుల సమయాన్నీ శాంతి ప్రయత్నాలకు కాక, ఎదురుదాడికి అవసరమైన ఏర్పాట్లు చేసుకోడానికి ఉపయోగించుకొన్నాడు. ఈ ద్రోహానికి మండిపడ్డ మహమ్మద్ కులీ దాడికి ఆదేశించారు. అయితే అతడి సైన్యాధికారులు వద్దని సలహా యిచ్చారు. ముట్టడి దీర్ఘకాలం కొనసాగుతుందని, తమ వెనుక ప్రవహిస్తున్న కృష్ణానదికి త్వరలోనే వరదలు వచ్చే ప్రమాదం ఉందనీ హెచ్చరించారు. పెన్నానది ఒడ్డున జరిగిన యుద్ధాలలో అంతకుముందు మహమ్మద్ కులీ సైన్యాలు అనేక ఎదురుదెబ్బలు తిని ఉన్నాయి. దానితో కులీ పెన్నా, కృష్ణనదుల మధ్యగల ప్రాంతానికి తగిన రక్షణ ఏర్పాట్లు చేసి వెనక్కు తప్పుకున్నాడు.

అయినా వెంకటపతి సుల్తాన్ సైన్యాలను వెంటాడి వేధించడం కొనసాగించాడు. దానికి తోడు తన సైన్యాధి కారుల మధ్య విభేదాలు తలెత్తడంతో కులీ పరిస్థితి మరింత బలహీనపడింది. ఫలితంగా మహమ్మద్ కులీ సైన్యాలు పరాజయం పాలయ్యాయి. ఈ విధంగా కుతుబ్‌షాహి సరిహద్దులు తూర్పున కృష్ణానది వరకే కుదించుకు పొయ్యాయి. కృష్ణ అవతల అతనికి మిగిలిన ఏకైక మార్గం కొండవీడు.

తూర్పు సరిహద్దులలో కూడా సమస్యలు తలెత్తాయి తిరుగుబాటు దారులకు, స్వార్థ పరశక్తులకు వెంకటపతి రాజు సహాయ సహకారాలందించాడు. అయితే సుల్తాన్, అమన్-ఉల్-ముల్క్ ద్వారా తిరుగుబాటు దారులను అణచివేశాడు. కొండపాడు దుర్గాన్ని రక్షించుకోగలిగాడు. ఆ తరువాత ప్రస్తుత ఒరిస్సా రాష్ట్రం సరిహద్దుగా గల ఈశాన్య సరిహద్దులో వరుసగా తిరుగుబాట్లు చెలరేగాయి అయితే అక్కడ సమస్యను పరిష్కరించడంలో కులీ సఫలీ కృతుడైనాడు.

# బీజపూర్

పడమటి సరిహద్దులలో ఒక వైపున బీజపూర్‌తో మరో వైపున అహమ్మద్‌నగర్‌తో కులీ ఒకేసారి తలపడవలసి వచ్చింది. బీజపూర్ ఓడిపోయింది. ఆ తర్వాత బీజపూర్, గోలుకొండల మధ్య ఒక రాజకీయ ఒప్పందం కుదిరింది. మహమ్మద్ కులీ తన సోదరి చాంద్ సుల్తానాని బీజపూర్ సుల్తాన్ ఇబ్రాహీమ్ ఆదిల్‌షా కిచ్చి వివాహం చేశాడు. ఈ వివాహం రాకుమారి పరోక్షంలో జరిగింది.

# కపట సుల్తాన్

సరిహద్దు సమస్యలే కాకుండా, కులీని చికాకు పరిచిన ఒక ఆసక్తికరమైన సంఘటన ఈ సమయంలోనే జరిగింది. మహమ్మద్ కులీ పెద్దన్న అబ్దుల్ ఖాదర్ షా ఖలీలుల్లా కిర్మానీ కుటుంబంలోని ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకొన్నాడు. యువరాజును షా సాహెబ్ బిరుదుతో వ్యవహరించేవారు. ఇబ్రాహీమ్ కాలంలో ఏదో తప్పు చేసినందువల్ల షా సాహెబ్‌ను దేవరకొండ దుర్గంలో వుంచారు. అక్కడ అతను అనారోగ్యానికి గురై మరణించాడు.

1592లో అబ్దుల్ ఖాదిర్ వయసు గల ఒక వ్యక్తి బీదర్‌లో తనే అసలైన యువరాజుననీ, తను చనిపోలేదని, దేవరకొండ చెరసాలనుంచి తప్పించుకొన్నానని ప్రకటించాడు. షా ఖలీలుల్లా కిర్మాని కుటుంబం అతన్ని సమర్థించి మహమ్మద్ కులీ ప్రోద్బలంతో అలీ బరీద్ ఖైదు నుంచిన షా సాహెబ్‌ను విడిపించింది.

ఈ కొత్త ఖాదిర్ కొందరు దుష్టశక్తులను కూడగట్టుకొని కృష్ణానది ఒడ్డున చేరి తానే గోలుకొండ సుల్తానునని ప్రకటించుకొన్నాడు. మహమ్మద్ కులీ కొంత సైన్యాన్ని కొండవీడు సైన్యాధికారి నాయకత్వంలో అతని పైకి పంపాడు. కొద్దిపాటి ప్రతిఘటన తర్వాత కులీ సైన్యం అతన్ని అణచివేసింది. అతను బీజపూర్‌కు పారిపోయి చరిత్రస్మృతి పథం నుంచి అదృశ్యమైపోయాడు.

ఇదే విధంగా కులీ మరో సోదరుడు ఖుదాబందాకు సంబంధించిన మరో సంఘటన జరిగింది. బహమని కాలం నుంచి 'విదేశీయుల'కు, దక్కనీయులకు

మధ్య నిరంతర వివాదం కొనసాగుతూ వస్తోంది. మహమ్మద్ కులీ పరిపాలన చివరి సంవత్సరాలలో కొందరు మొగలాయీలు హుస్సేన్‌సాగర్‌కు అభిముఖంగా ఉన్న నౌబత్ ఘాట్ వద్ద గల రాజమండపంలోకి చొచ్చుకువచ్చారు. ఆ మీదట సుల్తాన్ ప్రభుత్వ ఉద్యోగాలలో లేని మొగలాయీలను, పఠానులను, అరబ్బులను బహిష్కరించమని ఆదేశించాడు. అయితే వారిని హత్యచేశారనే పుకారు నగరంలో వ్యాపించింది. ఈ పుకారుతో అల్లర్లు చెలరేగి మొగలుల ఆస్తుల దోపిడి విధ్వంసం కొనసాగాయి. ఈ అల్లర్లను కులీ కఠిన చర్యలతో అణచివేశాడు.

ఈ చర్యతో రెచ్చిపోయిన దక్కనీయులు సుల్తాన్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటు, సుల్తాన్ అనుసరించిన షియా తత్వానికి వ్యతిరేకంగా, రాజదర్బారులో పెరిగిన ఇరానీయుల ప్రాబల్యానికి వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటు దక్కనీయులు ఖుదాబందాను తమనాయకుడిగా ఎన్నుకొన్నారు. అయితే కులీ ఈ తిరుగుబాటును కూడా అణచివేసి, ముఠానాయకులను జైళ్ళలో బంధించాడు. ఖుదాబంధాను నిర్బంధంలో ఉంచాడు. అతను 1611లో నిర్బంధంలోనే చనిపోయాడు.

## విదేశీ సంబంధాలు

విదేశీ సంబంధాల విషయానికి వస్తే, మహమ్మద్ కులీ ఉత్తర భారతంలో బృహత్తర శక్తిగా ఉన్న మొగలాయి చక్రవర్తులతో వ్యవహరించవలసి ఉంది. కులీ పరిపాలనా కాలం అక్బర్ చక్రవర్తి పాలన ఆఖరి పాదంతోనూ, జహంగీరు పాలన ప్రథమ పాదంతోనూ సమకాలీనమై ఉంది.

# మొగలాయీ చక్రవర్తులు

మొదటి నుంచీ కూడా మొగలు చక్రవర్తుల ఆధిపత్యాన్ని గుర్తించడం జరిగింది. తైమూర్ భారతదేశం మీద దండెత్తి ఢిల్లీకి వచ్చినప్పుడు 1398లో బహమనీరాజు ఫిరోజ్ షా తన దూతను పంపి అతని పట్ల తన గౌరవాన్ని ప్రకటించాడు ఫలితంగా తైమూర్ దక్కన్‌తోపాటు మాళ్వా, గుజరాత్ సార్వభౌమాధికారాన్ని ఫిరోజ్‌షాకు దఖలుపరుస్తూ ఫర్మానా జారీచేశాడు. అతనికి "ఫరజంద్-ఇ-ఖైర్ ఖ్వా" (శ్రేయోభిలాషి పుత్రుడు) అనే బిరుదాన్ని కూడా తైమూర్ ఇచ్చాడు. తైమూర్ తన కుమారులలో ఒకరిని భారతదేశాన్ని పాలించేందుకు పంపేపక్షంలో అవసరమైన సైనిక సహాయాన్నీ అందిస్తానని కూడా ఫిరోజ్‌షా వాగ్దానం చేశాడు. 1526లో మొదటి పానిపట్టు యుద్ధం తరువాత బాబర్‌కి కూడా సుల్తాన్ కులీతో సహా దక్కన్ సుల్తానుల నుంచి అభినందన సందేశాలు అందాయి. బాబర్‌కు వారు తమ విధేయతను ప్రకటించారు. అయితే బాబర్ఎక్కువ కాలం జీవించలేదు. ఆ తరువాత హుమాయూన్ దీర్ఘకాలం ప్రవాసంలో వుండవలసి వచ్చిన కారణంగా చివరి దశవరకు తన విజయాలను పటిష్ట పరచుకోలేక పోయాడు. అయితే, హుమాయూన్ అహమదా బాదును, గుజరాత్‌లోని చాలా భాగాలను స్వాధీనం చేసుకొన్న తరువాత దక్కన్ సుల్తానులు ఒకవైపున హుమాయూన్ ఖందేష్‌ను వదలివేయమని వేడుకొంటూనే మరోవైపున అవసరమైతే హుమాయూన్ కు వ్యతిరేకంగా పోరాడడానికి కూటమి ఏర్పరిచే ప్రయత్నాలు సాగించారు. సుల్తానులలో ఎవ్వరినీ స్వతంత్ర రాజకీయ శక్తిగా బాబర్ వారసులు గుర్తించలేదు. మొగల్ దర్బార్ గుర్తింపు కూడా వారికి లభించే అవకాశాన్ని ఇవ్వలేదు.

ఉత్తర దిశలో గట్టిగా వేళ్ళూనిన తరువాత అక్బరు విషయంలో ఒక స్పష్టమైన విధానాన్ని రూపొందించడం ఆరంభించాడు. మొఘల్ సామ్రాజ్య రక్షణలో ఉన్న రాజులుగా దక్కన్ సుల్తానులను అబుల్‌ఫజల్ అభివర్ణించాడు. సుల్తానులు మాత్రం

మొగల్ చక్రవర్తిని బలమైన శత్రువుగా పరిగణించారు. చక్రవర్తిని సంతృప్తునిగా ఉంచాలనీ, అయితే సాధ్యమైనంత దూరంగానే ఉంచాలనీ సుల్తానులు తలపోశారు. సుల్తానులు అక్బరుకు వ్యక్తిగత కానుకలతో కూడిన పేష్కష్‌లు సమర్పించారు. గుజరాత్ మొగలాయిల స్వాధీనం అయిన తరువాత, దక్షిణం వైపు పయనించడానికి అక్బరుకు ప్రోత్సాహం లభించింది. ఖందేష్ రాజు అలీఖాన్ ఫరూఖి తనంత తానుగా అక్బరుకు దాసుడయ్యాడు. అక్బరు కోసం యుద్ధం చేస్తూ మరణించాడు. ఆ తర్వాత అక్బర్ అహమద్‌నగర్ దండయాత్రను చేపట్టాడు. అంతర్గత తగువులు, ముఠాలు ఉన్నప్పటికీ అహమద్‌నగర్ గట్టిగా ఎదిరించింది. అయితే అప్పుడు అహమద్‌నగర్‌లో పరిస్థితి మహాగందరగోళంగా ఉంది. విదేశీయులు, దక్కనీయుల మధ్య విభేదాలు పరిస్థితిని మరింత అగమ్యగోచరం చేశాయి. దానికితోడు వేర్పాటు వాదం తలెత్తింది. అహమద్‌నగర్ అధికార షియామతాన్ని మహదాలీ అనుచరులు సవాలు చేశారు. ఈ పరిస్థితుల్లో అహమద్‌నగర్ స్వాతంత్ర్యాన్ని రక్షించడం కోసం, మహా శక్తివంతమైన మొగల్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా చాంద్ బీబీ నడిపిన సాహసోపేతమైన పోరాటాన్ని గుర్తించడం అవసరం. ఈ పోరాటంలో చాంద్ బీబీ కోరిక మేరకు మహమ్మద్ కులీ బీజపూర్ పాలకులతో కలిసి ఆమెకు సహాయాన్ని అందించాడు సుల్తానుల మధ్య ఏర్పడిన సయోధ్య అహమద్‌నగర్‌ను రక్షించింది. అక్బర్ కుమారుడు, యువరాజు మురద్ సారధ్యంతో నడిచిన మొగల్ సైన్యాలకు ఎదురుదెబ్బ తగిలింది ఈ ఎదురుదెబ్బ 1595 లో శాంతి ఒప్పందానికి కారణమయ్యింది. అహమద్‌నగర్ శాంతికోసం బీదర్‌ను మొగలులకు అప్పగించింది.

మొగల్‌రాజులు తిరిగి 1597లో మరోమారు అహమద్‌నగర్ వైపు దండెత్తారు అదే విధంగా చాంద్‌బీబీ సహాయం కోసం చేసిన విజ్ఞప్తికి బీజపూర్, గోలుకొండ రాజ్యాలు సానుకూలంగా ప్రతిస్పందించాయి. బీజపూర్, గొలుకొండ సైనికులు మొగల్ సైనికులను పెద్ద సంఖ్యలో హతమార్చినప్పటికీ సమన్వయ లోపం వల్ల విజయం చేజిక్కలేదు. తీవ్ర ప్రతిఘటన తరువాత అహమద్‌నగర్

లొంగిపోయింది. చాంద్‌బీబీని ఆమె అనుయాయులే హత్య చేశారు.

చాంద్ బీబీ ప్రదర్శించిన అసమాన ధైర్య సాహసాల స్ఫూర్తిని ఒకనాటి నీగ్రో బానిస మాలిక్ అంబర్ కొనసాగించాడు. మొగలులకు తీవ్ర సమస్యలు సృష్టించి వారినుంచి అహమద్‌నగర్‌ను స్వాధీనం చేసుకొన్నాడు. బీజపూర్‌కుచెందిన ఇస్మాయిల్ ఆదిల్‌షా, మహమ్మద్ కులీల నుంచి మాలిక్ అంబర్ సహాయాన్ని అర్థించి వారి నుంచి సహాయ సహకారాలను పొందగలిగాడు. తను గనుక ఓడిపోతే సుల్తానుల పరాజయం కూడా ఎంతో దూరంలో ఉండదని మలిక అంబర్ వారిని హెచ్చరించి నచ్చజెప్పాడు.

ఈ విధంగా మహమ్మద్ కులీ నేరుగా మొగలులతో సంఘర్షణకి దిగక పోయినప్పటికీ, మొగలుల దాడి నుంచి అహ్మద్‌నగర్‌ను రక్షించడంకోసం సహాయం అందించాడు ఒకవంక అక్బరుకు కప్పంచెల్లిస్తూ మరోవైపు అక్బరుకు వ్యతిరేకంగా అహమద్‌నగర్‌కు సహాయం అందించాడు. ఇతర సుల్తానులతో కలిసి సుల్తాన్ కులీ, సుహృద్భావ సంబంధాల సముద్ధరణ కొరకు తన ఆస్థానంలో ఒక ప్రతినిధిని నియమించవని అక్బరుకు సూచించాడు. అక్బర్ నుంచి వెంటనే ఎలాంటి ప్రతిస్పందన రాలేదు. కొంతకాలం తరువాత అక్బరు తన రాజకీయ ప్రతినిధిగా మసూద్ బేగ్‌ను గోలుకొండ పంపించాడు.

పేష్కష్( కప్పం) చెల్లింపులను మహమ్మద్ కులీ ఆ తరువాత జహంగీర్‌కు కూడా కొనసాగించాడు.

## పర్షియాతో సంబంధాలు

అప్పట్లో పర్షియాగా పిలువబడిన నేటి ఇరాన్‌తో కులీ సంబంధాలను చర్చించకుండా మహమ్మద్ కులీ విదేశీ విధానం పైన చర్చ పూర్తి కాదు. పర్షియా, హిందూస్తాన్ లేక మొగల్ ఇండియా రెండు కూడా అప్పటి ప్రపంచం గుర్తించిన దేశాలని గుర్తుంచుకోవాలి. కాగా, గోలుకొండ కేవలం ఒక ప్రాంతీయ రాజ్యం మాత్రమే అయినప్పటికీ గోలుకొండ పర్షియాతో రాజకీయ సంబంధాలను

యేర్పరచుకోవడం ద్వారా మొగలులను దూరంగా ఉంచగలిగింది. వారి మధ్య రాజనీతిశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే త్రికోణ సంబంధం అమలులో ఉండేది.

ఇంతకుముందే చెప్పినట్టు, కుతుబ్‌షాహి రాజవంశాన్ని స్థాపించిన మహమ్మద్ కులీ 'కుత్‌బా' లో మహమ్మద్‌షా బహమని పేరు తొలగించి, షా ఇస్మాయిల్ సఫవీ పేరును చేర్చాడు. ఇస్మాయిల్ కుమారుడు థెమస్ప వద్దకు సుల్తాన్ కులీ తన రాయబారిని పంపాడు. ప్రతిగా థెమస్ప వజ్రాలు పొదిగిన ఒక కిరీటాన్ని కులీకి పంపించాడు ఇరాన్‌కు చెందిన షా అబ్బాస్ I తన రాయబారిని దక్కన్ సుల్తాను వద్దకు పంపాడు రాయబారిగా వచ్చిన వ్యక్తి 'కార్ఖ్యారక్' అంటే ఆయుధగార ప్రధానాధికారి అని అర్థం ఆయుధాగార ప్రధానాధికారని రాయబారిగా పంపడంలో అబ్బాస్I ఉద్దేశం సైనిక విషయాలలో సలహాలు ఇవ్వడానికి సంసిద్ధతగా భావించవచ్చు. మహమ్మద్ కులీ షా అబ్బాస్I వద్దకు ఖాజా ముస్తసా నాయకత్వంలో తన మొదటి ప్రతినిధి బృందాన్నీ పంపాడు. ప్రతినిధి బృందం చేతికి కులీ, అద్భుతమైన గద్య, పద్యాలతో రాసిన లేఖను కూడా పంపాడు. ఈ లేఖలో కులీ పర్షియా పట్ల తన విధేయతను వ్యక్తం చేయడమే కాక, మొగలాయిల మీద తీవ్ర ఆరోపణలు కూడ చేశాడు. ఇందుకు బదులుగా పర్షియా క్రీ.శ. 1604లో కులీ వద్దకు తమ ప్రతినిధి బృందాన్ని పంపింది. ఈ ప్రతినిధి బృందానికి కులీ గోవా తీరాన బ్రహ్మాండమైన స్వాగతాన్ని ఏర్పాటుచేశాడు. పర్షియన్ చక్రవర్తి తన ప్రతినిధి బృందం ద్వారా కులీకి ఒక కిరీటాన్నీ, ఓ లేఖను పంపాడు పర్షియా ప్రతినిధి బృందంలో సుమారు వందమంది సైనిక నిపుణులు ఉన్నారు. వారు కుతుబ్‌షాహి సైన్యానికి సూచనలు, శిక్షణ ఇచ్చి ఉండవచ్చు. సుల్తాన్ ఏకైక కుమార్తె హయత్ బక్షి బేగంను, హైదరాబాదులో ఆరు సంవత్సరాలుగా నివాసముంటున్న ఒక పర్షియన్ రాకుమారునికి యిచ్చి వివాహం చేసే ప్రతిపాదన సఫలం కాలేదు.

గోలుకొండ పట్ల మొగలు చక్రవర్తి జహంగీర్‌కు మంచి అభిప్రాయం కల్గించేందుకు మహమ్మద్ కులీ, పర్షియా చక్రవర్తి అబ్బాస్I పలుకుబడిని కూడా వినియోగించుకొన్నాడు. మహామ్మద్ కులీ చనిపోయినప్పుడు అబ్బాస్-I సుల్తాన్

ను ప్రశంసిస్తూ కులీ వారసుడికి ఒక సంతాప సందేశాన్నీ పంపాడు. మహమ్మద్ కులీ పేష్వా అయిన మీర్ ముహమ్మద్ మూమిన్ తో కూడా పర్షియా చక్రవర్తి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే వాడు.

కుతుబ్‌షాహీలు స్వచ్ఛందంగానే పర్షియా చక్రవర్తిని చక్రవర్తిగా గుర్తించారు. సాధారణంగా షియాల మధ్య ఉండే సంబంధాల వంటివే ఇరువురి మధ్య ఉండేవి. మొగలులకు వ్యతిరేకంగా గోలుకొండకు ఎలాంటి సైనిక సహాయాన్ని పర్షియా ఇవ్వలేదు. అయితే పర్షియాతో గల స్నేహ సంబంధాల వల్ల గోలుకొండకు దౌత్యపరమైన ప్రయోజనాలు చేకూరాయి. పర్షియాను మొగలులకు వ్యతిరేకంగా నిలబెట్టాలని కుతుబ్‌షాహీలు వ్యర్థ ప్రయత్నాలు చేశారు. ఈ విషయంలో భౌగోళిక అంశాలు అనుకూలించలేదు. అధికార సమతూకంలో పర్షియాకు భౌగోళిక దూరం అవరోధమయింది.

**వ్యాపార వాణిజ్యాలు :** రాజకీయ సంబంధాలతో పాటు పర్షియాతో గోలుకొండకు విస్తృత వ్యాపార వాణిజ్య సంబంధాలు కూడా ఉండేవి. మచిలీపట్నం రేవు నుంచి పర్షియాకు ఎగుమతి అయ్యే వస్తువులలో వస్త్రాలు, పొగాకు, తుపాకీ మందు, చెక్క వస్తువులు రూబీలు ప్రధానంగా ఉండేవి. కాగా, తివాచీలు, గాజూ, పింగాణీసామాను, వెండి, ముత్యాలు, పళ్ళు, గుర్రాలు పర్షియా నుంచి ప్రధానంగా దిగుమతి అయ్యేవి. వాణిజ్య సంబంధాలు పరస్పరం ఎగుమతి దిగుమతులకే పరిమితం కాలేదు. తూర్పు దేశాలతో పర్షియాకు గల వాణిజ్య సంబంధాలలో గోలుకొండ ప్రధాన భూమికను పోషించింది. అదే విధంగా గోలుకొండకు కోరమాండల్ తీర ప్రాంతానికి పశ్చిమదిశగా గల వాణిజ్య సంబంధాల విషయంలో పర్షియా ముఖ్యపాత్ర పోషించింది. ఉభయ పక్షాల నుండి బానిసలు కూడా ఎగుమతి దిగుమతి అయ్యేవారు.

వాస్తుశిల్పులు, భవన నిర్మాణ నిపుణులు వృత్తి నిపుణులు, పుస్తకాలు; పుస్తకాల బైండింగ్ సామగ్రి వంటి వస్తువులు కూడా పర్షియా నుంచి వచ్చేవి. గ్రీసో అరబ్' లేక యునాని గోలుకొండలో ప్రధాన వైద్య విధానంగా ఉండేది. ఈ

వైద్య విధానంలో నైపుణ్యంగల వైద్యులు పర్షియా నుంచి గోలుకొండకు వచ్చారు. షంషుద్దీన్, సైఫుద్దీన్, మహమ్మద్ కులీ కాలంలోని ప్రముఖ యునానీ వైద్యులు ఉన్నత స్థాయి పరిపాలన సైనిక అధికారాలు వాస్తవానికి పర్షియన్ల చేతిలో ఉండేవి పర్షియా నుంచి ఈ నిరంతరమయిన వలస కారణంగా నిత్య జీవితంలోని వివిధ రంగాలలో, పరిపాలనలో పర్షియన్లు పాతుకుపోయారు. అధ్యాపకులుగా ముఖ్యంగా యువరాజులకు శిక్షకులుగా పర్షియనులు ఉండేవారు. పర్షియన్ విద్యా విధానాన్నే గోలుకొండ నమూనాగా స్వీకరించింది. ఈ విధంగా పర్షియా ప్రభావం సర్వత్రా వ్యాప్తి చెందింది. వివిధ రంగాలలో ఉన్నత ప్రమాణాలు పర్షియా ప్రమాణాల ప్రాతిపదికన నిర్దేశించబడేవి. వాస్తవానికి పర్షియా మేధావుల వలసగా గోలుకొండ మారిపోయింది.

మచిలీపట్నంలోని ఒక డచ్చి ఫ్యాక్టరీలో గుమాస్తాగా ఉండిన మెత్‌వాల్డ్ 1618-22 లో రాసిన 'రిలేషన్స్' లో పేర్కొన్న ప్రకారం గోలుకొండ రాజ్యంలో 66 కోటలు, దుర్గాలు, ఉన్నట్లు తెలుస్తోంది. ప్రతికోట ఒక నాయక్ అధీనంలో ఉండేది వాటిలో మూడింటిని ఆయన స్వయంగా చూశాడు. కొండపల్లి కోట వైభవాన్నీ, నిర్భేద్యాన్ని చూసి అతడు ముగ్ధుడయ్యాడు. ఆకోటలో 16వేల మంది సైనికులున్నారు. సైనికులకు నెలకు మూడురూపాయలకు సమాన మొత్తాన్నీ చెల్లించే వారు. అదికూడా క్రమంగా చెల్లించే వారు కాదు. ఆయన అభిప్రాయం ప్రకారం "కొండపల్లి కోటను విశ్వాసఘాతుకం ద్వారా తప్ప జయించడం సాధ్యంకాదు. రెక్కలు లేకుండా ఆకోటను అధిరోహించడం అసాధ్యం తీవ్రక్షామం తప్ప మరి యేయితరశక్తీ ఆ కోటను పడగొట్టలేదు" ఈ కోటకు మధ్య రాత్రి సమయాల్లో సంకేతాల ద్వారా వర్తమానాలు పంపుకునే వ్యవస్థ ఉండేది.

ఆ రచయిత అభిప్రాయం ప్రకారంగొలుకొండ కోట మొగలు చక్రవర్తుల కోటలకంటె, ఇతర కోటలన్నింటి కంటె కూడా ఎంతో పెద్దది. ఎంతో సంపన్నమైనది భారతదేశంగుండా పయనించిన యితర సందర్శకుల అభిప్రాయం కూడా ఇదేనని మెత్‌వోల్ట్ రాశాడు.

రాజుకు నలుగురు భార్యలు, వెయ్యిమంది ఉంపుడుగత్తెలు ఉండేవారు. దీన్ని ప్రజలు కొనియాడడం ఆశ్చర్యంగా ఉందని మెత్‌వోల్డ్ పేర్కొన్నాడు. అందుకు విరుద్ధంగా, మూడు రాజ్యాలున్న తమరాజుకు ఒకేఒక్క భార్య ఉందని అతడు చమత్కరించాడు.

సుల్తానుల ఆదాయం మెత్‌వోల్డ్, షేరర్ మరో అజ్ఞాతవ్యక్తి (బహుశ వాన్‌రాల్ స్టీన్ కావచ్చు) వెలిబుచ్చిన మూడు వేరు వేరు అభిప్రాయాల ప్రకారం **1.7, 1.9 2.5** మిలియన్‌ల పగడాలు పగోడా అనేది హాన్‌కు యూరోపియన్ పేరు. హాన్ విజయనగర సామ్రాజ్యంలోని ప్రామాణిక నాణెం అయినప్పటికీ దక్కన్ రాజ్యాలలో నిరాటంకంగా చెలామణిలో ఉండేది. హాన్ విలువ సుమారు నాలుగున్నర రూపాయలు ఈ విధంగా మహమ్మద్ కులీ కాలం ముగిసేనాటికి గోలుకొండ వార్షిక ఆదాయం సుమారు ఒక కోటి రూపాయలు! విన్సెంట్ స్మిత్ పేర్కొన్న దాని ప్రకారం **1648**లో మొగలు సామ్రాజ్యం, గోలుకొండల మధ్య వనరుల సామర్థ్యం **25:1** నిష్పత్తిలో ఉండేదని మనకు తెలియ వస్తోంది. ప్రభుత్వ ప్రధాన ఆదాయం భూమిశిస్తు. భూమిశిస్తును నగదు లేక వస్తురూపేణా చెల్లించేవారు. భూమిని వేలంలో అత్యధికమొత్తానికి పాడినవారికి (బిడ్డర్) కౌలుకు ఇచ్చేవారు. దానితోపాటు ప్రతిఫలంగా రాజ ఆస్థానానికి కానుకలు చెల్లించే మరొక విధానం కూడా ఉండేది. ముఖ్యంగా 17వ శతాబ్దంలో కంపెనీల స్థాపన ప్రారంభించిన యురోపియన్ వ్యాపార సంస్థలు ఇచ్చే బహుమతుల రూపంలో కూడా ఆదాయం లభించేది ఇతర ఆదాయమార్గాలు, పొగాకు ఉప్పు పైన విధించే ఆక్ట్రాయ్, కల్లు మీద విధించే ఎక్సైజ్‌సుంకం, డచ్చి ఇంగ్లీషు వారిపైన పడే ఎగుమతి సుంకాలు ఉన్నాయి. డచ్చివారు పోర్చుగీసును వ్యతిరేకించడం వల్ల వారికి గోలకొండలో ఎక్కువ ప్రోత్సాహం లభించేది. డచ్చివారు ఎగుమతి, దిగుమతులపైన నాలుగు శాతం సుంకాన్నీ చెల్లించే వారు. అయితే పదకొండు శాతం ఉన్న స్టాంపు డ్యూటి విషయంలో మాత్రం వారికి మినహాయింపు ఉండేది ఆ తర్వాత ఏక మొత్తంగా సుంకాలన్నింటినీ కలిపి వేసి **3000** పగోడాలు చేశారు.

వజ్రాలపైన కూడా పన్ను ఉండేది. చిన్న వజ్రాలు లభించే గనులను మూడు లక్షల హోనులకు, పెద్ద వజ్రాలవయితే ఇంకా ఎక్కువ అద్దెపైన గుత్తకు ఇచ్చేవారు. కూలూరా వజ్రపు గనులను సందర్శించిన టావెర్నియర్ అక్కడ 30 వేల మంది పని చేస్తున్నారని రాశాడు. అక్కడ 900 కారెట్ల వజ్రాల వరకు తవ్వితీసేవారు. అలాంటి వాటిలో ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూర్ (కాంతి శిఖరం) ఒకటి. తాను కుతుబ్‌షాహిసులానును విడిచి వెళ్ళినప్పుడు మీర్‌జుమ్లా ఈ వజ్రాన్ని షాజహాన్‌కూ బహూకరించాడు. నాదిర్‌షా 1739లో ఢిల్లీ పతనం తరువాత పర్షియా కొల్లగొట్టుకు వెళ్ళిన సంపదలో ఇది కూడా ఉంది. ప్రస్తుతం ఇది బ్రిటిష్ రాజకిరీటంతో ప్రకాశిస్తోంది.

**విదేశీ వాణిజ్యం!** ప్రధాన దిగుమతులు వస్త్రాలు, ఉక్కు ఉత్పత్తులు- దిగుమతులలో ప్రధానమైనవి తగరం, పట్టు వస్త్రాలు, గుర్రాలు, ఎండుపళ్ళు, చైనా వస్తువులు, ఆభరణాలు, ముత్యాలు. తుపాకిమందులో ఉపయోగించే రసాయన పదార్థం మరో ముఖ్య దిగుమతి వస్తువు. విదేశీ వాణిజ్యం తూర్పు పశ్చిమతీరాలు రెంటి నుంచీ జరిగినప్పటికీ, ఉత్తరతీర ప్రాంతంలో అధిక భాగం కుతుబ్ షాహీల స్వాధీనంలో ఉండటం వల్ల అది అత్యంత ప్రధానమైన వాణిజ్య మార్గంగా ఉండేది. మచిలీపట్నం, శ్రీకాకుళం, రాజ్యంలోని ప్రధానరేవుపట్టణాలు. నర్సాపూర్ నౌకా నిర్మాణ కేంద్రంగా ప్రసిద్ధికెక్కింది. రేవు పట్టణానికి పర్షియన్ పదం బందర్. మచిలీపట్టణాన్ని స్థానికులు ఇప్పటికీ ఇదే పేరుతో పిలుస్తున్నారు.

**భూమి శిస్తు :** భూమి సుల్తాను స్వాధీనంలో ఉండేది. రైతులు తమ ఆదాయంలో కొంతభాగాన్ని భూమిశిస్తుగా చెల్లించే వారు దాన్ని ఖచ్చితంగా, అవసరమయితే బలవంతంగా వసూలు చేసేవారు. జాగీరు విధానం అమలులో ఉండేది. గ్రామం, వందగ్రామాల కూటమి జిల్లా, కేంద్ర ప్రభుత్వం అనే మూడు అంచెల్లో పరిపాలన సాగేది

**ధరలు!** ఆ కాలంలో వివిధ నిత్యావసరాల ధరల పరిశీలన ఆసక్తికరంగా ఉంటుంది.

షేరర్, మెత్‌వర్డ్‌లు వారి 'రిలేషన్స్' లో మహమ్మద్ కులీ చనిపోయిన కొంతకాలానికి అమలులో ఉన్న కొన్ని నిత్యావసర వస్తువుల ధరలను పేర్కొన్నారు. కులీ పరిపాలనా కాలంలో ధరలు ఇంకా తక్కువగా ఉండేవని అర్థం చేసుకోవచ్చు. షేరర్, మెత్ వోల్డ్‌లు పేర్కొన్న ధరల పట్టిక చూడండి :

| | |
|---|---|
| బియ్యం | - 40-60 కిలోలు ఒక్క రూపాయి |
| గోధుమ | - రూపాయికి 20 కిలోలు |
| నెయ్యి | - రూపాయికి 20 కిలోలు |
| ఎద్దు | - ఒక్కొక్కటి నాలుగు లేక ఐదు రూపాయలు |
| మేక | - ఒకటి అరవై పైసలు |
| మిరియాలు | - రూ. 125-00 లకు 240 కిలోలు |
| లవంగాలు | - రూ. 25-45లకు 240 కిలోలు |
| ముడి చైనాసిల్కు | - రూ. 15-17 లకు ఒక కిలో |
| ట్విస్టెడ్ చైనాసిల్కు | - కిలో రూ. 4-50 పైసలు |

రాజ్యంలోని రెండు రేవుపట్టణాలు - మచిలీపట్నం, శ్రీకాకుళం నుండి నౌకలు అన్ని దిశల్లోను పయనించేవి కుతుబ్ షాహీ నౌకల ప్రయాణ ఖర్చు, యురోపియన్ నౌకల ప్రయాణ ఖర్చు కంటే చాలా తక్కువగా ఉండేది. ఇది సుమారు మూడు వంతులు తక్కువ. హైదరాబాద్ నుంచి పశ్చిమాన సూరత్‌కు వాయవ్య దిశలో బీజపూర్‌కు, నైరుతిలో గోవాకు, ఆగ్నేయంగా మద్రాసుకు రోడ్డు మార్గాలున్నాయి. సాధారణ ప్రజలకు ఎడ్ల బళ్ళు వాహనాలు. ఇవి సగటున రోజుకు 20 కిలోమీటర్ల వేగంతో పయనించేవి. గుర్రాలు చాలా ఎక్కువ వేగంతో పయనించేవి. అత్యవసర పరిస్థితుల్లో సైనికులు రోజుకు 200 మైళ్ళు వరకు గుర్రాలమీద ప్రయాణం చేసేవారు. ఉత్తరాలు రోజుకు 100 మైళ్ళ వేగంతో వెళ్ళేవి. గోలుకొండలో మంచి సమర్థవంతమైన తపాల యంత్రంగం ఉందని ట్రావెర్నర్ పేర్కొన్నాడు. పదిహేడో శతాబ్దంలో కొంతకాలం మొగలుల తపాలా విధానం,

కుతుబ్‌షాహీల తపాల విధానానికి సమాంతరంగా ఉండేది. అయితే ఆ తర్వాత ఆ స్థానంలో మెరుగయిన మొగలు తపాలా విధానం అమలులోకి వచ్చింది.

రాజమతం ఇస్లామీయ షియా మతమే అయినప్పటికీ ప్రజలలో అధిక సంఖ్యాకులు హిందువులే. షియా-సున్నీలమధ్య శత్రుత్వం, వివక్ష ఉండేవి. ఇరు విశ్వాసాల వారిని వారి వారి మత విశ్వాసాలకే వదలి వేయడం జరిగింది. ఇరు మతస్తులు వారి ప్రత్యేక న్యాయసూత్రాల ప్రకారమే పాలింపబడేవారు. ముస్లిములు ఎక్కువగా ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, పర్షియన్లు ఉన్నత పదవులలోనూ ఉండేవారు. కొందరు పర్షియన్లు, ఆఫ్ఘనులు నెలకు 4-5 శాతం వడ్డీ వసూలు చేస్తూ వడ్డీ వ్యాపారం కూడా చేసేవారు.

ఆ కాలాన్ని గురించి రాసిన రచయితలు గ్రామీణ ప్రాంతాలలోని సౌభాగ్యవంతమైన వాతావరణాన్ని తమ గ్రంధాలలో యెక్కువగా వర్ణించారు. క్రింద పేర్కొన్న అంశం జాదూనాథ్ సర్కార్ రాసిన హిస్టరీ ఆఫ్ ఔరంగజేబ్ మొదటి సంపుటంలోనిది. ఇది ఆకాలం నాటి పరిస్థితులకు వివిధ మూలాలపై ఆధారపడి అద్దం పట్టింది.

"గోలుకొండ శ్రమించే ప్రజలు విస్తృతంగా గల, చక్కని నీటి పారుదల సౌకర్యాలు గల, సారవంతమైన పంటపొలాలు గల దేశం. ఆకాలంలో గోలుకొండ రాజధాని హైదరాబాద్ ఆసియా ఖండంలోనే కాక, మొత్తం ప్రపంచానికి వజ్రాల వ్యాపార కేంద్రం. ఎందరో విదేశీ వ్యాపారులు ఇక్కడ వాణిజ్యం జరిపేవారు. ఈ రాజ్యం ఎన్నో పరిశ్రమలకు ప్రసిద్ధి పొందింది. నిర్మల్, ఇందూర్, (నగరానికి ఉత్తరదిశలో గల రెండు గ్రామాలు) ఉక్కుగనుల కేంద్రాలు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన డమాస్కస్ కత్తులకు ముడిసరుకును ఈ గ్రామాలే సరఫరా చేసేవి. స్థానికులు తయారుచేసిన కత్తులు ఈటెలు, బల్లేలు భారతదేశం అంతటా పెద్ద సంఖ్యలో సరఫరా అయ్యేవి. మచిలీపట్నంలోని నిపుణులయిన చేనేత కార్మికుల కోసం బరహాంపూర్, ఢిల్లీలోని నేతకర్మాగారాలు పోటీపడేవి. ఎల్లోరాలో పూర్తిగా

ముస్లిముల నిర్వహణలోని తివాచీల పరిశ్రమ శతాబ్దాలుగా ప్రసిద్ధి చెందింది. సస్యశ్యామలమయిన పంటపొలాలు, చేపలు ఇతర జల సంపదతో సమృద్ధమయిన చెరువులు, వెల్లి విరుస్తున్న చేతివృత్తులు, వాటికి తోడు వజ్రాలగనులు, బంగారం గనులు - ఇలా గోలుకొండ పేరు సుదూర ఐరోపాలో సైతం మారు మ్రోగింది. గోలుకొండ రాజ్యానికి మచిలీపట్నం రూపంలో బంగాళఖాతంలో చక్కని లంగరు కేంద్రం వుంది. తూర్పు తీర ప్రాంతం నుంచి పెరూ, సయామ్, బెంగాల్, కొచ్చిన్, చైనా, మనీలా, మక్కా, మెడగాస్కర్‌కి బయలు దేరే నౌకలు ఇక్కడి నుంచే ప్రయాణమయేవి. రాజ్యంలోని అడవులలో విహరించే విలువయిన ఏనుగులు రాజు సంపదకు ఆదనపు బలం సమకూర్చేవి. విపరీతంగా వున్న పొగాకుపంట, తాటి చెట్ల ఫలితంగా పొగాకుమీద, తాటికల్లు మీద ఎక్సైజ్ సుంకం రూపంలో పెద్ద మొత్తం ఆదాయంగా లభించేది"

మహమ్మద్ కులీ మొత్తం ముప్పై ఒక్క సంవత్సరాలు పాలించాడు. ఆయన తన తండ్రి నుంచి వారసత్వంగా చక్కని పాలనా యంత్రాంగం ఉన్న రాజ్యాన్ని పొందాడు. కులీకి కూడా వివాదాలు, తిరుగుబాట్లు, సరిహద్దుల సమస్యలు తప్పలేదు. ఆయన స్వయంగా కొన్ని దండయాత్రలు చేశాడు. అయితే సైనిక చర్యల పరంగా మాత్రం ఆయన కీర్తి గడించలేదు. యుద్ధాలు చేయడం రాజుల బాధ్యతగా భావించబడే కాలంలో ఆయన యుద్ధ వ్యతిరేకిగా గుర్తింపు పొందాడు. ఆయన తన సామ్రాజ్యాన్ని విస్తరించలేదు. తన అధికారాన్ని రక్షించుకునే చర్యలలో మాత్రమే ఆయన పాల్గొన్నాడు. ఆయన సామ్రాజ్య నిర్మాత కాదు. తనకు వారసత్వంగా వచ్చిన దాన్ని యధాతధంగా కాపాడుకునేందుకే కట్టుబడి ఉన్నాడు.

మొగలాయిలతో ఆయన సంబంధాలు కూడా నామమాత్రమైనవీ పరోక్షమైనవీ మాత్రమే. భారతదేశంలో మొగలుల అధిక్యతను ఆయన గుర్తించాడు. అయితే తన సార్వభౌమత్వాన్ని నిలుపుకోవాలని ఆశించాడు. అందుకే ఆయనకు పర్షియా సహాయం అవసరమయ్యింది ఈ సమతుల్యత సాధించేందుకు దౌత్యపరమైన చాతుర్యం అవసరం. ఈ విషయంలో కులీ చాలా చక్కని దౌత్యనీతి

ప్రదర్శించాడు. ఐదు దక్కన్ రాజ్యాలపైనా కులీ ప్రభావం సంపూర్ణంగా ఉంది. దక్కన్‌లో గోలుకొండను ఒక ప్రత్యేక ఆధిపత్యస్థానంలో ఆయన నిలబెట్టాడు.

మహమ్మద్ కులీ మనస్సు శాంతి ప్రేరేపించే కళల వైపు మొగ్గినంతగా ప్రభుత్వపాలన వైపుగానీ, దౌత్య వ్యవహారాల వైపు గానీ మొగ్గలేదు కావ్యదేవత సన్నిధిలోనే ఆయన ఆనందాన్ని పొందేవాడు. కవిత్వం, సాహిత్యం, సంగీతం, శిల్పకళ, నగర నిర్మాణ ప్రణాళికలు యిచ్చిన పిలుపునే అయన అందుకున్నాడు. ఆయన సంపూర్ణ వ్యక్తిత్వాన్ని అంచనా వేసేందుకు ఇప్పుడు మనం ఆ క్షేత్రాలలోకి ప్రవేశిస్తున్నాము.

# కవి

మహమ్మద్ కులీ ఖ్యాతి చిరకాలం నిలిచి వుండడానికి కారణం గణనీయమయిన ఆయన కవిత్వం. ఉర్దూ కవులలో కులీ ప్రథముడు కాదు. అయితే ఒక కవి రచనలు ఒక సంపుటిగా పుస్తక రూపంలో వెలువడడం ఉర్దులో ఆయనతోనే మొదలయింది. మహమ్మద్ కులీ మరణానంతరం ఆయన వారసుడు, అంటే అతని అల్లుడు, స్వయాన సోదరుడి కుమారుడు అయిన సుల్తాన్ ముహమ్మద్ కుతుబ్‌షా, కులీ కవితల సంపూర్ణ సంకలనాన్ని 'దివాన్' శీర్షికతో వెలువరించాడు. కుతుబ్‌షా కూడా స్వయంగా కవి. మహమ్మద్ కులీ కవితా సంపుటి లక్షకు పైగా పంక్తులగల బృహత్తర గ్రంధం

**ఉర్దూ వికాసం :** కొందరు వ్యక్తుల జీవిత చరిత్రలలో చాలా వరకు చరిత్ర కూడా ఇమిడి వుండడం వలన వారి జీవిత చరిత్రలకు ప్రత్యేక ప్రాధాన్యం ఏర్పడుతుంది. ప్రజానీకానికి వారిపట్ల ప్రత్యక శ్రద్ధ ఏర్పడుతుంది. ఉర్దూ చరిత్రలో మహమ్మద్ కులీ ఒక మహా శిఖరంగా కనబడతాడు. భారత రాజ్యాంగం గుర్తించిన పదిహేను భాషల్లో ఉర్దూ ఒకటి. భారతదేశంలో అనేక ప్రాంతాల్లో ఉర్దూ భాష తన ప్రత్యేకతను, ప్రాధాన్యతను ఆధిక్యతను దీర్ఘకాలంగా నిలుపుకుంది.

'ఉర్దూ' అనేది టర్కీ భాషలోని పదం. ఆ భాషలో ఆ పదానికి శిబిరం (Camp) లేదా సైన్యం అని అర్థం. ఇంగ్లీషు పదం హెర్డ్ (Herd) కూడా ఇదే మూలం నుంచి ఉద్భవించింది. జర్మనీలో గుంపు అనే అర్థమిచ్చే 'Herde' కూడా ఇలాంటి పదమే ఈ పదం మంగోలు చక్రవర్తి చంఘిజ్ ఖాన్ కాలంలో (1162-1227) వాడుకలో ఉంది. ఆయన సంచార సైన్యంలో నాలుగు విభాగాలు ఉండేవి. అందులో రాజశిబిరాన్ని ఉర్దూ-ఎ-ముతల్లా అని పిలిచే వారు. అంటే స్వర్ణ శిబిరం అని వ్యవహరించేవారు. రాకుమారుడి శిబిరాన్నీ ఉర్దూ-ఎ-ముజాబ్ లేదా రజిత శిబిరం అని, రాజ వంశీకుల శిబిరాన్ని ఉర్దూ-ఎ-ముల్లా లేక ఉన్నత శిబిరమని, సైనికుల శిబిరాన్నీ కేవలం 'ఉర్దూ' అని వ్యవహరించేవారు.

భారతదేశంలో ఈ చివరి రెండు పదాలు ఒకదాని తరువాత ఒకటిగా ఉర్దూ అని పిలువబడే భాషకు వాడుతున్నారు. ఈరెండు శిబిరాలకి చెందిన వారే ప్రథమంగా భారత ప్రజలతో సంబంధాలు పెట్టుకొని ఈ భాషకు యిక్కడ మూలకారకులు కనుక ఈ భాష వారి పేరుతో ప్రచారంలోకి వచ్చింది.

భారతదేశం మీద మొదటి ముస్లిమ్ దండయాత్ర క్రీ.శ. 712 లో మహమ్మద్ బిన్ ఖాసిమ్ సింధ్‌ను ఆక్రమించినప్పుడు జరిగింది. అయితే ఇది స్వభావరీత్యా అరబ్‌దాడి. ఈ దండయాత్ర ఫలితంగా స్థానిక భాషఅయిన సింధీతో అరబిక్‌కి, కొంత తక్కువగానే అయినా పర్షియన్ (పార్శి) భాషలకీ మధ్య సంఘర్షణ మొదలయింది. అయితే ఈ భాషల మధ్య సంబంధం కాలం వెంట నిలకడగా కొనసాగడం వలన వివిధ ప్రాంతాలకు విస్తరించడం వలన గట్టిపడుతూ వచ్చింది. క్రీ.శ. 1020లో గజనీ మహమ్మద్ పంజాబ్‌ను జయించి తన సామ్రాజ్యంలో కలుపుకునే సమయానికి ఈ స్థానిక భాషపూర్తిగా పార్శితో సమ్మిళితమై పోయింది. పంజాబ్ గజనీ వంశ పాలనలో ఉన్నంతకాలం, సైన్యం 167 సంవత్సరాలు పంజాబ్‌లోనే ఉండిపోయింది. మహమ్మద్ అతని సైనికులు పార్శీ మాట్లాడేవారు. గజనీ మహమ్మద్ పంజాబ్ విజయం వల్ల పార్శీ మాట్లాడే యితర ప్రాంతాల ప్రజలు పెద్ద సంఖ్యలో అనేక విధాలుగా భారతదేశానికి వలసరావడం సంభవించింది.

క్రీ.శ. 1186లో మహమ్మద్ ఘోరి గజనీ నియమించిన పాలకుడిని ఓడించి పంజాబ్‌ను తన సామ్రాజ్యంలో కలుపుకొన్నాడు. ఏడు సంవత్సరాల తర్వాత 1193లో మహమ్మద్ ఘోరి సైన్యాధిపతి కుతుబ్-ఉద్దీన్-ఐబక్ ఢిల్లీని స్వాధీనం చేసుకొని ముస్లిమ్ సుల్తానుల పాలనకు శ్రీకారం చుట్టాడు. ఆ తర్వాత ఏడు శతాబ్దాల వరకు ఢిల్లీ, పర్షియన్ భాష మాట్లాడే పాలకుల రాజధానిగా, వారి సైన్యాలకు ప్రధాన స్థావరంగా ఉంది. ఆ విధంగా పారశీక దండయాత్రికులకు భారతీయులకు మధ్య మొట్టమొదటి, సుదీర్ఘ సంబంధం పంజాబ్‌లో ఏర్పడింది. కేవలం అవసరార్థం ఆక్రమణ సైన్యం స్థానిక భాషలోని కొన్ని పదాలు నేర్చుకోవలసి వచ్చింది. మరోవైపున నూతన విజేతల భాషను నేర్చుకోవలసిన ఒత్తిడి ప్రజలపైన,

వారికి తెలియకుండానే యెక్కువ కాసాగింది. ఆవిధంగా విభిన్న సామాజిక సంబంధాలు, మతం మార్పిడులు, అంతర్గత వివాహాలు చోటు చేసుకొన్నాయి. ఇవన్నీ కలసి ఒక నూతన సంకీర్ణ భాష ఆవిర్భావానికి దోహదం చేశాయి. ఈ క్రమంలో అనేక పార్శీ, ఉర్దూ, టర్కి, అరబిక్ పదాలు కూడా స్థానిక భాషలో కల గలసి పోయాయి. పంజాబీ భాషలో ఇప్పటికి కూడా కనిపిస్తున్న అలాంటి అనేక పదాలు ఈ ప్రభావాన్ని ధృవీకరిస్తున్నాయి.

ఈ పరిస్థితులలో రాజదర్బారులో అధికార భాషగా పార్శీ పరిగణన పొందింది. కాని సాధారణ సామాజిక సంబంధాలు, సంభాషణలలో పార్శీ సంధాన భాషకాలేకపోయింది. పర్షియన్ సైనికులకు స్థానికులకు మొదటిసారిగా సంబంధాలు ఏర్పడిన పంజాబ్‌లో సైన్యం (ఉర్దూ) ఉపయోగించిన భాషయేదో వాడుకలోకి వచ్చి వుండాలి. ఒక భాష పుట్టుక అనేది జీవ జాల జనన ఘటన లాంటిది కాదు దానికి కచ్చితమైన పుట్టిన తేదీ నిర్ణయించడం సాధ్యంకాదు. భాషా జీవనం అనేది సుదీర్ఘకాలం పాటు సాగే సహజమైనసామాజిక ప్రక్రియ. ఉర్దూ - పంజాబీ భాషల మధ్యగల సన్నిహిత సంబందాన్ని బట్టి చూస్తే కొందరు పండితులు విశ్వసిస్తున్నట్టు ఉర్దూభాష ఢిల్లిలో కాక, పంజాబ్ నుంచి ఢిల్లి వెళ్ళే జాతీయ రహదారి పైన జన్మించినట్టు కనిపిస్తోంది.

ఉర్దూ భాష వేళ్ళు ఢిల్లీ దాని పరిసరాలలో వున్నాయని వాదించేవారు, పర్షియన్లు - పంజాబీల మధ్య సన్నిహితంగా సాగిన 177 సంవత్సరాల పరస్పర సంబంధాలను చరిత్రను విస్మరిస్తున్నారు. ఈ ఢిల్లీ వాదులు సూచిస్తున్న ఉర్దూ జనన కాలానికి ముందే దక్షిణ భారతదేశంలో దక్కనీ రూపంలో ఉర్దూ సజీవంగా ఉండటం దక్కనీలో అనేక పంజాబీ పదాలు, పంజాబీ వ్యాకరణ సూత్రాలు కనబడటం ఉర్దూ ఢిల్లీలో పుట్టిందని సమర్థించవు. ఈ నేపథ్యంలో ఉర్దూభాష పంజాబ్‌లో జన్మించిందన్న ప్రొఫెసర్ మహమూద్ షేర్వానీ, ప్రొఫెసర్ జూరీ భావన సరైనదని తేలుతోంది.ఈ వాదనను రుజువు చేసేందుకు చారిత్రక, సాహిత్య సాక్ష్యాదారాలు ఉన్నాయి.

ఢిల్లీలో సుల్తానుల పాలన ప్రారంభమై సల్తనత్ రాజ్యస్థాపన జరిగిన తరువాత ఉర్దూ భాష మరింత విస్తరించింది. ఢిల్లీ పరిసర ప్రాంతాలలో మాట్లాడే భాష యాసల ప్రభావం ఉర్దూ మీద పడింది. అల్లా ఉద్దీన్ ఖిల్జీ దక్కనును జయించేవరకు సైన్యం వంద సంవత్సరాలు ఢిల్లీలోనే ఉంది. అంతకు ముందు ఢిల్లీ, పంజాబులను జయించిన సైన్యంలో ఎక్కువ భాగం (విదేశీ భాష మాట్లాడే) విదేశీయులే ఉన్నారు. ఇప్పుడు దక్కన్ ప్రాంతంలోకి వచ్చిన సైన్యంలో ఎక్కువమంది యిక్కడ ఆ సైన్యంలో చేరిన భారతీయ సైనికులే ఉన్నారు గజనీ, ఘోరీ సైన్యాల మాతృభాష పార్శీ అయినట్టే, ఈ సైన్యాల మాతృ భాష ఉర్దూ అయింది. ఆ తర్వాత మహమ్మద్ తుగ్లక్ 1327 లో తన రాజధానిని ఢిల్లీ నుంచి దేవగిరికి మార్చాడు. అప్పుడు తుగ్లక్ కొంత సైన్యాన్ని దక్కన్‌లో ఉంచాడు. ఈ సైనికుల మాతృభాష ఉర్దూ. పదకొండు, పన్నెండు శతాబ్దాలలో పంజాబ్‌లోనూ, పన్నెండు పదమూడు శతాబ్దాలలో ఢిల్లీలోనూ సంభవించిన సంఘటనలే పద్నాలుగవ శతాబ్దంలో దక్కన్‌లో పునరావృతమయ్యాయి. ఒకపక్క ఉర్దూ, మరోవైపు గుజరాత్, మరాఠీ, తెలుగు, కన్నడ వంటి ప్రాంతీయ భాషలు సమ్మిళితమయ్యాయి. ఈ స్థానిక భాషల్లోని మొదట రెండూ ఆర్యభాషలు, చివరి రెండూ ద్రావిడ భాషలు అందువల్ల మొదటి రెండు భాషలు ఉర్దూ భాషతో మరింత సన్నిహితంగా కలిసిపోయాయి.

స్థానిక సైన్యాధికారి జాఫుర్ క్రీ.శ. 1347 లో మహమ్మద్ తుగ్లక్ మీద తిరుగుబాటు చేసి దౌలతాబాద్ రాజధానిగా దక్కన్‌లో బహమనీ సామ్రాజ్యాన్ని స్థాపించిన విషయం ముందలి అధ్యాయంలో తెలుసుకొన్నాము. జాఫర్ తిరుగుబాటు స్థానిక దేశభక్తి వల్ల ప్రేరేపితమైనదే తప్ప మతస్వభావం కలదికాదు. ఇది ఢిల్లీ సుల్తాన్‌కు వ్యతిరేకంగా జరిగింది. నూతన దక్కను పాలకులు ఉత్తర ప్రాంతంనుంచి వేరుగా, విడిగా ఉండాలని జాగ్రత్త వహించారు. పద్నాలుగవ శతాబ్దం మధ్యకాలం నుంచి అక్బరు దక్కను మీద నిర్విరామంగా దాడులు ప్రారంభించిన కాలం వరకు దక్కన్‌లో ఉత్తరదిశ పాలకుల సైనిక చర్యలుగానీ, రాజకీయ జోక్యాలు కానీ చాలా తక్కువ. ఆ కారణంగా ఉర్దూ భాష ఇటు

దక్కన్‌లోనూ, అటు ఉత్తర భారతదేశంలోనూ స్వతంత్రంగా యెటువంటి సంబంధమూ లేకుండానే అభివృద్ధిచెందింది ఇంచుమించుగా దక్కన్‌లో వికసించిన ఉర్దూ భాషను దక్కనీ అని పిలిచారు. ఇక్కడ దక్షిణం అని అర్థం వచ్చే దక్కన్ పరిధిలో గుజరాత్, ఔరంగాబాద్, బీజపూర్, గుల్బర్గా, బీదర్, గోలుకొండ ఉన్నాయి. ఉర్దూ-ఎ-ము అల్లా లేక మహోవర-ఎ-షాజహనా బాద్ అని పిలువబడే ఉత్తర భారత ఉర్దూకు, దక్కన్‌లో మాట్లాడే దక్కన్ ఉర్దూకు మధ్యగల వ్యత్యాసాన్ని ఈ నైసర్గిక స్వరూపం వివరిస్తోంది దక్కనీలో అనేక పంజాబీ పదాలు, వాక్య నిర్మాణ సూత్రాలు కనిపించడంలో ఆశ్చర్య పోవలసినదేమిలేదు. ఎందుకంటే పదకొండు, పన్నెండు శతాబ్దాలలో ఉర్దూ భాషపంజాబ్‌లో శైశవ దశలో ఉన్నప్పుడే ఇక్కడ ఉర్దూభాషకు పునాదులు ఏర్పడ్డాయి.

దక్షిణ ప్రాంతం విడివడి వేరుగా తన ఉనికిని కాపాడుకుంటూ మనడం అనే ఆలోచన ఔరంగజేబు 1678లో దక్షిణ సామ్రాజ్యాల మీదికి దండెత్తడంతోనే రూపు మాసిపోయింది. ఔరంగజేబు అక్కడి నుంచి మళ్ళీ వెనక్కు తిరిగి చూడలేదు. ఔరంగాబాద్ ఔరంగజేబు ముఖ్య పట్టణం. ఆయన 1686లో బీజపూర్‌ను, 1687లో గోలుకొండను జయించిన పిదప ఔరంగాబాద్ మొగలు సామ్రాజ్యంలోని దక్కన్ ప్రాంతానికి రాజధాని అయింది. ఉత్తర, దక్షిణదేశాల మధ్య సాంస్కృతిక భాషా సంబంధాలు ప్రారంభమయ్యాయి. ఉత్తర భారత ఉర్దూ, దక్షిణ ప్రాంత దక్కనీ ఉర్దూ ఒకదానిపై ఒకటి ప్రభావం చూపడం, ఒకదాన్ని ఒకటి శోభాయమానం చేయడం ప్రారంభమయింది. ఔరంగాబాద్ నుంచి 'వలీ దక్కనీ' ఢిల్లీ వెళ్ళగా, ఢిల్లీ నుంచి సిరాజ్ ఔరంగాబాద్ ఔరంగాబాది 'ఇస్మాయిల్ ఆమ్రోహదా' లు ఔరంగాబాద్ వచ్చారు.

వలీ దక్కనీ క్రీ.శ. 1700 సంవత్సరంలో ఢిల్లీ సందర్శించినప్పుడు, 1720లో ఆయన పద్య సంపుటి వెలువడినప్పుడు అక్కడి ప్రజలు దక్కనీ భాష భావ వ్యక్తీకరణ సామర్థ్యాన్నీ, పరిపక్వతనూ చూసి అబ్బురపోయారు. చాలాకాలం వరకు వలీని మొదటి ఉర్దూకవిగా పరిగణించే వారు. చాలా కాలం నలిగిన తరువాత

ఉత్తర భారత ఉర్దూ ఈ పరుగులో దక్కనీని అధిగమించింది. కాలక్రమంలో దక్కనీ కేవలం మౌఖిక భాషగా మిగిలి పోయింది.

మనం ప్రస్తుతం ఉర్దూ భాషగురించి మాట్లాడుతున్నప్పటికీ 1752 వరకు ఈ భాషకు ఉర్దూ అనే పదాన్ని ఉపయోగించలేదనేది ఆసక్తికరమయిన విషయం. సైనిక స్థావరం అనే అర్థంలో కూడా ఉర్దూ అనేపదాన్ని 1526లో మొగలు చక్రవర్తి బాబర్ ఉత్తర భారతదేశాన్ని జయించిన తరువాతనే మొదటిసారి ప్రయోగించారు. అయితే మనం ఇంతకు ముందే చెప్పుకున్నట్టు భారతదేశంలో కాకపోయినా ఇతర ప్రాంతాలలో ఈ పదం పూర్వం నుంచీ వాడుకలో ఉంది.

ఈ విధంగా ఆరుశతాబ్దాలకు పైగా, నేడు పిలువబడుతున్న పేరు లేకుండానే ఉర్దూభాష వికసించింది. అప్పట్లో ఉర్దూ భాషను 'హిందీ' లేదా 'హిందీ్వ' అని పిలిచే వారు. అరబ్బులు, పర్షియన్లు సాధారణంగా భారతీయులకు భారతీయ భాషలకు పర్యాయపదంగా ఈ మాటను వాడేవారు. నేటికి కూడా అరబ్బులు, ఇరానియన్లు, భారతీయులను 'హింధీ' అనే వ్యవహరిస్తారు. వారి దృష్టిలో, మన దేశంలో వ్యవహారంలో వున్నట్టు ఈ పదానికి భాషాపరమైన, లేక మతపరమైన భావంలేదు. జాతీయ సినిమా ప్రపంచంలో నేడు ఇంచుమించుగా అదే పరిస్థితి వుంది. నేడు మనం హిందీ సినిమాలని పిలుస్తున్న సినిమాలు చాలా వరకు వాస్తవానికి ఉర్దూ సినిమాలే. ఉర్దూ కవులూ రచయితలు రాసిన మాటలు, పాటలు వున్న ఉర్దూ సినిమాలు! పర్షియన్ అరబిక్ భాషలతోనూ, ఇస్లామ్‌తోనూ భారతీయ ప్రజలకు యుద్ధరంగంలోనే మొదట పరిచయం జరిగిందని కాదు. ఇస్లామ్ ఒక దిగ్విజయ శక్తిగా భారతదేశంలోకి ప్రవేశించడానికి మునుపే దక్షిణభారత దేశానికి, అరబ్‌దేశాలతో నౌకానిర్మాణ వాణిజ్య సంబంధాలు వుండేవి. ఇస్లామ్ సందేశ వ్యాప్తికోసం అనేక అరబిక్, పర్షియన్ గ్రంధాలను హిందీ, దక్కనీ భాషలలోకి అనువదించడం జరిగింది. భారతదేశాన్ని ముస్లిములు జయించడానికి ముందే దక్షిణదేశంలో అనేక ముస్లిమ్ స్థావరాలు ఉండేవి. క్రీ.శ. 4వ శతాబ్దంలో దక్షిణ భారతదేశాన్ని సందర్శించిన ఇబ్నెబతూాత ఈ స్థావరాలను, మసీదులను

గుర్తించాడు. ద్వారసముద్రం హిందూరాజు బల్లలదేవ సైన్యంలో 20వేల మంది ముస్లిమ్ సైనికులు ఉన్నట్లు నమోదై వుంది. ఈ విధమైన చిరకాల సంబంధాలు కూడా ఒక సామాన్య భాష వికాసానికి దోహదం చేసి వుంటాయి.

ఇస్లామ్, సూఫీతత్వం ప్రచారకేంద్రాలయినా, ఉర్దూ భాషవ్యాప్తికి అభివృద్ధి మరొక ముఖ్యమయిన వాహికగా భావించవచ్చు. అల్లావుద్దీన్ ఖిల్జి సైన్యాలు దక్కన్ ప్రాంతాన్ని ముట్టడించిన సమయంలో కూడా ఆ సైన్యంలో ఢిల్లీకి చెందిన ఖ్వాజా నిజాముద్దీన్ ఔలియా ప్రముఖ శిష్యులయిన అమీన్ హసన్ సిజ్‌జీ వంటి వారున్నారు. వివిధ సూఫీమతశాఖలుదక్షిణ భారతదేశంలో క్రీ.శ. 1318 నాటికే ఏర్పడ్డాయి. వివిధ ప్రాంతాలకు చెందిన వేరు వేరు భాషలు మాట్లాడే ప్రజలు భూభాగంపైన కలిసి జీవించవలసి రావడం వలన ఇక్కడ ఒక కొత్త సామాన్య భాష జీవం పోసుకోవడం చాలా సహజ పరిణామం. అంతేకాక ఇస్లామ్ సూఫీ ప్రచారానికి ప్రజలందరూ అర్థం చేసుకోగల ఒక సరళమయిన భాష అవసరం కూడా ఏర్పడింది.

ఇది ఉర్దూ భాష సంక్షిప్త చరిత్ర. ఢిల్లీ సుల్తానులు, వారి పాలకుల ఆస్థాన భాష పార్శీ అయినప్పటికీ, సాధరణ ప్రజల వాడుకభాషగా, పూర్తిస్థాయి స్థానిక భాషగా ఉర్దూ త్వరితంగా వికసించ సాగింది. మొగలు సామ్రాజ్య పతనంలో పార్శీ కూడా పాలుపంచుకుంది. వలీ దక్కనీ ఢిల్లీ యాత్ర తరువాత, 18వ శతాబ్దంలో, విదేశీ భాషఅయిన పార్శీని బహిష్కరించాలని దాని స్థానంలో స్థానిక భాష ఉర్దూను ప్రతిష్టించాలనీ కోరుతూ ఒక ఉద్యమం తలెత్తింది. ఈ ఉద్యమంలో ఆర్జూ, దర్ద్, సౌదా, మీర్ వంటి ప్రముఖ ఉర్దూ కవులు పండితులు ప్రధాన పాత్ర పోషించారు. అయితే ఉర్దూను పార్శీ స్థానం ఆక్రమించేలా రూపొందించడానికి ఆ భాషలోని 'మొరటు' మాటలు, 'అసభ్య' పదాలను తొలగించి ఆ స్థానంలో చక్కటి పార్శీ పదాలను చేర్చాలని భావించారు. ఈ సమయంలోనే స్థానిక జాతీయాల మాండలిక పదాల స్థానంలో పార్శీ పదాలు ప్రయోగించడం ప్రారంభమయ్యింది. అలాగే యధేచ్ఛగా వెలువడుతున్న అనేక హిందీ పదాలను తిరస్కరించడం జరిగింది.

అంతవరకు ఉర్దూ చాలా సరళంగా ఉండేది. ఉర్దూ ఇలా పారశీకీకరణం చెందడంతో సామాన్య ప్రజలకు దూరమైపోయింది. ఈ కారణంగా ఉర్దూభాష పార్శీ అరబిక్ భాషలవైపునకు విపరీతంగా, అనవసరంగా మొగ్గింది. ఈ క్రమంలో ఉర్దూ భాష స్థానిక దేశీయ భాషలకు కూడా దూరమైపోయింది.

పూర్వరంగ పరిశీలనలో మనం అసలు విషయాన్ని దాటి కొంత బాట మళ్ళినట్లు కనిపిస్తోంది. కాని ఉర్దూ భాషను, దాని వికాసాన్ని, దానితోపాటు, అపారసాహితీ సంపదగల దక్కనీ ఆవిర్భవానికి గల కారణాలను అర్థం చేసుకోడానికి ఈ మాత్రం వివరణ అవసరం. సాహిత్యంలో గద్యం కంటె పద్యం ముందు పుడుతుంది. ఉర్దూలో కూడా గద్యం కన్నా ముందు పద్యమే జన్మించింది. ఉర్దూకవనంలో మహమ్మద్ కులీ ప్రధానంగా దక్కనీలో కవిత్వం రాసిన కవి. ఆయన తెలుగులో కూడా కవిత్వం చెప్పాడని కొందరు భావిస్తున్నారు కాని ఇంతవరకు అందుకు తగిన ఆధారాలు దొరకలేదు. పార్శీ భాషలో ఆయన హాఫీజ్ అభిమాని హాఫీజ్ పద్యాలను కొన్నింటిని కులీ ఉర్దూలోకి అనువదించాడు అయితే ఆయన పార్శీ కవనాలు అలభ్యం ఆయన ఉర్దూ కవిత్వం మాత్రం అపారమైనది. ఆయన తన ఉర్దూ కవిత్వాన్ని పదిహేడు మారు పేర్లతో రాశాడు. కుతుబ్ షా, మాని, తుర్క్మాన్, కులీ అనే నాలుగు పేర్లు ఎక్కువగా వాడుకున్నాడు.

ఉర్దూ కవిత్వంలో గజల్ (గీతం, ప్రేమగీతం) ప్రధాన కవితరూపం. ఇదికాక ఖసీదా (స్తుతి గీతం) మర్సియా (స్మృతి గీతం) మస్నవీ (శృంగారగీతం) తజ్కిరా (కవితా సంపుటి లేక జీవిత చరిత్రాత్మక కవితా సంపుటి) వంటి ప్రక్రియలు వున్నాయి. ఒక్కగజల్ లోనే కాక ఇతర ప్రక్రియలలో సైతం మహమ్మద్ కులీ అసాధారణ ప్రతిభను కనబరిచాడు. ఆయన రచనలలో గజళ్ళు ఒక ఎత్తయితే ఇతర ప్రక్రియలన్నీ కలిసి ఒక ఎత్తుగా మనం భావించవచ్చు.

ఈ విభాగంలో మనం కులీ కవిత్వాన్ని పరిశీలిద్దాము. అవసరమైన చోట్ల ఆయన కవిత్వం నుంచి కొన్ని మచ్చుతునకలు యేరి, ముహమ్మద్ కులీ పర్షియన్

లిపిలో రాశారు, తెలుగులో వాటి స్వేచ్ఛానువాదాలను కూడా పొందు పరిచాను

**అనువాద సమస్యలు :** అనువాదం గురించి ఇక్కడ ఒక మాట చెప్పడం సముచితంగా వుంటుంది. అనువాదంలో, ముఖ్యంగా పద్యాల అనువాదంలోని ఇబ్బందులు, అవరోధాలు విజ్ఞులయిన పాఠకులకు తెలిసినవే. అనువాదం అంటే కవిత్వాన్ని హత్యచేయడం అని ఒక ఇటాలియన్ సామెత. కవిత్వం అనువాద సాధ్యం కాని భాషా విషయం అని ప్రసిద్ధ కవి రాబర్ట్ ఫ్రాస్ట్ పేర్కొన్నాడు. ఈ భావన పూర్తిగా సరైనది కాదు. ఆడెన్ పేర్కొన్న విధంగా పద్యానికి మూడు స్థూల కోణాలుంటాయి. మొదటిది చెవులకు సంబంధించిన శబ్ద ధ్వనులు, ఆ ధ్వనుల నుంచి ఉద్భవించే లయ, అంత్యప్రాసలు, పద చమత్కారం, యమకం వంటి లక్షణాలు. వాటిని ఒక భాషనుంచి వేరొక భాషలోకి యధాతథంగా తీసుకురావడం సాధ్యంకాదు. ఇక రెండవ కోణం కనులకు సంబంధించినది. అంటే ప్రతీకలు, రూపకాలంకారాలు. వాటిని జ్ఞానంతో అనుభవించవచ్చు. ఇవి అనువాదానికి అనువైనవే. చివరి కోణం కవి ప్రపంచాన్ని చూసే ప్రత్యేక దృష్టికోణం అంటే, దృక్పథం. ఈ అంశం కూడా అనువాదాన్ని అనుమతిస్తుంది.

కులీ కవిత్వంలో మొదటి రెండు లక్షణాలు సంపూర్ణంగా ఉన్నాయి. కనుక ఆయనపద్యాల అనువాదం కొంత సులభమైనది. కొంత కష్టమైనది. ఆయన పద్యాల భావాన్ని పాఠకులకు అందజేయడానికి అనువాదం తప్ప మరి మరో మార్గం లేదు.

**లౌకికవాద అంశం!** ఉర్దూ కవిత్వంలో లౌకిక (మతాతీత) భావన ప్రవేశపెట్టిన కవులలో కులీ మొదటి వాడు. అంతవరకూ ఉర్దూ కవిత్వం ప్రధానంగా మత సంబంధంగా ఉండేది. కులీ ప్రకృతిలోని చిత్ర విచిత్ర రూపాలను, సంవత్సరంలోని రుతువులను, ఫలపుష్పాదులు, కాయకూరలు, తోటలు, ఉద్యానవనాలు, ఆచారాలు, పండుగల గురించి తన కవిత్వంలో వర్ణించాడు. ఆయన ప్రేమలోని మాధుర్యాన్ని, శారీరక ప్రేమను నిష్కపటంగా యధేచ్ఛగా గానం చేశాడు. ఒక మధ్యయుగ చక్రవర్తిలో ఇలాంటి ధోరణి వుండడం అత్యంతాశ్చర్యకరం. ప్రేమకలాపాలలో

కవి
ఆనందం పొందడంలో, తాను పొందిన ఆనందాన్ని తన కవిత్వంలో వర్ణించడం
ఎక్కడా ఆయనకు మతం అడ్డుకాలేదు. ఈ విషయంలో ఆయనకు హిందు
ముస్లిమ్ అనే వ్యత్యాసం లేదు.

ముస్లిమ్ దారి, కాఫిర్ దారి
ఎరుగను నేనెవ్వరి తీరు,
జగతిన ఈ యిరు తెరువులు వీడి
రావలె గద నీ దారికి వీరు !

**అంతేకాదు :**

కాఫిర్దైనా, ముస్లిమ్దైనా
ఎవరిది ఏమయినా రీతి,
అన్ని రీతులలో అందరు వొకటే
రహస్య రాగపు రసగీతి!

**ఇంకా చూడండి :**

కాబా ఎరుగను ఆలయమెరుగను
ఎరుగను నేనే మధుశాల,
నీ వదనంలో మెరిసే స్వచ్ఛత
కనరాదెచ్చట, అదియేల!

**అంటూ ఇంకా ఇలా రాశాడు!**

వెన్నంటి నీ వెనుకె ఉంటా ప్రియా
అన్యులతో యికనాకు లేదే పని,
మస్జిదో, మందిరమొ నాకేమి చింత,
పట్టించుకోబోను నే వాటిని!

ఈ భావాన్ని రెండు శతాబ్దాల తర్వాత మీర్, ఆ తర్వాత గాలిబ్ స్వీకరించారు. ఆ తదనంతర కవులలో ఇది ఒక సాధారణ భావనగా రూపొందింది. అన్యమతారాధనను ఇస్లామ్‌తో సమానంగా చూడడానికి ఒక మధ్యయుగపు ముస్లిమ్ చక్రవర్తికి అసాధరణ సాహసం అవసరం. చూడగా, ఈయన కబీర్, సూఫీల భాష మాట్లాడడం కనిపిస్తుంది. ఇందులో కవితా ప్రావీణ్యత కానీ గొప్ప భావన కానీ లేవు.

ఆయన తన ప్రజలతో పూర్తిగా మమేకం చెందాడనే సాధారణ భావనను ఆయన కవిత్వం కూడా సమర్థిస్తుంది. ప్రజల ఉత్సవాలు, పండుగలు, వారి ఆచార వ్యవహారాలు, వారి ఆచరణలు వేడుకలు - ఇవన్నీ కూడా ఆయన సమర్థవంతంగా కవిత్వీకరించిన వస్తువులు. ఆయన తనను గూర్చి ఇలా చెప్పుకొన్నాడు.

హైందవ ఆచారాలకు
ఇచ్చానట ప్రేరణ,
మసీదులాంటిదె గుడి కాదా,
ఎందుకు ఆరోపణ!

**కులీ గజళ్ళు !** సాధారణ నిర్వచనంలో గజల్ స్వయం సంపూర్ణమయిన ద్విపద చరణాలతో కూడిన ప్రేమ కవిత్వం. ఒక చరణంతో ఇతర చరణాలకు తప్పనిసరిగా సంబంధం వుండాలనే నియమం లేదు. స్వతంత్రంగా దేనికదే సంపూర్ణ భావాన్ని ఇవ్వగల చరణాల సమాహారం గజల్. నజమ్ అలాకాదు. ఇది స్వభావరీత్యా వర్ణనాత్మకంగా వుంటుంది. మొదటి నుంచి చివరివరకు ఒక కొనసాగింపు ఉంటుంది. గజల్ పరిధిని వస్తువును విస్తరింపజేయడం మహమ్మద్ కులీ సాధించిన ఘనవిజయం గీత రూపం నుంచి కులీ గజల్‌ను వర్ణనాత్మక వాహికగా మలిచాడు నజమ్ ప్రయోజనాలు సాధించడానికి అనువుగా ఆయన గజల్‌ను వంచాడు. తన పరిధిలో లేని అంశాలను కూడా ఆయన ఎంతో సులభంగా నిర్వహించాడు.

నవలా రచయిత, చరిత్ర కారుడూ సమానులని సుజాన్నె హం

ఈ భావాన్ని రెండు శతాబ్దాల తర్వాత మీర్, ఆ తర్వాత గాలిబ్ స్వీకరించారు. ఆ తదనంతర కవులలో ఇది ఒక సాధారణ భావనగా రూపొందింది. అన్యమతారాధనను ఇస్లామ్‌తో సమానంగా చూడడానికి ఒక మధ్యయుగపు ముస్లిమ్ చక్రవర్తికి అసాధరణ సాహసం అవసరం. చూడగా, ఈయన కబీర్, సూఫీల భాష మాట్లాడడం కనిపిస్తుంది. ఇందులో కవితా ప్రావీణ్యత కానీ గొప్ప భావన కానీ లేవు.

ఆయన తన ప్రజలతో పూర్తిగా మమేకం చెందాడనే సాధారణ భావనను ఆయన కవిత్వం కూడా సమర్థిస్తుంది. ప్రజల ఉత్సవాలు, పండుగలు, వారి ఆచార వ్యవహారాలు, వారి ఆచరణలు వేడుకలు - ఇవన్నీ కూడా ఆయన సమర్థవంతంగా కవిత్వీకరించిన వస్తువులు. ఆయన తనను గూర్చి ఇలా చెప్పుకొన్నాడు.

> హైందవ ఆచారాలకు
> ఇచ్చానట ప్రేరణ,
> మసీదులాంటిదె గుడి కాదా,
> ఎందుకు ఆరోపణ!

**కులీ గజళ్ళు !** సాధారణ నిర్వచనంలో గజల్ స్వయం సంపూర్ణమయిన ద్విపద చరణాలతో కూడిన ప్రేమ కవిత్వం. ఒక చరణంతో ఇతర చరణాలకు తప్పనిసరిగా సంబంధం వుండాలనే నియమం లేదు. స్వతంత్రంగా దేనికదే సంపూర్ణ భావాన్ని ఇవ్వగల చరణాల సమాహారం గజల్. నజమ్ అలాకాదు. ఇది స్వభావరీత్యా వర్ణనాత్మకంగా వుంటుంది. మొదటి నుంచి చివరివరకు ఒక కొనసాగింపు ఉంటుంది. గజల్‌పరిధిని వస్తువును విస్తరింపజేయడం మహమ్మద్ కులీ సాధించిన ఘనవిజయం గీత రూపం నుంచి కులీ గజల్‌ను వర్ణనాత్మక వాహికగా మలిచాడు. నజమ్ ప్రయోజనాలు సాధించడానికి అనువుగా ఆయన గజల్‌ను వంచాడు. తన పరిధిలో లేని అంశాలను కూడా ఆయన ఎంతో సులభంగా నిర్వహించాడు.

నవలా రచయిత, చరిత్ర కారుడూ సమానులని సుజాన్నె హంగర్,

విలియం జేమ్స్ పేర్కొన్నారు. నవలా రచయిత, చరిత్రకారుడు ఇద్దరూ ప్రతిపాదించేది చరిత్రనే కాని వారి పద్ధతులు వేరని పై ఇద్దరు విమర్శకులు వాదించారు. గతానికి ప్రాతినిధ్యం వహించడం చరిత్రకు దానిమీద వెలుగు ప్రసరించడం మానవుడి చర్యలను వెలుగులోకి తీసుకురావడం ఈ యిరు విధాలు రచయితల బాధ్యత అని జేమ్స్ పేర్కొన్నాడు కులీ కూడా ఈ తరహాకి చెందినవాడే. తనకాలం నాటి చరిత్రను మనకోసం తన కవిత్వంలో నిక్షిప్తం చేసిన అటువంటి కవి కులీ. ఉదాహరణకు తన రాజ ప్రసాదాలలోని ఖుదాదాద్-మహత్, గురించి రాస్తూ ఆయన యిలా అంటాడు

> మహమదు ముస్తాబించిన
> ఖుదాదాదు మందిరం,
> స్వర్గలోక కళలు గలది
> మహాలోక సుందరం
> నిలిచి ఉంది నిటారుగా
> గగనానికి పైగా
> సూర్య చంద్ర తారకలే
> అలంకరణ కాగ
> ఎనిమిది అంతస్తులలో
> ఎనిమిది నాకాలు,
> అమృత ఝురులు పొంగే
> అద్భుత లోకాలు

ఈ పద్యంలో నిక్షిప్తమై ఉన్న రాజ భవన శిల్ప లక్షణాలు దాని ఎత్తు, ఎనిమిది అంతస్తులు, అందులోని జలాశయాలు, దాని సౌందర్యం గమనార్హమైనవి.

ఈ భావనలే కాదు ఆ కాలం నాటి ఇతర రాజభవనాలు కూడా నేడు లేవు. ఈ రాజభవనం కులీ వారసుని కాలంలో అగ్నికి ఆహుతి అయింది. ఇతర రాజ భవనాలను మొగలులు ధ్వంసం చేశారు. మొగలు విజేత ఔరంగజేబు ఈ రాజ

ప్రసాదాలలో నడుస్తూ, ఎత్తయిన ఒక భవనం గురించి విచారణ చేసినట్లు ఓ కథ ఉంది. ఔరంగజేబుకు మార్గం చూపుతున్న నియామత్ అలీఖాన్ అది దాదా మహల్ అని ఔరంగజేబుకు చెప్పాడట. అందుకు ఔరంగజేబు వ్యంగ్యంగా "షద్దాద్ మహల్ అనండి" అని వ్యాఖ్యనించాడట. షద్దాద్ పర్షియాకు చెందిన ఒక క్రూర నియంత. అయితే నియాత్. అలీఖాన్, మొగల్ చక్రవర్తిని, ఓడిపోయినా స్వాభిమానం తగ్గని వాడుగా శాంతంగా, జవాబిస్తూ "ఉన్నత సంకల్పం గలవారె అలాంటి సమున్నత భవనాలు నిర్మించగలరని" చెప్పినట్లు కథ ఉంది.

ఆ తర్వాత ఔరంగజేబు కుమారుడు యువరాజు అజీమ్ హైదరాబాదులో తన నివాసం కొరకు ఒక నూతన భవన నిర్మాణానికి అనుమతి కోరినప్పుడు ఔరంగజేబు రాకుమారుడిని నీకు ఈ కుతుబ్ షాహి రాజభవనాలు చాలవా? అని ప్రశ్నించాడు. అందుకు యువరాజు "నేను ఆ విశాల భవనాలలో దీపాలు వెలిగించ లేనని" జవాబిచ్చాడని అంటారు.

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో హైదరాబాద్‌లో మహమ్మద్ కులీ పట్ల ఆసక్తి మళ్ళీ చిగురించింది. ఇది భారీ ప్రశంసలకు దారి తీసింది. ఆ కాలం రచయితలు, వ్యాఖ్యాతలు ముఖ్యంగా డాక్టర్. జోరో వంటి ఆనాటి రచయితల తీరు మితిమీరిన పొగడ్తలతో నిండి పోయింది. వారి స్తోత్ర పాఠాలు వారు కులీ ఆస్థానకవేమో ననే భ్రమ కలిగించేలా ఉన్నాయి. కులీలో పొగడ దగ్గ అంశాలతో పాటు పరిమితులు కూడా ఉన్నాయి. ముఖ్యంగా ఆయన విషయాత్మక కవి. ఆయన కవిత్వం అవసరం నుంచి కాక సంపూర్ణ తృప్తి నుంచి పుట్టింది. ఆయన కవిత్వం వంచిత వాంఛల నుంచి కాదు, మోహం మొత్తే సుఖ భోగాల నుంచి ఉద్భవించింది. ఆయన ఒక శృంగార పురుషునిగా (gay Phi landerer) కవిత్వం రాశాడే కాని ప్రేమకై పరితపించే ప్రేమికునిగా రాయలేదు. ఒక చక్రవర్తికి ఉండవలసిన విచక్షణ, హద్దులు కట్టుబాట్లు లేకుండా ఆయన స్వేచ్ఛగా కవిత్వం చెప్పాడు ఆయన కవిత్వంలో పూర్తిగా నిష్కాపట్యం గోచరిస్తుంది. ఆయన ఏదీ దాచుకోలేదు. అన్ని ఆలోచనలను, అభీష్టాలను, కోరికలను మనసులో కొచ్చిన ప్రతిదానిని ఆయన

ఆలపించాడు. ఆయన కవిత్వంలో తన ప్రేయసిని ఆటపట్టిస్తాడు, రెచ్చగ అయినా ఆమెలో చలనం ఉండదు. అప్పుడు ఆమెకు మధువు తాగిం తాను మాట్లాడేలా చెస్తాడు.

వేలసార్లు వేడుకున్న
చిందలేదు చిరునవ్వులు,
ఒక్కచుక్క తాగిస్తే
దగ్గరయాయోయ్ దవ్వులు!

ప్రేమ విషయంలో ఆయన కొన్ని విశ్వజనీన వాస్త వివరించాడు!

ఆలకించరండి, ఇదే
ప్రేమగాధ పొంగు,
తెలుసుకోండి ప్రణయానిది
పసుపు పచ్చ రంగు!

"ఇల్‌నెస్ యాజ్ మెటఫర్" (రూపకాలంకారంగా అస్వస్థత) లో సంతాంగ్ పేర్కొన్న విధంగా శరీరం పచ్చగా మారడం వంటి రోగ ప్రయోగం కవిత్వంలో తరుచుగా కనబడుతుంది. కులీ తన ప్రేమ కవి ఇంకా ఇలా రాశాడు ;

ప్రేమ రుచి తెలియని వీరు
దేవ దూతలవశ్యం
ఎంతో కృషితోటి నాకు
తెలిసిందా రహస్యం!

**ఇంకా, ప్రేమపై కులీ :**

ప్రేమ విజేతల కిహపర
సౌభాగ్యం ప్రభువరం
ఉండబోదు సుంతయినా
వారికితర అవసరం!

సహజంగా కవిత్వాన్నీ, ముఖ్యంగా ఉర్దూ కవిత్వాన్నీ ప్రేమికుల ఎడబాటు, నిస్సహాయత, మానసిక నిస్పృహల నుంచి ఉద్భవించేదిగా పరిగణిస్తారు. కాని, కులీ ఆ భావనల వెంట వెళ్ళలేదు. ఆయన ఆనందాన్ని ద్విగుణీకృతం చేసే మద్యపానం మత్తు గురించి, కామకలాపాల ఆనందం గురించి ఈ రెంటినీ సాధ్యం చేసిన తన రాజభవనాల అందం గురించీ ఆలపించాడు. ఆయన కవిత్వంలో నిజమైన వినోదం, వేడుక, సంపూర్ణ స్వేచ్ఛ, సంపూర్ణ ఆనందం కనిపిస్తుంది. కులీ తన ఆనందాన్ని తానే ప్రస్తుతించాడు. ఆనందాన్ని అనుభవించడం కోసం తాను జన్మించానని లేక ఆనందమే తన కోసం జన్మించిందని ఆయన విశ్వాసం.

సుఖ భాగ్యాలనిలా అడిగిందా జవ్వని,
'లోకంలో మీరు ఎంధుకవతరించార'ని
ఆ ప్రశ్నకు అవి యిలాగ బదులిచ్చాయ్ నవ్వి,
'కులీ కోసమే, కాక మాకిక్కడ ఏం పని!'

తన సౌభాగ్యానికి మహా ప్రవక్త కారణం అని ఆయన తల పోశాడు. అందువల్లనే ఆయనకు స్వర్గ సౌఖ్యాలు లభించాయి. ప్రేమించమనీ ప్రేమతో పాలించమని ఆయన ఆత్మబోధ చేసుకొన్నాడు.

దివ్యకృపతో అప్సరలను పొందిన ఓ కుతుబ్ షా
రాజ్యం చెయ్ నువ్వి లాగె ఖుషీతోటి హమేషా !

**ఇంకా :**

ప్రవక్తకరుణొ ఓ కుతుబ్,
అపరిమిత సంయోగం,
ప్రస్తుతించు ప్రవక్తనే
తలచి స్వర్గ వైభోగం !

**లైంగిక శృంగార కవిత్వం :** కులీ కవిత్వం ప్రధానంగా శృంగార రసంలోని లైం
భావ పరంగా వుంది. అందుకు తగిన ఛందస్సును, ప్రాస ప్రక్రియను ఆం
ఎంచుకొన్నాడు,

( ఓ సుందరీ, ప్రియునితో రాతిరంత నిద్రను దరిచేరనీయలేదు నుః
అందుకే మన్మధుడు ఆనందించాడు. శయ్య సంతోషించింది. కాట
సంతసించింది. నేత్రాలు ఆనందించాయి.

ప్రియుడితో రేయంత
చేసి జాగారం
ఆపాదమస్తకం
ఆమె శృంగారం

**శబ్ద ప్రయోగం :** కులీ కవిత్వంలో శబ్దాలంకారానికి చాలా ప్రాధన్యతవున్న
కనిపిస్తోంది. ఆయనకు యిది చాలా యిష్టమయిన పద్ధతి అనిపిస్తోంది.

ఈ పద్ధతికి సమీప తెలుగు రూపం కింది పద్యాలలో ఛాయామాత్ర
గమనించండి.

లేచి, లేడి లేమలా
అరుదెంచింది అన్నుల మిన్న,
ప్రణయంలో తన ప్రాణం కలిపి
మధు పాత్ర నింపింది మగువ నిన్న

ఇంకాచూడండి :

స్వర్ణమంజరులు సవ్వడి చేయగ
కావలించుకొని స్వామిని
నిద్ర లేవమని నిరీక్షిస్తోంది
మత్తులో వయారి భామిని !

వసంతరుతువును వర్ణించే ఈ క్రింది పద్యంలో మనం సంగీత వాయిద్యాల శబ్దాన్ని, ముఖ్యంగా తబలానాదాన్ని విన్నట్టుంటుంది.

మధుర స్వరంతో వసంత కోకిల కుహూకుహూ అని పాడింది, తనన తనాదన తనానతనతన ఆడింది. తజా తన తలాల కోయిల కంఠస్వరంలో ఆడింది!

దీనితో బాటు మనం కవి కల్పిత శబ్ద సౌందర్యాన్ని శ్లేషార్థ శబ్దాన్ని గమనించవచ్చు. ఆయా ప్రాణులకూ వస్తువులకు సంబంధించిన శబ్దసృష్టి ద్వారా కవి పరిస్థితులను, కదలికలను, చివరకు వస్తువులను స్ఫురింప చేస్తాడు.

ఈ కవితలోని శ్లేష ప్రయోగాన్ని చూడండి.

నగుమోము నగల పేటిక
పెదవి అనర్ఘరత్నాల ఛాటిక
చుబుకవర్ణం పుష్యరాగం
కుచయుగం పై రత్నకాంతులు
అందమె తానై వున్నది చిన్నది !

మహమ్మద్ కులీ శబ్ద సౌందర్యాన్ని క్రింది కవితలోనూ చూడవచ్చు.

ఫెళఫెళార్భటుల యవ్వన శోభలు
ఉరకలు వేస్తూ సాగుతున్నవి
అలకించనీ గాజుల సవ్వడి,
గలగల గలగల మోగుతున్నవి!

లయ, ఛందస్సు అంతర్గత భావలయ ఆయన కవిత్వం అంతట కనిపిస్తాయి. వాటిని అనువాదంలో చూపడం అసాధ్యం. ఆయన సరళ సున్ని భాషలో ఎడబాటులోని వేదనను, కలయికలోని మాధుర్యాన్ని వర్ణించాడు.

సమాగమమే ప్రియా జీవనం
ఎడబాటంటే మరణం,
ఆమె చేతిలో అందిన చషకం
అఖిల లోక పరిపాలనం.

ఆయన తన శృంగార సాహసాల వర్ణనలో ఏ మాత్రం పరిమితుల పాటించలేదు. చాలామంది పాలకులు ఈ పనులకు పాల్పడినప్పటికీ, వాటి గుంభనంగానే ఉంచారు. కాపట్యాన్ని ప్రదర్శించారు. కాని, కులీ ఏ మాత్రం జంకు గొంకూ పాటించలేదు. వాటిని బహిరంగంగా ప్రకటించాడు. ఆయన ఆనందంలో మునిగి తేలాడు. ప్రతి సౌఖ్యాన్నీ ఒకటికి రెండుసార్లు అనుభవించాడు. ముందు ప్రేరణపూర్వకంగా ఊహిస్తాడు. ఆ తర్వాత స్వయంగా అనుభవిస్తాడు. ఆ తరువా విమర్శనాత్మకమయిన ఆలోచనతో తిరిగి అనుభవిస్తాడు. 'టెనిసన్' కవి 'యులిసి వలె (లైఫ్ టుది లీస్) కులీ జీవితాన్ని అడుగంటా జుర్రుకుంటాడు. ఆయ భోగలాలసత్వం, మద్యపానాలలో ఇస్లామ్ మత భ్రష్టత ఉంది. ఆయన త. సరాగాలను ప్రేమకలాపాల రహస్యాలన్నింటినీ పాఠకుల ముందుంచాడు.

ఆయన తన స్త్రీలు, వారిలోని రకాలు, వారి స్వభావం, వస్త్రాలంకరణ ఆభరణాల గురించి చేసిన వర్ణన ఆధారంగా ప్రొఫెసర్ సయ్యిద్ జాఫర్ ప్రేమ విషయంలో కులీకి సంస్కృత సాహిత్యంలో మంచి పరిజ్ఞానం ఉంద సూచించారు. భారతీయ కామశాస్త్ర గ్రంథాలు కొ'క్కోక శాస్త్రం' 'రతిశాస్త్ర గ్రంథాలతో ఆయనకు మంచి పరిచయం ఉన్నట్లు కనిపిస్తోంది. ఈ సంస్కృ గ్రంథాలకు పార్శీ, ఉర్దూ అనువాదాలు అప్పటికే లభిస్తున్నాయి. కొక్కోక శాస్త్రాన్ని మహమ్మద్ కులీ ఆస్థాన కవి జమా పార్శీలోకి అనువదించినట్లు తెలుస్తోంది కావ

సూత్రాలలో వర్ణించిన పద్మిని, చిత్రిణి, శంఖిణి, హస్తిని జాతిస్త్రీలను కులీ పేర్కొని ఉండటం వల్ల ఆయన వాటిని చదివి ఉంటాడని నిస్సందేహంగా భావించవచ్చు. అందువల్లనే కులీ సంస్కృత భాషను కొనియాడి ఉండవచ్చు. సంస్కృతాన్ని సప్తసముద్రాలతో పోల్చి సంస్కృత జ్ఞానంగలవారు దాని ఫలితాలను అందుకొంటారని ఆయన అన్నాడు.

సప్త సముద్రసమం
సంస్కృత భాష,
తరచి చూస్తే తెలుస్తుంది,
అది, చమత్కార ఘోష

ఉర్దూ భాషలో మహమ్మద్ కులీ మొట్ట మొదటి లైంగిక శృంగార కవి. తరువాత వచ్చిన జురాత్, ఇన్షా, రంగీన్ మొదలైన కవులంతా ఆయన ప్రారంభించిన సంప్రదాయాన్నే అనుసరించారు.

**రాగాలు :** కులీ తన కవిత్వంలో వివిధ రాగాలను, రాగిణులను, సంగీత వాయిద్యాలనూ పేర్కొనడాన్ని బట్టి ఆయనకు విస్తారమయిన, విశేషసంగీత శాస్త్ర జ్ఞానం ఉన్నట్టు కనిపిస్తోంది. కులీ సంగీత శాస్త్రంగురించి సంపూర్ణ జ్ఞానంగల వానివలే అలవోకగా సంగీత విషయాలను ప్రస్తావించాడు. అందువల్లనే మనకు ఆయన భాషలో అసాధారణ సంగీత రాగాలాపన వినిపిస్తుంది. ఆయనకున్న సంగీతజ్ఞానం వల్లనే, ఆయన భాషలో శబ్ద చమత్కారం, శ్లేషార్థ ప్రయోగం ఉద్భవించి ఉండవచ్చు. సంగీత ప్రాధాన్యతను ఆయన ఈ క్రింది పద్యంలో యిలా పేర్కొన్నాడు.

నాతో కలిసి శంఖం వూదుతూ
శంకరాభరణం ఆలపించే చిన్నది,
ఆమే నా హృదయానికి
అతి చేరువలో వున్నది !

ఆయన సావేరి, ధనశ్రీ, గౌరి, మల్హార్, కల్యాణి, బసంత్, రామ్‌కలి రాగాలను ప్రత్యేకంగా పేర్కొన్నాడు. ఆయన సంగీత, నృత్య శాస్త్రాలలో అనుభవశాలి. ఆయా శాస్త్రాల పరిపోషకుడు కూడా అయి ఉండవచ్చు.

కొందరు రచయితలు కులీ తన మతాన్ని గాఢంగా అభిమానించే వాడని పేర్కొన్నప్పటికీ ఆయన మతాభిమానం నిజానికి లోతయినది కాదు. ఆయన ప్రవర్తన, ఆయన మతవాది అనే వాదనను నిర్ధారించేదిగా లేదు. ప్రవక్తకు, పన్నెండుగురు ఇమాములకు ఆయన మొక్కుబడిగా చెల్లించవలసిన గౌరవాన్నే యిచ్చాడు. ఆయన పద్యాలలో ఎక్కువ భాగం తనకు అదృష్టాన్ని ప్రసాదించినందుకు అందులోని ఒకరికో లేక అంతకంటె ఎక్కువ మందికో కృతజ్ఞతలు తెలియజేయడంతోనో లేక భవిష్యత్తులో మరిన్ని వరాలను ప్రసాదించమనే ప్రార్థనతోనో ముగుస్తాయి. ప్రవక్తకు, ఇమాములకు వారికి చెల్లించవలసిన గౌరవ మర్యాదలు చెల్లించిన పిదప కులీ తనకు ప్రీతికరమైన కాలక్షేపం మధువు, మగువ వైపునకు మరలి పోతుంటాడు. ప్రార్థనల విషయంలో నిష్టగా ఉన్నప్పటికీ ఆయనను భక్తుడుగానో లేక దైవ చింతనగల వాడిగానో భావించలేము. తనను ప్రేమికునిగా చేసినందుకు ప్రవక్తకు కృతజ్ఞతలు తెలియజేస్తూ పంజ్‌తానె (ఇస్లామ్ మతంలోని అయిదుగు పవిత్ర వ్యక్తులు - మహమ్మద్, ఫాతిమా, అలీ, హసన్, హుస్సేన్) తనకు శక్తి ప్రసాదించారని కులీ ఒకచోట అన్నాడు.

ఈద్ (రమజాన్) పండుగ గురించి రాస్తూ ఆయన

అధరాలకు అందించండి
ఈ ఆనందవేళ మధుపాత్ర,
లలనను నా శయ్యకు చేర్చండి
సాగి స్తాయక సుఖ యాత్ర!

ఆయన కవిత్వంలో ఉత్తేజకరమయిన భారతీయాంశ తగినంతగా కనిపిస్తుంది. ఆయన ప్రయోగించిన ఉపమానాలు, రూపకాలంకారాలు, ఆయన



మహమ్మద్ కులీకుతుబ్‌షా 'దివాన్' లోని చిత్రపటం. లిఖిత ప్రతి
హైదరాబాద్‌లోని సాలార్‌జంగ్ మ్యూజియంలో లభ్యం

వాడిన సాహిత్య ఉపకరణాలు, ఆయన భావనలు అన్నీ భారతీయమైనవే. విదేశాల నుంచి దిగుమతి చేసుకున్నవి కావు. ఆయన అలంకారాలు భారతీయ మైనవే. అవి చిన్నా పెద్దా కవులందరూ వుపయోగించుకునే పాత కవితా సామగ్రి పాతరల నుంచి గ్రహించినవి కావు. ఆయన కవితా అలంకారాలను తన సొంతగా తయారు చేసుకున్నాడు. అవి ఆయన సాధికార ఆస్తి. భారతీయ పక్షులు, జంతువులు పువ్వులు, దుస్తులు, ఆభరణాలు, ఆటలు, వేడుకలు, పండుగలు, వసంతం- వసంత వేడుకలు, శీతకాలం, ఆయన పుట్టిన రోజు వేడుకలూ ప్రతిదీ వాస్తవమైనదే. ఆయన చూసినవే. ఆ కళ్ళముందు జరిగిన సంఘటనలే. ఆయన అనుభవాలే ఇవన్నీ ఆయన కవిత్వానికి ముడి పదార్థాలు ఆయన స్వహస్తాలతో నగిషీలు చెక్కి రూపొందించిన సుందర కళారూపాలు, ఆయన కవితలు. ఆయన సాధారణ మహిళలు ధరించే చీర గురించి కవిత్వం చెప్పాడు. తరువాత నాలుగు శతాబ్దాల వరకు, 20వ శతాబ్దంలో ఆధునిక కవులు రంగ ప్రవేశం చేసే వరకు ఉర్దూ కవిత్వంలో చీర ప్రస్తావన లేదు. ఆ తరువాత కూడా చాలా అరుదుగా మాత్రమే చీరను కవితా వస్తువుగా స్వీకరించారు. కులీ దృష్టిలో ఈద్ నాటి నెలవంక - ఆకాశపు ఏనుగు దంతం. పెదవులు కొబ్బరి ముక్కలు; పళ్ళు 'చిరోంజియా సఫీదా' గింజలు; స్వేద బిందువులు గసగసాలు. కళ్ళు- మసీదు ఆర్చీల నీడన నిద్రిస్తున్న తాగుబోతులు. ప్రేయసి శ్వేత వర్ణకుచద్వయం మీద పరుచుకొన్న ఆమె దీర్ఘమయిన కురులు పర్వతాలను కప్పేసిన నల్లని మేఘాలు. మరోచోట ప్రేయసి తెల్లని రొమ్ముల చివర వున్న నల్లని చను మొనలను వర్ణిస్తూ ఆయన, సూర్యుడు రాత్రి ని తనలో ఎలా బంధించాడో అని ఆశ్చర్యం ప్రకటించాడు. ఆయన దృష్టిలో ప్రేయసి అందాల ముందు కరగిపోతున్న కొవ్వొత్తి సూర్యుడి ముందు నశించిపోయే వడగళ్ళ వంటిది. ఇలాంటి వాస్తవ ఉపమానాలు, రూపకాలంకారాలు ఆయనకు పూర్వం గానీ ఆయన తరువాత కానీ కనిపించవు. ఆయన కవిత్వంలో అరేబియా, పర్షియాలలోని నదుల ప్రస్తావన కనబడదు. డజ్లా, ఫరాత్ నదుల గురించి గాని జెహూన్, సెహూన్ నదుల గురించి గాని ఆయన ప్రస్తావించడు.

భారతదేశపు జీవ నదులు గంగ, యమున లనే ఆయన తన కవిత్వంలో వర్ణించాడు. ఆయన ప్రియురాలొకామె పాడుతోంది వినండి.

ఓ నా ప్రియా, ఇవాళ
నా దేవాలయానికి విచ్చేయి,
నా యవ్వనమంతా అప్పుడిక
నీకే ధారబోస్తా !

ప్రజాకవి : ఇది మీరా, సూరదాస్ కవిత్వ ఛాయలున్న హిందీ, హిందూ గీతం తప్ప మరొకటి కాదు. మొత్తం మీద ఆయన వాడిన భాష ఆయన ప్రయోగించిన ఛందస్సులు, కవితాలంకారాలు అన్నీ భక్తి ఉద్యమంలోని కవులు వాడిన భాషను పోలి వున్నాయి. తేరా సెయిన్ తుఝుమే. ( నీ ప్రభువు నీలోనే ఉన్నాడు) కాఫిర్ రీత్ వంటి ఆయన పద్యాలు కబీరో నానకో రాయ వలసిన పద్యాలు. మొదటి పద్యం శీర్షిక వాస్తవానికి కబీర్ రాసిన ఒక దోహా నుంచి స్వీకరించినది. కులీ కవితా స్వరమంతా 'ఆదిగ్రంథ్' లోని రచనా విధానాన్ని గుర్తు చేస్తుంది.

కీ.శే. డా. జోరె 1940లో తొలిసారిగా మహమ్మద్ కులీ కవితలు కొన్నింటిని తన వ్యాఖ్యానంతో సంకలనం చేశారు. 1940లో ఆదిలాబాద్ జిల్లా జగిత్యాలలో ఒక వివాహ వేడుకలో మహమ్మద్ కులీ జల్వా మీద రాసిన పద్యాల్ని జలాలుద్దీన్ హైదర్ అనే వ్యక్తి విన్నట్టు డా. జోరె అందులో పేర్కొన్నారు. కులీ మునాజాత్‌లు ((ప్రార్థనా గీతాలు) కొన్ని, ముఖ్యంగా హైదరాబాద్ నగరం గురించి రాసిన 'మునాజాత్' ఇప్పటికీ చాలామంది పాడుతుంటారు. నగరనిర్మాత పట్ల గౌరవసూచకంగా నేటికీ హైదరాబాదులో కొన్ని ఉత్సవాలు ఆ పద్య ఆలాపనతో ప్రారంభ మవుతూ వుంటాయి.

మహమ్మద్ కులీ పుంఖానుపుంఖంగా రాశాడు. ఆయన కవితా వస్తువుకు పరిమితులు లేవు. ఆయన కవిత్వంలో జీవితం సమగ్రంగా దర్శనమిస్తుంది. ఆయన సూక్తులు ఈ గడ్డన పుట్టిన బిడ్డలు. ఆయన భాష ప్రజలు మాట్లాడుకునే

దైనందిన భాష. ప్రజాకవిగా ఆయనను ఆగ్రాకు చెందిన నాజిర్ అక్బరాబాది (1740-1830)తో పోల్చడం జరిగింది. అయితే నాజిర్ సామాన్యుడు. సాదిక్ మహమ్మద్ పేర్కొన్నట్లు నాజిర్ ఉత్తేజిడయిన దేశ దిమ్మరి. వీధులలో జీవించాడు. కానీ, మహమ్మద్ కులీ, అక్షరాలా విలాసవంతమైన అభ్యంతర మందిరంలో జీవించాడు. అయినప్పటికీ ఇద్దరూ ఒకే విధమైన జాతీయాలు ప్రయోగించారు. ఇద్దరు కూడా జీవం తొణికిసలాడే తత్వాన్నీ, విషయైక వైవిధ్యభరిత జీవితం గడిపే వాంఛను జీవితంలోని వివిధ వర్ణాలను సొంతం చేసుకునే కోరికను సమంగా వ్యక్తం చేశారు. నాజర్ తన భుజాల మీద నుంచి లోకాన్ని చూస్తే కులీ రాజ ప్రసాద గవాక్షం (ఝరోకా) నుంచి ప్రపంచాన్ని దర్శించాడు.

గజల్‌తో పాటు కులీ ఉర్దూ కవిత్వంలోని మర్సియా, ఖసీదా, రుబాయి, మస్నవి, రేక్తి వంటి కవితా ప్రక్రియలలో కూడా నుంచి నైపుణ్యం ప్రదర్శించాడు.

**మర్సియా :** మర్సియా (స్మృతి గీతం) లో తీవ్రమయిన వేదన, తక్షణ ప్రతిస్పందన ఉండాలి. కష్టపడి కన్నీళ్లు కార్చినట్లు కృత్రిమంగా ఉండకూడదు. ప్రజలను స్పందింప చేయగల నిజమైన ఆవేదనను కలిగించాలి. దానికి సామూహిక శోక సందర్భాలకు తగిన ప్రత్యేక కంఠం ఉండాలి కులీ. రచించిన అయిదు మర్సియాలు ఇప్పటికీ ఆయన చాటువులలో లభ్యమవుతున్నాయి. మహమ్మద్ కులీ ఈ ప్రక్రియకు తగిన భాషను ఎంచుకోవడం విశేషం.

కులీ రచించిన ఈ శోక గీతాలు ఆయన కాలంలో చాలా ప్రచారం పొందాయి. మొహర్రం సందర్భంగా ప్రజలు వీటిని ఆలపించే వారు. ఈ శోక సమావేశాలను 'కవి రాజు' తానే నిర్వహించేవాడు. ఒక స్మృతిగీతంలోని ప్రారంభ పంక్తులు చూడండి!

రండి అందరం కలిసి చేద్దాము
ఈ శోకదిన రక్తరోదనం,
మన ఇమాములను గుర్తు చేసుకొని
గుండెలు పగిలే స్మృతి నివేదనం

కవి

ఇది విషాద దాయకమైన దరువు. సామూహిక శోకంతో పాటుసాగేగుండెలు బాదుకునే శబ్దాలతో శోక సమావేశాలు ఏవిధంగా ప్రతిధ్వనించేవో పాఠకులు ఊహించగలరు.

స్మృతిగీత రచనలో కులీ తన సమకాలీకులను మించిపోయాడు దక్కనీ కవులలో ఖసీదా అంత ప్రచారం పొందలేదు. దక్కన్‌లో మొట్టమొదటి ఖసీదాల కవి మహమ్మద్ కులీయే. ఖసీదాలు అతిశయోక్తులుగా పేరుపడ్డాయి. రాచవర్గాల లేక ఉన్నత పదవులలో ఉన్నవారి ప్రాపకం పొందడానికి ముఖస్తుతి, పొగడ్తలు నిండి ఉండే ఖసీదాలను సహజంగానే సులభమార్గంగా భావించేవారు. అయితే మహమ్మద్ కులీ ఇలాంటి అవసరాలకు అతీతుడు కావడం వల్ల ఆయన తన మనసుకు నచ్చినట్లు ఖసీదాలు రాయగలిగాడు. ఆయన రాసిన 'ఈద్', నవరోజ్ (పర్షియన్ నూతన సంవత్సరం), బసంత్ (వసంతం) వంటి కొన్ని అద్భుత ఖసీదాలు రాజ ప్రాసాదాల వైభవాన్ని తెలియజేసేవి కాగా మరికొన్ని ఆ కాలం నాటి ఆచార వ్యవహారాలను వర్ణించేవి. రూపం విషయం లోనూ నిర్ణయించిన బంధనాలను కులీ తెంచివేసి స్వేచ్ఛగా రాశాడు. నవ్‌రోజ్ గురించి ఆయన తన సహజ ధోరణిలో ఆనందాన్ని ప్రకటించాడు.

తాజా కమలాలు, కన్నె మొగ్గలు
ఏతెంచాయ్ ఈ 'నవరోజ్' నాడు,
మహా ప్రవక్తకు ధన్యవాదాలు,
కలిసి మనం వున్నందుకు నేడు !

ఈ పద్యం (ఉర్దూ) లోని ఛందస్సు, చక్కని వస్తు ధ్వన్యనుకరణం చెప్పుకోదగ్గవి

**రుబాయి :** నాలుగు పాదాల పద్యరూపం రుబాయి. నైతిక వేదాంత దృష్టి దాని లక్షణం. దక్కనీ కవులు ఉర్దూకు రుబాయిని పరిచయం చేశారు. ఈ పద్య

రూపానికి కొత్త ప్రమాణాలను, ప్రగాఢతను చేకూర్చిన కవులలో మహమ్మద్ కులీ మొదటి వాడు. అప్పటి వరకు సలహాలు, సూచనలు ఇచ్చే మాధ్యమంగా వున్న ఈ పద్యరూపం, కులీ చేతులలో ప్రేమతత్వాన్నీ, శృంగార భావనను మోసుకెళ్ళే వాహనంగా మారింది. తాను జీవించిన పరిసరాలకు, పర్యావరణానికి ప్రతిబింబంలా రుబాయిని మలచడం ద్వారా కులీ రుబాయికి భారతీయ స్వభావాన్ని ఆపాదించాడు. ఉదాహరణకు చూడండి :

అల్ల నల్లన వెళ్ళి ఆమె చెవిలో పలుకు
పవనమా, నా మర్మవాంఛ గూర్చి,
మెల్లమెల్లగ పలుకు కుసుమపేశల భాష
చెలిమితో, గద్దించి అనబోకు స్వరం మార్చి !

**రేక్తి :** ఉర్దూలో 'రేక్తి' ఓ ఆసక్తి దాయకమైన కవితా రూపం. ఇది గజల్‌కు వ్యతిరేక రూపం. గజల్‌లో పురుషులు స్త్రీలతో నేరుగా మాట్లాడతారు. 'రేక్తి' లో స్త్రీలు మాత్రమే మాట్లాడే ప్రత్యేక భాషలో భావాలుంటాయి. గజల్‌తో పాటు, రేక్తిని కూడా ఇతర రూపాలలో ఉపయోగించడం జరిగేది. కనుకనే ఈ ప్రక్రియలో పద్యం రాయడనికి ప్రత్యేకమయిన ప్రతిభ అవసరం. కులీ ఈ శైలిలో కొన్ని అద్భుతమైన, సున్నితమయిన పద్యాలను రచించాడు. తన ప్రేమికుని నమ్మక ద్రోహం పట్ల ఒక స్త్రీ ఆగ్రహాన్నీ, అంతా తనకు తెలుసునని అతనికిచెప్పే ఆవేదనను ప్రతిబింబించే ఈ పద్యాన్ని చూడండి :

ఎవరితో గడిపావు, గత రేయిసాంతం,
నీ రెండు కళ్ళలో జాగరణ ఛాయ;
దాచ జాలవు యెంత దాచాలనున్నా,
ఇవిగివిగో చిహ్నాలు, సాగదికమాయ !

**చతురస్రం :** కులీ కవిత్వంలో ఒక మౌలిక కవితా రూపం కూడా కనిపిస్తోంది. దీనిని చార్-దార్-చార్ (నాలుగులో నాలుగు) అని లేక 'చతురస్రం' అని పిలుస్తారు. ఈ రూపంలోని కవితను నిలువుగా లేక అడ్డంగా, ఎలాగైనా చదువవచ్చు. ఎటు నుంచి ఎటు చదివినా ప్రతిపాదం ఒక సంపూర్ణపాదంగా వుంటుంది. అమీర్ ఖుస్రో పద్య ప్రహేళికల వలె యిది కూడా కవి చాతుర్యాన్నీ, పద్యరచనా నైపుణ్యాన్నీ చూపిస్తుంది. తెలుగులో కూడా యిటువంటి చిత్రకవితా ప్రయోగాలు కనిపిస్తాయి.

**ఉదాహరణ చూడండి :**

| లోకంలో | నినుబోలిన | నెలతల | నే చూడలేదు |
|---|---|---|---|
| నినుబోలిన | సొగసుపరుల | కెచటిదిలె, | లేదు జగతి |
| నెల తల | కెచటిదిలే | రాశిపడిన | ఈ రమ్యత |
| నేచూడలేదు | రంగేళీ | నీరమ్యత | ఎవరిలో |

నేడు కులీ కవిత్వం చదివిన వారికి, ఉర్దూ పంజాబీ నుంచి ఉద్భవించిందనే భావన మరింత బలపడుతుంది. కొన్ని శతాబ్దాలతరబడి ఉర్దూ భాష నుంచి తరిమి వేసినప్పటికీ, పంజాబీలో ఇప్పటికీ వాడుకలో ఉన్న అసంఖ్యాక పదాలు కులీ పద్యాలన్నింటా కనబడతాయి. ఇతర దక్కనీ రచయితలు, కవుల రచనలలో కూడ ఇదే పరిస్థితి ఉంది.

ఉర్దూ భాషలో, భారతీయ జీవన దృశ్యాన్ని ప్రతిఫలించే దేశభాషగా, సమగ్రత సామరస్యతల వాహకంగా రూపొందే సూచనలు ఆనాడు పొడచూపాయి. అప్పట్లో ఉర్దూ, హిందీ భాషల మధ్య ఒక్క లిపి తప్ప మరో వ్యత్యాసమేదీ లేనట్లు కనిపిస్తోంది. కులీ కవిత్వంలో అరబిక్, పర్షియన్ పదాలు దాదాపు లేవనే చెప్పాలి. కులీ తదితర దక్కనీ కవులు ప్రయోగించిన ప్రాచీన పదజాలంలో సంస్కృతం, హిందీ, పంజాబీ పదాలే కనిపిస్తాయికానీ, అరబిక్, పర్షియన్ పదాలు అంతగా

కనిపంచవు. దేవుడిని ఉద్దేశించిన ఖుదా, అల్లా వంటి సాధారణ పార్శీ, అరబిక్ పదాలకు బదులుగా దైవాన్ని సంభోధిస్తూ కబీరు, నానక్ తదితర భక్తి ఉద్యమ కవులు వాడిన 'కర్తార్', 'స్వామి' దయావంతా 'సత్పురుషా', 'సాధుపుంగవా', 'నిరంజన్' వంటి భారతీయ పదాలనే కులీ ఉపయోగించాడు! కులీ భాషలో విదేశీయత లేదు. కాఠిన్యం లేదు. నిఘంటువుల జోలికి వెళ్ళానవసరం లేదు. సరళ పదాలనే ఆయన తన కవిత్వంలో ప్రయోగించాడు. కులీ భాషలో మాతృభూమి మధుర పరిమళాలు గుబాళిస్తాయి.

కులీ తనను తాను రాజుగా సంబోధించుకునే సందర్భాలలో కూడా పాద్‌షా, షెహెన్‌షా లాంటి పార్శీ పదాలను వాడలేదు. రాజు లేక రాజాధిరాజు వంటి హిందీ పదాలనే ప్రయోగించాడు. రాజగీతం 'రాజ్‌తరన్' లో కులీ తన్ను తాను సంబోదించుకుంటూ ఇలా రాశాడు.

ఆ ప్రవక్త కృపతోనే
లభించింది రాజ్యవరం,
భాగ్యశాలివోయ్ రాజా
ఏలు దీన్ని నిరంతరం!

**స్వయంస్తుతి :** ఉత్తుత్తి ఆత్మస్తుతి చేసుకొనే ఒక సంప్రదాయం ఉర్దూ కవులలో ఉంది. కులీ కూడా అనేక పద్యాలలో తననుతాను కీర్తించుకున్నాడు. ఆయన తన కవిత్వాన్నే కాక తన రాజరికాన్ని కూడా స్తుతించాడు, కవిగా!

కులీ ప్రవచనాల్లో వుంది
ఉప్పు, దాన్ని రుచి చూస్తే
పంచదార అది నిజంగ
ఒప్పుగ నువ్వు పరికిస్తే!

తన జ్ఞానం గురించి ఆయన ఇలా చెప్పు కొన్నాడు.

పండితులేం నేర్పగలరు
అక్షరాలు తప్ప,
నా యెడదకు తెలుసు
పూర్తి పద్యంలో గొప్ప !

ఆయన తన పద్యాలను స్వచ్ఛమైన ముడి ముత్యాలుగా, వర్ణరంజితమయిన ముత్యాలుగా, పలురకాలుగా అభివర్ణించుకున్నాడు. ఆయన ఇలా చెప్పుకున్నాడు

"మహమ్మద్ షా, ఈ యుగపు కవి పాదుషా !"

అంతటితో సంతృప్తి చెందలేదు కులీ. ప్రఖ్యాత పార్శీ కవులు ఖాఖానితో హాఫీజ్‌తో సమానుడిగా తన్నుతాను అభివర్ణించుకొన్నాడు :

నీ కవితా శిల్పమమోఘ మది
దైవిక మక్షర జ్ఞానీ,
పాఠకులకు నీ పద్యం
అనిపించును 'ఖాఖానీ',!

మణిరత్నాల్ నీపదాలు
నీ భాషే వేరు,
హాఫిజ్ మణికిరీటాల
ధగద్ధగల తీరు!

ఆయన తన ప్రాచుర్యాన్ని చూసి మురిసిపోవడాన్ని మనం నిజంగానే కాదనలేము!

ఆ ప్రవక్త కరుణ వలన
ఓ 'మానీ', నీ పదాలు,
స్వీకరించి పాడుతున్న
వోయి నేడు జనపదాలు !

రెండవ పాదంలోని శబ్ద సౌందర్యం ఎంతో అద్భుతమైనది. దురదృష్టవశాత్తు అది అనువాదానికి పూర్తిగా లొంగడం లేదు.

నా కవిత్వం దైవకృతమైన అద్భుతం. దానికి ఎవరూ వ్యాఖ్యానం రాయలేరు అని ఆయన స్పష్టంగా పేర్కొన్నాడు.

రాయలేరు టీకా,నే
రాసిన కవితలకు
నా జ్ఞానం 'మహామహిమ'
'పండిత' పరితలకు !

ఆయన తన జన్మదినవేడుకలను గురించి కూడా అనేకపద్యాలు రచించాడు. కులీ తన జన్మదినాన్ని 'సాల్‌గిరా' అనకుండా 'బరస్ గంధ్' అనడం ఓ విశేషం, సాల్‌గిరా ప్రస్తుతం ఉర్దూలో వాడుకలో ఉన్న పార్సీ పదం. రెండవది హిందీ పదం. "ఓ తెలంగీ (తెలుగు) వనిత కోసం" అనే పద్యంలో ఒక తెలుగు మాటను కులీ అద్భుతంగా ప్రయోగించాడు. బహుశా ఆయన ఆ యువతి పట్ల అతి చొరవ ప్రదర్శించినప్పుడు ఆ తెలుగు పిల్ల ఆయ్యగారికి ఒక చురక అంటించి వుంటుంది.

ప్రవక్త దయతో కులీ చూపులో
నల్లపిల్ల పై పడితే
ఏందయ్యోయ్ అని అచ్చ తెలుగులో
ఎలాగ చిన్నది తిడితే!

ఇది ఆయనకు తెలుగు తెలుసుననే విషయాన్ని వివరిస్తోంది. ఆయన స్థానిక భాష అనే అర్థంలో 'హిందీ' అని పేర్కొన్నాడని భావించాలి. (ఉర్దూలో తెలుగు అని వుండవలసిన చోట హిందీ అని వుంది.)

మహమ్మద్ కులీ క్రియాత్మక కవి. ప్రగాఢ పరిశీలన, ఫలవంతమైన ఊహాశక్తి, భారతీయ సంగీత, కళా విలువలను గురించి చక్కని పరిజ్ఞానం,

తన జ్ఞానం గురించి ఆయన ఇలా చెప్పు కొన్నాడు.

పండితులేం నేర్పగలరు
అక్షరాలు తప్ప,
నా యెడదకు తెలుసు
పూర్తి పద్యంలో గొప్ప !

ఆయన తన పద్యాలను స్వచ్ఛమైన ముడి ముత్యాలుగా, వర్ణరంజితమయిన ముత్యాలుగా, పలురకాలుగా అభివర్ణించుకున్నాడు. ఆయన ఇలా చెప్పుకున్నాడు

"మహమ్మద్ షా, ఈ యుగపు కవి పాదుషా !"

అంతటితో సంతృప్తి చెందలేదు కులీ. ప్రఖ్యాత పార్శీ కవులు ఖాఖానితో హాఫీజ్‌తో సమానుడిగా తన్నుతాను అభివర్ణించుకొన్నాడు :

నీ కవితా శిల్పమమోఘ మది
దైవిక మక్షర జ్ఞానీ,
పాఠకులకు నీ పద్యం
అనిపించును 'ఖాఖానీ',!

మణిరత్నాల్ నీపదాలు
నీ భాషే వేరు,
హాఫిజ్ మణికిరీటాల
ధగద్ధగల తీరు!

ఆయన తన ప్రాచుర్యాన్ని చూసి మురిసిపోవడాన్ని మనం నిజంగానే కాదనలేము!

ఆ ప్రవక్త కరుణ వలన
ఓ 'మానీ', నీ పదాలు,
స్వీకరించి పాడుతున్న
వోయి నేడు జనపదాలు !

రెండవ పాదంలోని శబ్ద సౌందర్యం ఎంతో అద్భుతమైనది. దురదృష్టవశాత్తు అది అనువాదానికి పూర్తిగా లొంగడం లేదు.

నా కవిత్వం దైవకృతమైన అద్భుతం. దానికి ఎవరూ వ్యాఖ్యానం రాయలేరు అని ఆయన స్పష్టంగా పేర్కొన్నాడు.

రాయలేరు టీకా, నే
రాసిన కవితలకు
నా జ్ఞానం 'మహామహిమ'
'పండిత' పఠితలకు !

ఆయన తన జన్మదిన వేడుకలను గురించి కూడా అనేక పద్యాలు రచించాడు. కులీ తన జన్మదినాన్ని 'సాల్‌గిరా' అనకుండా 'బరస్ గంధ్' అనడం ఓ విశేషం, సాల్‌గిరా ప్రస్తుతం ఉర్దూలో వాడుకలో ఉన్న పార్శీ పదం. రెండవది హిందీ పదం. "ఓ తెలంగీ (తెలుగు) వనిత కోసం" అనే పద్యంలో ఒక తెలుగు మాటను కులీ అద్భుతంగా ప్రయోగించాడు. బహుశా ఆయన ఆ యువతి పట్ల అతి చొరవ ప్రదర్శించినప్పుడు ఆ తెలుగు పిల్ల ఆయ్యగారికి ఒక చురక అంటించి వుంటుంది.

ప్రవక్త దయతో కులీ చూపులో
నల్లపిల్ల పై పడితే
ఏందయ్యోయ్ అని అచ్చ తెలుగులో
ఎలాగ చిన్నది తిడితే!

ఇది ఆయనకు తెలుగు తెలుసుననే విషయాన్ని వివరిస్తోంది. ఆయన స్థానిక భాష అనే అర్థంలో 'హిందీ' అని పేర్కొన్నాడని భావించాలి. (ఉర్దూలో తెలుగు అని వుండవలసిన చోట హిందీ అని వుంది.)

మహమ్మద్ కులీ క్రియాత్మక కవి. ప్రగాఢ పరిశీలన, ఫలవంతమైన ఊహాశక్తి, భారతీయ సంగీత, కళా విలువలను గురించి చక్కని పరిజ్ఞానం,

విస్తృతపదజాలం అన్నీ కలసి ఈ అద్భుత కవిని సృష్టించాయి. ఆయన కవిత్వంలో భారతీయ అంశగల పర్షియన్, భారతీయ సంస్కృతుల, మతాల సమ్మేళనం వుంది.

జీవితంలోని దృశ్య, శ్రవణ స్పృహ దృక్కోణం కల కవి కులీ. అభిరుచి, రసహృదయం గల కవి. కవిత మాధుర్యాన్నీ, యవ్వన సౌందర్యాన్నీ తెలుసుకొన్న కవి. కవితా పరిమళం, సుగంధం గుబాళించిన కవి. సూర్యోదయంలోని, పగటి వెలుగులోని అరుదైన అందాలను, శ్రుతిని, యతినీ, నాట్య సంగీతలయనీ పూర్తిగా అవగాహన చేసుకున్న కవి. కులీ కవిత్వం సమస్త జీవన ఉత్సాహాన్నీ, ఉత్సవాన్నీ వైభవంగా గానం చేసింది. వార్షిక ఋతువులలో జీవన పరమార్థాన్నీ సారాన్నీ ప్రతిఫలించే వసంత, వర్ష, శిశిర, గ్రీష్మ ఋతువులలోని అమితమైన ఆనందాన్నీ ఆయన ఆస్వాదించాడు. పండుగలు, జన్మదిన వేడుకలు, వివాహ వేడుకలు, నూతన సంవత్సర ఉత్సవాలు నిర్వహించాడు. ఆయా వేడుకలను గురించి ఒకటి కాదు, రెండు కాదు, అనేకానేక పద్యాలను రచించాడు. జీవన చక్రభ్రమణంలో ఆయన ఈ సందర్భాల పునరాగమన వేడుకలను మరింత ఉత్సాహంగా వేడుకగా జరుపుకున్నాడు. ఆయన జీవితంపైన ఎన్నడూ విసుగు చెందలేదు. జీవితంలోని ప్రతి అంశం ఆయనకు ప్రేరణ కలిగించేదే ఆయనలో నీరసం, నిస్పృహ అనేవి ఇసుమంత కూడా లేవు. జీవితాన్ని ఆయన బలవంతంగా అయినా సరే సొంతం చేసుకొన్నాడు. అందుకే ఆయన ప్రతిస్పందన ఎప్పుడూ కచ్చితంగా ఉండేది. ప్రవక్తకూ, ఇమాములకూ యువకుడిగా కులీ గౌరవ మర్యాదలు చెల్లించేవాడు. ఫలితంగా ఆయనను అదృష్టాలు వరించేవి. ఆయన రాజుగా సుఖ ప్రదమైన విషయైక జీవితాన్నీ గడిపినవాడుగా గొప్పగా ఆనందించాడు. జంతు జీవన స్వేచ్ఛాప్రియత్వాన్ని దాదాపు అనుకరించాడు. ఓ స్వచ్ఛమైన జీవన భావన ఆయన రచనలన్నింటిలో ప్రతిధ్వనిస్తుంది

కులీ విశ్వాసం, కృతజ్ఞతా భావంగల కవి కూడా. ఆయన బచ్చుస ( తాగుబోతుల ఆరాధ్యదేవత) ను ఆరాధించాడు. ఆయన ఆనందాలన్నీ ఇస్లామ్ మతానికి వ్యతిరేకమైనవే. అయినా ఆయన తన మౌలిక మతం పట్ల విధేయతను

ప్రదర్శించాడు. ఆయన రాసిన ప్రతిపద్యం అంతిమ ప్రవక్తకు, షియా తెగ ఇమాములకూ కృతజ్ఞతలు చెల్లిస్తూనే ముగుస్తుంది. ఆయన పైన వారి ప్రభావం అంతవరకే పరిమితం. అంతకు మించిన మత భావన ఆయనలో లేదు. ఆయన మత విశ్వాసం ఆచారంకోసం మాత్రమే "దైవమానీ ఔన్నత్యానికి కృతజ్ఞతలు" అని, "ఆ అనుభవం అద్భుతంగా వుంది. అటువంటిది మళ్ళీ మరింతగా నాకు ప్రసాదించు" అని చెప్పినట్లుండేది. చిన్న పిల్లలు రాత్రి పడుకునే ముందు దేవుడిని ప్రార్థించి తమకోరికలు తీర్చమని అడిగినట్లు, కులీ తన పద్యాలలో దైవాన్నో లేక దైవ ప్రతినిధినో ప్రార్థిస్తూ ముగించే వాడు. ఈ విధంగా చూస్తే ఆయన మత భావన పైపైకి కనిపించేదే. అది అదృశ్య శక్తులను సంతృప్తిపరచే మర్యాద మాత్రమే. అయితే ఆయన కపటి కాడు. ద్వంద్వ వైఖరి గలవాడు కాదు. ఆయన సభ్యత, అసభ్యత, శీలం, అశ్లీలం, అన్నీ సమకాలికులకు తెలిసినవే. ఆయన తన భావితరాల కోసం అన్నీ రాసి ఉంచాడు.

మహమ్మద్ కులీ దక్కనీ, ఉర్దూ కవులలో మొదటివాడు కాదు. ఆయన ఏకైక దక్కనీ ఉర్దూ కవి కూడా కాదు. ఆయన కాలం నాటి గొప్ప కవులలో ఆయన ఒకడు. కల కాలం నిలిచిపోయే గొప్ప ఉర్దూ కవి. ఆయన తన కవిత్వం ద్వారా దక్కను కీర్తిని గానం చేశాడు. దక్కను కులీని చూసుకుని నేటికీ గర్వపడుతూ వుంది.

**కళా, సాహిత్య పోషణ :** స్వయంగా కవి కావడం వల్ల సహజంగానే కులీ సాహిత్యాన్ని పోషించాడు. ఆయన పోషణలో పార్శీ ఆస్థానభాషగా రాణించింది. ప్రజాభాషగా తెలుగుకీ ఉర్దూ లేక దక్కనీకీ మంచి ప్రోత్సాహం లభించింది.

**పార్శీ :** పార్శీ కవి హాఫీజ్ పట్ల కులీ అత్యంత గౌరవాన్ని ప్రదర్శించాడు. ఆయన కవిత్వంలోని కొంత భాగాన్ని ఉర్దూలోకి స్వయంగా అనువదించాడు. ఈ విధంగా దక్కనీలో ఆయన మొదటి అనువాదకుడు. కవిగా రాజుకు గల పేరు ప్రతిష్టలు, సాహిత్యం పట్ల ఆయనచూపినఆదరణ కారణంగా అనేకమంది విద్వాంసులు

పర్షియానుండి గోలుకొండకు తరలి వచ్చారు. అలా గోలుకొండకు వచ్చిన వారిలో మీర్జా మహమ్మద్ అమీన్‌హరిస్తానీ ఒకరు. మీర్ మొమిన్ సిఫారసు మేరకు కులీ ఆయనను మీర్‌జుమ్లాగానియమించారు. పది సంవత్సరాల వరకు ఆయన ఆ ఉన్నతపదవిలో కొనసాగాడు. మహమ్మద్ కులీ చనిపోయిన తరువాత ఆయన పర్షియా తిరిగి వెళ్ళిపోయాడు. ఆ తరువాత మొగల్‌చక్రవర్తి జహంగీర్ ఆస్థానంలో సేవలందించడానికి ఆయన తిరిగి వచ్చాడు. మీర్జా నిర్వహించిన అధికార బాధ్యతలు ఆయనలోని కల్పనాసామర్థ్యాన్ని దెబ్బతీయలేదు. అధికార బాద్యతలు నిర్వహిస్తూనే పార్సీ భాషలో ఆయన గొప్ప కవిత్వాన్ని రాశాడు. అయిదు 'మస్నవీ' ( ఖయాస్) సంపులాలు రచించాలనుకుని, నాలుగు సంపుటాలు మాత్రమే పూర్తి చేయగలిగాడు. ఇవికాక ఆయన రాసిన గజళ్ళు, ఇతర కవితలు వాసిలోనూ రాశిలోనూ బృహత్తర స్థాయిలో వున్నాయి.

పర్షియా నుంచి గోలుకొండకు వచ్చిన మరో పార్సీ కవి ముల్లా మహామిన్ మిసాక్ సుబాజ్‌వరి. ఈయన అహమద్‌నగర్ నుంచి విచ్చేసి గోలుకొండ ఆస్థాన కవిగా ఉన్నాడు. వీరు కాక గోలుకొండ ఆస్థానానికి చిన్నా చితకా కవులు అనేకమంది వచ్చిపోతుండే వారు.

**తెలుగు :** కుతుబ్‌షాహీ రాజులు తన ఒక తెలుగు కవిని ఆస్థాన కవిగా నియమించేవారు. వీరిని కుతుబ్‌షాకీ సంస్థాన పండితులు అనిపిలిచేవారు మహమ్మద్ కులీ కాలంలో పట్టమెట్ట సోమయాజులు అనే కవిని ఆ పదవిలో నియమించారు. తెలుగు సాహిత్య పోషకుడు కామారెడ్డిని మహమ్మద్ కులీ సన్మానించాడు. తమ్మ మంత్రి 'విప్రనారాయణ చరిత్ర' అనే ఒక భక్తి ప్రధాన గాధను రచించాడు. ఆయన పూర్తి పేరు సరంగు తిమ్మయ్య మాతెండు. ఈ గ్రంథకర్త కథనం ప్రకారం శ్రీరాముడు ప్రత్యక్షంగా ఆయన ముందు నిలబడి కథను చెప్పగా తాను రాసుకుంటూ పోయాడు. సంక్షిప్తంగా ఆ కథ ఇలా ఉంది :

విప్రనారాయణుడు కావేరి నదీ తీరాన గల శ్రీరంగ పట్నానికి చెంది

వైష్ణవ బ్రహ్మచారి. ఆయనకు తన నివాసం వద్ద ఒక పూల తోట ఉంది. రామభక్తులకు పూలను విక్రయించి, వచ్చిన ఆదాయంతో జీవించేవాడు. శ్రీరంగ పట్నంలో మధుర వాణి, దేవ దేవి అనే ఇద్దరు నర్తకీమణులు ఉన్నారు. వారిలో చిన్నది పూజారిని లోబరుచుకోవాలని ప్రయత్నించి మొదట విఫలమైంది. ఆమె తన అందచందాల పట్ల విపరీత విశ్వాసంతో, తన ప్రయత్నంలో విఫలమైన పక్షంలో వృత్తిని పరిత్యజిస్తానని ప్రతిజ్ఞ చేసి ఉంది. ఆ ప్రతిజ్ఞ ప్రకారం ఆమె భక్తురాలి వేషం ధరించి విప్రనారాయణుడి వద్దకు వెళ్ళింది. తను వ్యభిచార వృత్తిని త్యజించాననీ, ఆయనకు సేవలు చేయాలనుకొంటున్నానని చెప్పింది. కాలక్రమంలో ఆమె భక్తిలో పూజారిని మించిపోయింది. విప్రనారాయణుడు ఆమె భక్తి ప్రవత్తులకు కదలిపోయి ఆమె ఇంటికి తానే సేవకుడిగా వెళ్ళేందుకు సిద్ధపడ్డాడు. ఆవిధంగా దేవదాసి తన ప్రతిజ్ఞ నిలుపుకొంది. అయితే ఆమె యిప్పుడు పరివర్తన చెందింది. అందువల్ల ఆమె తన వృత్తిలోకి తిరిగి వెళ్ళేందుకు తిరస్కరించింది. అందుకు ఆమె తల్లి కోపించి దేవ దేవిని గదిలో బంధించి, పేదవాడయిన విప్ర నారాయణుడిని ఇంటి నుంచి తరిమివేసింది. అక్కడి నుంచి ఆయన తన ఆశ్రమానికి తిరిగివచ్చి తపస్సు ప్రారంభించాడు. బ్రాహ్మణుని రూపంలో బ్రహ్మ స్వయంగా ప్రత్యక్షమై ఆయనకు బంగారు ఆభరణాలు ప్రసాదించాడు. ఆ ఆభరణాలను దేవదేవి తల్లి వద్దకు తీసుకు పోయాడు. విప్రనారాయణుడి పైన దొంగతనం మోపి అతన్ని చారులు వధించ బోయే సమయంలో బ్రహ్మ ప్రత్యక్షమై విప్రనారాయణుడు ఏ నేరమూ చెయలేదని ప్రకటిస్తాడు.

ఉర్దూ : మహమ్మద్ కులీ ఆస్థానంలో ఇద్దరు ప్రముఖ ఉర్దూ కవులున్నారు. వజాహి క్రీ.శ. 1609 లో కుతుబ్ ముస్తారి అనే కథాత్మక దీర్ఘ కవితను రచించాడు. ఒక బెంగాల్ యువరాణిని కలలో చూసిన ఒక అందమైన యువరాజు ఎన్నో కష్టాల కోర్చి, అవరోధాలను అధిగమించి చివరకు ఆమె ప్రేమను పొందడంలో సఫలుడయ్యే కథ ఇది.

ఇది నిజానికి మహమ్మద్ కులీ, భాగమంతుల ప్రేమకథ అని కొందరు

విశ్వసిస్తారు. ఈ పద్య కావ్యంలో కేవలం నామమాత్ర నాయకుడైన యువరాజును ధీరోదాత్తుడనే పొగడ్తలతో ముంచెత్తాడు కవి. ఈ కవిత్వంలో వజాహి వర్ణనా చాతుర్యాన్ని ప్రదర్శించాడు. ఆయన పద్యరచన సున్నితంగా ప్రవాహం వలె దూకుతూ సాగిపోతుంది. ఈ గ్రంథంలో కొంత భాగాన్ని కవిత్వ స్వభావంగురించి తన అభిప్రాయాలను వ్యక్తం చేసేందుకు, కొంత భాగాన్ని తన కవిత్వాన్ని శ్లాఘించుకునేందుకు ఆయన కేటాయించాడు. గొప్ప ఉర్దూ కవులలో వజాహి ఒకడు.

వజాహి ఉర్దూ కవులలో మొట్ట మొదటి గద్య రచయిత కూడా. ఆయన 'సబ్‌రాస్' లేక 'అందం-హృదయం' అనే గద్య రచన క్రీ.శ. 1634లో, మహమ్మద్ కులీ మరణం తరువాత చేశాడు. ఇది పాత్రల ద్వారా కథ నడిపించిన రచన. ఇందులోని పాత్రలకు అందం, హృదయం, ప్రేమ, అనే కాక, మానవ శరీరభాగాల పేర్లను కూడా పెట్టాడు వజాహి. ఈ రచనలోని విషయం : అందం హృదయాల మధ్య సహజ ఆకర్షణ, వాటి నడుమ వచ్చే అవరోధాలు, అవి రెండూ ఏకం కావడం. మేధస్సు, ప్రేమ ఒకదానితో ఒకటి రాజీపడి పోవడంతో కథ ముగుస్తుంది. ఒప్పందం ప్రకారం మేధస్సు ప్రేమకు మంత్రి అవుతుంది ప్రేమ ఉన్నత మైనదే అయినప్పటికీ ఇది మేధస్సు పర్యవేక్షణలో ఉండాలనేది విజాహి విశ్వాసం. బహుశ ఇది సూఫీ బోధనలను వర్ణనాత్మకంగా చెప్పిన ఏ పార్శీరచనకో అనువాదమై ఉండవచ్చు. పదే పదే నీతి బోధలకు దిగడం వల్ల కథాకథనం కొంత దెబ్బతిన్నది. విజాహి రాసిన 'కుతుబ్‌ముస్తారీ'కి టి. గ్రాహమ్ బైలీ చేసిన అనువాదం నుంచి రెండు ఉదాహరణలు.

ప్రేమోదయం!

1. ఆమె భూమిపైనా లేదు. స్వర్గంలోనూ కనిపించలేదు. యువరాజు సర్వం కోల్పోయినట్లు ఆమెకోసం చింతిస్తున్నాడు.

2. ఆయన అనేక విధాలుగా వికల మనస్కుడై ఉన్నాడు. ఆయనస్థితి మాటల్లో వర్ణించడం అసాధ్యం

3. ఇది ఎవరికి జరుగుతోందో,వారికితప్ప ఇతరులెవ్వరికీ అర్థం కాదు.
4. రేయింబవళ్ళు అతడి స్థితి ఇదే. తను మట్లాడేది తనతోమాత్రమే.
5. ఆ మోహిని అతడి ఆలోచనలన్నింటినీ ఆవరించింది, అంబరు గడ్డిని ఆకర్షించినట్లు.
6. అతడు మేలు కున్నాడు, కానీ మళ్ళీ నిద్రపోయాడు, జవరాలు, మరి కలల్లో మాత్రమే కనిపిస్తోంది.
7. సఖి అలాగ కలలో మాత్రమే కనిపిస్తే ప్రియుడు నిద్రతప్ప వేరేమీ ఆశించడు!
8. మోహ పరవశత్వం, ఆందోళన, నిస్పృహ-రోజంతా శాంతి లేనే లేదు, ఒక్క నిద్రలో తప్ప
9. ఇది అందరికీ చెప్పేది కాదు. ఈ బాధను, నేనెవరిని నమ్మి పంచుకోగలను!
10. నాప్రియసఖి కోసం దప్పిగొన్నాను. నా శయ్యపైన నేను ఎగిసి పడుతున్న కడలిని!

మధుపాన విందు :

1. ఒక రాత్రి చక్రవర్తి కొలువు తీరాడు. మంత్రుల పుత్రరత్నాలు ఆయనను పరివేష్టించి ఉన్నారు.
2. ప్రతి యువకుడు అందంగా చూడచక్కగా ఉన్నాడు. యవ్వన తేజంతో అందరూ ప్రకాశిస్తున్నారు.
3. రాజాధిరాజు జామ్ లాగా యుద్ధమంటే భయమే లేదు. పరాక్రమంలో రుస్తుమ్ సయితం వీరి సాటి కాదు.
4. సభాసదులు, గాయకులు అందరూ అందం, తెలివి గలవారు రాజుతో కలసి ఒక చోట కూర్చుని ఉన్నారు.
5. చేతుల్లో మధుపాత్ర, చషకాలతో సభలోని వారు సరస సంభాషణంలో మునిగి ఉన్నారు.

6. గాయకులు లయబద్ధంగా పాడుతున్న పాటలకు భూమి ఆనంద ధ్వనులతో ప్రతిధ్వనిస్తోంది.

7. వారి ఉన్మాదగానం సాగుతూ వుండగా ఓ వెర్రి ఆవేశం కోరికలోంచి దూసుకుపోయింది.

8. వారు రాజుకు సంగీతసేవలు చేస్తున్నారు. మాధుర్యానికి మాధుర్యాన్ని జోడిస్తున్నారు.

9. గాయకులు మహదానందంలోకి అడుగు పెడుతున్నారు ఇక సంతాపంలో వున్న వారు కూడా సంతసంలో తేల వలసిందే!

10. మధువు, మధుపాత్ర, ఎండుపళ్ళు, చషకం అతిధులందరినీ మత్తులో ముంచేశాయి.

11. సగం రాత్రి గడిచి అర్ధరాత్రి వాలినప్పుడు మిత్రులు స్పృహను కోల్పోయారు.

12. సభికులు మాటతీరును మరచిపోయారు. గాయకులు వారి పరిసరాలను గాలికి వొదిలేశారు.

ఆస్థాన కవిగా వజాహి తన సమకాలీకులు కొందరి పైన ముఖ్యంగా గవాస్సీ పైన వ్యంగ్య కవితలు రాశాడు. కొత్త రాజు కొలువులో గవాసి ఆస్థాన కవి స్థానం అలంకరించినప్పుడు ఆయన తిరిగి వజాహి పైన వ్యంగ్య రచనలు ప్రయోగించాడు.

మహమ్మద్ కులీ, ఆయన ఇద్దరు వారసులు కాలంలో జీవించిన గవాసి తొలుత పేదవాడే, కాని తరువాత సుఖప్రదమైన జీవన స్థాయికి ఎదిగాడు. సహజంగానే సంపద ఆయన రచనా వ్యాసాంగాన్నీ దెబ్బ తీసింది. పేదరికంలోనే ఆయన మంచి కవిత్వాన్నీ రాశాడు. ఆయనను గొప్పకవిగా పరిగణించవచ్చు. కానీ తన సమకాలీకులు వజాహి, ఇబ్నెనషాతి స్థాయిగల కవికాదు. ఆయన రాసిన రెండు పుస్తకాలు ఖిస్సా-ఎ-సైఫుల్ ముల్క్-వ-బద్రుల్ జమాల్, తుతినామా మొదటిది ఈజిప్టు యువరాజు, చైనా యువరాణీల ప్రేమకథ 14వేల పంక్తుల ఈ కావ్య కథను

గవాస్సి అరేబియన్ నైట్స్ నుంచి స్వీకరించినట్టు భావిస్తున్నారు. రెండవది సంస్కృతం నుంచి అనువదింపబడిన ఒక పార్శీ గ్రంథానికి ఉర్దూ అనువాదం.

మహమ్మద్ కులీ వారసులు మూడు తరాల వరకు సాహిత్య పోషణ కొనసాగించారు. వారు కూడా కులీ వలెనె కవులు. మహమ్మద్ కులీ రాసిన అయిదు పద్యాల తెలుగు అనువాదాలతో ఈ అధ్యాయాన్ని ముగిద్దాము.

## వర్ష రుతువు

మృగశిర నాహ్వానించారు దేవదూతలు గగనాన ముత్యాల చినుకులు పొంగి పొరలి వర్షించాయి. పుడమి ముత్యాల తలపాగ, స్ఫటిక వర్ణపు పరికిణీ ధరించింది. ఎక్కడ చూసినా ఎర్ర ముఖమల్ రంగు పురుగులే!

హరిత వనంలో మయూరాలు పాడుతున్నాయి వివిధవర్ణ శోభితమయిన పక్షులు ఆనందగానం ఆలపిస్తున్నాయి.

అడవిలో మీకు కనిపిస్తున్నది

ముదురెరుపు పూలు కాదు, మంచులో తడిసిన నూనెలో మండుతున్న కొవ్వొత్తులు. తాజాదనంతో దళుకు లీనుతున్న రుతువును చూసి అందగత్తెలు అందమయిన దుస్తులు ధరించి, హొయలు ఒలికిస్తూ ఠీవిగా నడుస్తున్నారు.

వారి స్తనాలు అమృతజలంలా స్వచ్ఛంగా వున్నాయి.

ఆ వక్షోజాల మీది నల్లటి చూచుకాలు నిర్మలమయిన ఆకాశంలో రెండు నీలమేఘశకలాల్లా వున్నాయి. రుతువులోని ఆనందాన్ని అనుభవించడానికి ఆ సుందరాంగులు మధువు సేవించారు. మల్లెపూల మధ్య మల్ హార్ రాగాలు ఆలపిస్తూ భ్రమరాలు తిరుగుతున్నాయి.

ఆ నల్లని భ్రమరాలు ఆ అమ్మాయిల మల్లె మొగ్గల వంటి తెల్లటి చుబుకాల మీది (పులిపిరి) పుట్టుమచ్చల్లా వున్నాయి. ఆకాంతలు ఆపాదమస్తకం ధరించిన జిగేలుమనే వస్త్రాలు, కాలి అందియల ఘల్లు ఘల్లు శబ్దాలూ

నా మనసు దోచుకున్నాయి; నాకు మనశ్శాంతి లేకుండా చేశాయి.

నేను ఒడ్డున పడిన చేపలా అల్లాడుతున్నాను.

## పుట్టిన రోజు

ప్రవక్త ప్రార్థనల కృపతో వచ్చింది నా పుట్టిన రోజు నేడు
మోద వార్తతో మోగాయి మృదంగాలు చూడు చూడు
ప్రవక్త చేతి మీదుగా తాగాను కౌసర్ జలాన్ని నేను
కనుకనే దైవం నన్ను రాజుల తల మీది కిరీటంగా చేశాడు
అందరికంటే అత్యుత్తమ జన్మ తారక నాదె
నా రాజ వర్ణంతో మెరుస్తోంది గగనం,
సూర్య చంద్రులు 'చేతాళాల' వలె ఢీకొంటున్నారు,
ఆకాశం వేదికగా, కంజీర నాదాలతో
మదనుడు ఆనందంతో నృత్యం చేస్తున్నాడు
రతీదేవి తియ్య తియ్యగా కల్యాణిరాగం పాడుతోంది.
నవనవలాడుతూ తోట నవ్వులు చిందిస్తోంది.
గంటగంటకు ఫలాలు కుప్పగ అందిస్తోంది.
కట్ట కట్టి నా పగతుర నొకచోట చేర్చాడు దైవం
ఇక వారిని నిప్పుల మీద సాంబ్రాణిలా కాలుస్తాడు.
ప్రభూ! నా అభిలాషలు, ఆశలు ఈ డేరేలా దయచూడు,
వాన చినుకుతో భువికి సుఖశాంతులిచ్చినట్టు ప్రతి ఏడు.
నా జన్మదినం వచ్చింది, ఓదేవా! ధన్యవాదాలు,
దేవుని దయతో అరుదెంచింది నా పుట్టిన రోజు నేడు,
ఇమాముల ప్రార్థనల ఫలితం నా సుస్థిర రాజ్యం
జీవిత జలాన్ని దైవం నాకు ప్రసాదించాడు.

★ కుతుబ్‌షాహీల అధికార వర్ణం కృష్ణవర్ణం (నీలిరంగు).

కవి

## వసంతోత్సవం

వసంత మాడుదాము రావోయి ప్రియతమా
నే తారకగా నువ్వు జాబిలిగా.... అని.....
కాళ్లావేళ్ళాపడి ప్రియుణ్ణి పిలుచు కొచ్చిందా....!
ప్రియసమాగమంతో పులకించిన వసంతమా
యువ్వనపు స్నానపు తొట్టి ప్రేమతో పొంగి పొరలగా
రంగునీటిలో స్నానించే శరీరమా
తడిసిన రవికలో నల్లటి చను మొనలు,
సూర్య బింబం మధ్య బంధిత రాత్రిలా వున్నాయి -
ప్రవక్త దయతో వసంతమాడగా కుతుబ్ షా,
శోభాయమానమయ్యాయి త్రిలోకాలూ!

## మరో ప్రఖ్యాత పద్యం :

ప్రియుడు లేనిదే గొంతు దిగదు కద మదిర
అతడు లేనిదే గడవదు క్షణమయిన బతుకు కదర!
ఓర్మి చూపాలటోయ్ ప్రియురాలు చెంతలేనపుడు,
చెప్పడం తేలికే, ఆచరణ యెంత కఠినమో చూడు;
ప్రేమించని వాడు మహా మూర్ఖుడురా
దరి చేరనీయకు వాడిని ససేమిరా-
నావంటి పిచ్చివారికి సలహా చెప్పబోకు
మతిచలించిన వాడికి జ్ఞానం కలిగించడం అసాధ్యం!

## సావ్ లీ : (చామన చాయ చిన్నది)

ఆ చామన చాయ చిన్నదానిని చూసినప్పటి నుంచి
నాకు వేరేమీ గుర్తుండడం లేదు;
అల్లరి కళ్ళతో ఆ జవరాలు

సంచరిస్తోంది అందంగా,
నా అణువణువున ఆవరించింది రసనిష్యందంగా;
అనితర సాధ్యమయిన రీతిలో ఆమె హసించినప్పుడు
అనంత కౌముదులు అవతరిస్తాయి;
నీ నీలవేణి 'మోర్ఛల్' వలె ఊగుతుంది;
అతిసుందర వస్త్రాలలో
అలా నువ్వు ముంగిట్లో నడుస్తోంటే
గగనమే జేగేలు మంటోంది;
ముత్యంవంటి ఉల్లిపొర దుస్తులు
ధరించి నువ్వు చరించినప్పుడు,
దివ్య సౌందర్య దర్శనం చేసుకుంటాను,
నీ సుకుమార సౌందర్యం
నాకు తెలియనిదేమీ కాదులే -
ముత్యం రంగు ఉల్లిపొర దుస్తులలో
దాగనంది అందం,
రాచెలీ, వచ్చి నన్ను కౌగిలించుకో!

మహమ్మద్ కులీ దక్కన్‌లోని ఉర్దూ కవి ప్రముఖులలో అగ్రభాగాన నిలుస్తాడు. కనుక ఉర్దూ భాష అభివృద్ధిలో దక్కన్ నిర్వహించిన పాత్రను గురించి దక్కన్‌లో జరిగిన ఉర్దూ అభివృద్ధిని గురించి ఒక మాట చెప్పి ఈ ఉదంతం ముగించడం సహేతుకంగా ఉంటుంది. ఇంతకు ముందే పేర్కొన్నవిధంగా ఉర్దూ భాష ఉత్తర భారతంలో జన్మించి, క్రీ.శ. 1296లో అల్లా ఉద్దీన్ ఖిల్జీ మొదటి దండయాత్రతో దక్షిణ భారతదేశంలోకి ప్రవేశించింది. తొలుత బహుమనీల పాలనలో ఆ తదుపరి ఆదిల్‌షాహీలు, కుతుబ్‌షాహీల పాలనలో ఉత్తర భారతీయ ఉర్దూ నుంచి దక్షిణాది ఉర్దూ విడి పోయింది. ఉత్తర భారతపు ఉర్దూ నుంచి విడిపడి, తనవైన ప్రత్యేక లక్షణాలతో అభివృద్ధి చెంది 'దక్కనీ'గా పేరొందింది.

ఆ తర్వాత క్రీ.శ. 1680లో మొగలాయిల రెండవ ఆక్రమణ దక్షిణ దేశపు ముట్టడితో ఉత్తరభారతదేశం నుంచి మరొక ప్రత్యేక ఉర్దూ వచ్చి దక్కనీ పైన ఆధిక్యత కొరకు పోటీపడింది. ఈ పోటీలో దక్కనీ ఓటమి పొంది కేవలం ఒక ప్రాంతీయ మాండలిక భాషస్థాయికి పడిపోయింది.

1930 దశకంలో జరిగిన కొన్ని పరిశోధనల పుణ్యమా అని దక్కనీ ఉర్దూలో వున్న కొన్ని ముఖ్యమయిన అద్భుతమయిన రచనలు వెలుగు చూడడంవల్ల ఉర్దూ సాహిత్యంలో దక్కన్ నిర్వహించిన పాత్రకి కొంత గుర్తింపు లభించింది. డా. మసూద్ హుస్సేన్ ఖాన్ ఇలా పేర్కొన్నారు.

"పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాలలో ఒక వెలుగు వెలిగిన ఉర్దూ కవిత్వానికి ప్రత్యేకతను సంతరించిన కవితా రూపాలు, కవితా ధోరణులన్నింటికీ మూలం దక్కన్‌లోనే ఉంది. మస్నవి, ఖసీదా, గజల్, రేఖ్తా, రేఖ్తీ అలాగే వర్ణనాత్మక కవితా రీతులు, కథన శైలి అన్నీ ముందుగా దక్కన్‌లోనే అభివృద్ధి చెందాయి. దక్కనీ సాహిత్యంలో చోటుచేసుకొన్న కొన్ని భాషాపరమైన, సామాజికపరమైన ధోరణులు దురదృష్టవశాత్తు ఆ తరువాత కాలంలో అదృశ్యమయి పోయాయి. దక్కన్ భారతీయ పర్షియన్, అరబిక్ భాషల మధ్య సమతుల్యాన్ని సాధించగలిగింది. క్రీ.శ. 18వ శతాబ్దంలో, సాహిత్య కార్యక్షేత్రం ఉత్తరదేశానికి తరలి పోవడంతో ఈ సమతుల్యం చెదిరిపోయింది. దక్కనీ ఉర్దూ సాహిత్యానికి ప్రేరణ కలిగించింది ప్రధాన సాహిత్య అంశాలు పూర్తిగా భారతీయ భావనలు, విశ్వాసాలు మాత్రమే. మార్మిక భావనలను సైతం భారతీయ ధోరణులు ప్రభావితం చేశాయి. ఈ సంయోజన స్థితి 18వ శతాబ్దంలో ఉత్తరదేశంలో మౌలికమయిన మార్పునకు గురయింది కవితారీతులలో కూడా ప్రాధాన్యత మారిపోయింది. మస్నవీ నుంచి గజల్‌కు, వర్ణనాత్మక రూపాల నుంచి గేయరూపానికి, పూర్తిగా ఆత్మాశ్రయ, ప్రతీకాత్మక కవిత్వంగా ఉర్దూ కవిత్వం పరిణామం చెందింది. గజల్ ఉర్దూ కవిత్వానికి పర్యాయపదంగా మారి పోయింది.

★ డా. మసూద్ హుస్సేన్ ఖాన్: దక్కనీ ఉర్దూ - "హిస్టరీ ఆఫ్ మిడీవల్ దక్కన్" లోని వ్యాసం. సంపాదకులు: హెచ్.కె. షేర్వాని, పి.ఎమ్.జోషి (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం- 1973) పేజీ : 34

# ప్రేమికుడు

మహమ్మద్ కులీ సౌందర్యా రాధకుడు. మహా ప్రేమికుడు. ఆయన జీవితాన్ని కులాసాలతో విలాసాలతో గడిపాడనే విషయాన్ని చరిత్ర కారులు, రచయితలు అందరూ గుర్తించారు. కులీ కవిత్వమే దీనికి సాక్షి. మగువలతో మధుర సంగీత నాట్యాలలో హద్దు లేని విధంగా ఆయన మునిగి తేలే వాడని ఆయన కవిత్వం బహిరంగంగా ప్రకటిస్తోంది. కులీ ఒక పద్యంలో సుఖ సౌఖ్యాల సృష్టి తనకోసమే జరిగిందని నిర్ద్వంద్వంగా పేర్కొన్నాడు.

ఉన్నమాట చెబుతున్నా,
మధువు, వలపు, లేక బతుక లేను,
ఈ మేరకు ప్రతినకూడ
చేసేశా కదాయెపుడో నేను!

ఈ ప్రపంచంలోకి వినోదం, విలాసం తన కోసమే వచ్చాయని మహమ్మద్ కులీ విశ్వాసం. తనకు ప్రతిరోజూ కొత్త స్త్రీల మధ్య కాలం గడిపే అవకాశం ఇచ్చినందుకు ప్రవక్తకు ఆయన కృతజ్ఞతలు తెలియజేశాడు.

నవయువతుల తోడు నీకు
శాశ్వతమేనోయ్ కులీ,
రాత్రింబవలిదే రీతి
సదా నువ్వు గడపాలి!

ఆయన తన ప్రేమను గెలుచుకొన్న స్త్రీలపైన ఎన్నో పద్యాలు రాశాడు. ఆయన కవిత్వంలో 19 మంది వనితల పేర్లు తరుచూ కనిపిస్తాయి. కులీ జీవితంలోని స్త్రీల సంఖ్యలో విశేషమేమీ లేదు. అది రాజ పురుషుల జీవితాలకు లభించే అదనపు సౌఖ్యాలలో అంతర్భాగమే 'హక్కు' గా లభించే స్త్రీలను గురించి తన కవిత్వంలో పేరు పెట్టి ప్రస్తావించి వారిని గౌరవించాడు కులీ. అదీ విశేషం.

వారిని గురించి ఎటువంటి దాపరికమూ లేకుండా రాసి వారికి తనదైన పద్ధతిలో సమ్మానం కలిగించాడు.

**పన్నెండు గురు (ప్రియురాళ్ళు) :** ముహమ్మద్ కులీ తన కవిత్వంలో పన్నెండు మంది ప్రియురాండ్రను గుర్తించి ప్రత్యేకంగా ప్రస్తావించాడు. వారి గురించి 48 పద్యాలలో రాశాడు. కులీ తన కవిత్వంలో పేర్కొన్న ప్రియురాళ్ళలో కొందరు - నన్హీ (చిన్నది), సావ్‌లీ (చామన ఛాయది), కవ్‌లీ (కోమలమైనది), గోరీ (ఎర్రనిది) లాల్, లాలన్, మోహన్, ముష్తారీ (బృహస్పతి). అలాగే సుందర్, సజ్జన్, పద్మిని, బహమనీ, హిందూ వంటి మరో పది పేర్లను కూడా కులీ తన కవిత్వంలో ప్రస్తావించాడు. కులీ వారిని ప్రస్తుతిస్తూ 48 పద్యాలు, 335 ద్విపదలు రాశాడు. ఆయా స్త్రీలకే అంకితమిచ్చిన ఈ పద్యాలలోనే కాక, కులీ రాసిన అనేక ఇతర పద్యాలలో కూడా ప్రేమతత్వం పొంగి పొరలుతుంది తనకు పాఠాలు చెప్ప వచ్చిన ఉపాధ్యాయులకు కులీ తాను ప్రేమకోసమే జన్మించానని చెప్పి ఆట పట్టించే వాడు. బోధించేవారికి వాస్తవాల జ్ఞానం ఉండదంటూ కులీ "వాళ్ళకు 'అలీఫ్' (ఉర్దూ అక్షర మాలలోని మొదటి అక్షరం) కూడా తెలియదు, అలాంటి వారు నన్ను 'బె' (రెండవ అక్షరం) పలకమంటారు. ప్రేమలో 'అలీఫ్' ను పూరించడమే కష్టం" అంటూ ఎగతాళి చేశాడు. మరో పద్యంలో ఆయన దేవతలకు కూడా ప్రేమలోని మాధుర్యం తెలియదు ఈ మాధుర్యాన్ని నేను ఎంతో పరిశ్రమించి తెలుసుకొన్నాను అంటాడు. చాలామంది కవుల లాగ కులీ కేవలం ప్రేమ సిద్ధాంతాన్ని కవిత్వీకరించలేదు. ఆయన తన అద్వితీయ, అమోఘ అనుభవాల ఆధారంగా ప్రేమకవిత్వాన్ని రాశాడు. కులీ స్వయంగా గొప్ప ప్రేమికుడు. అంతకు మించి వలపు కళను క్షుణ్ణంగా అర్థం చేసుకున్న ప్రేమైక జీవి. ప్రేమ ఆయనకు నిత్యాధరవు. ఉర్దూ కవిత్వంలో గజల్ ప్రేమగీతం. ఆయన రాసిన లక్ష పంక్తుల కవిత్వంలో సగానికి పైగా ప్రేమ కవిత్వమే. ఇతర కవిత్వ ప్రక్రియలలో కూడా ఆయనకు ప్రేమే ప్రధాన అంశం. ప్రేమ గురించి అంత విస్తృతంగా రాయడానికి ఆయన దానిని తెలుసుకోవలసిన అవసరం ఉంది కదా! ఆయన ప్రేమతత్వాన్ని క్షుణ్ణంగా

అధ్యయనం చేశాడు. ఆయనే చెప్పినట్టు అది అర్థం చేసుకోడానికి ఎంతో శ్రమించాడు.

స్త్రీలలో ఆయనను అమితంగా ఆకర్షించిన ప్రత్యేక లక్షణం ఏదైనా ఉందా? ఎంతవెతికినా ఆయన కవిత్వంలో దీనికి సమాధానం లభించదు. నిత్య నూతనత్వం కోసం ఆయన అర్రులు చాచినట్టు మాత్రమే కనిపిస్తుంది. కేవలం భౌతికగుణమే ఆయనకు కావలసింది. తన స్త్రీలలో విశేషలక్షణం ఏదైనా కనిపిస్తే దానిని ఆయన తన కవిత్వంలో పొందుపరిచాడు. ఆయన ప్రియురాళ్ళలో నన్నీ-మోహనాంగి, సావ్‌లీ-ఉత్తమ స్వభావం గలది, కోయిల వంటిది, కవ్‌వీ-మత్తెక్కిన కళ్ళతో మధుపాత్ర చేబూని మైమరపించె మోహనాంగి. గోరి-గొప్ప సౌందర్య రాశి. చమేలీ విషయానికి వస్తే ఆమెను విడిచి ఆయన ఒక్క క్షణం జీవించలేడు. మోహన సిగ్గుల మొగ్గ, ఆమె కోసం కులీ లైలా కోసం మజ్నూలా పరితపించేవాడు. ఆమె సద్గుణ సంపన్నురాలు బిల్‌ఖిసీ స్వర్గం నుంచి దిగి వచ్చిన దేవకన్య. బహ్మరీ హిందూ యువతి ఎదుట కులీ బానిసలా మెలిగే వాడు. రంగేళి సుమధురమైన కంఠంతో, మధురమైన మధువు అందించే సుందరి. ఆమె కళ్ళు కామోద్రేకాలను రెచ్చగొట్టేవిగా ఉండేవి. ఆమె నడక తీరు:

మిల మిలలాడే తారక
మన్మథ రవళుల నడక,
యవ్వనుడెటు నిలువ గలడు,
పొంగుతూ ఎగసి పడక!

ఈ పద్యం అందమైన యువతి రూపాన్ని ఆవిష్కరించడమే కాక, ఆమె నడకలో ఆమె ఆభరణాలు చేసే శబ్దాన్ని సయితం ఎంతో సమర్థవంతంగా ప్రతిధ్వనిస్తోంది.

**భాగమతి :** మహమ్మద్ కులీ జీవితంలో లెక్కకు మించిన వన్నెలదొరసానులు ఉన్నప్పటికీ, వారందరిలోనూ ఒక వనితకు విశిష్ట స్థానం ఉంది. యవ్వనంలో అడుగుపెడుతున్న కాలంలో యువరాజు కులీ భాగమతి అనే ఒక హిందూ రైతు

కుటుంబానికి చెందిన స్త్రీ ప్రేమలో పడ్డాడు. ఆమె అందగత్తె. అపురూప నర్తకి. మూసీ నదికి ఆవల, ప్రస్తుతం చార్మినార్ ఉన్న ప్రాంతానికి సమీపంలో గల చిచ్లమ్ అనే గ్రామంలో ఆమె నివసించేది. ఆయనకు ఆమె పట్ల బలీయమైన మోహం ఉండేది. ఒక రాత్రి, మూసీనది పొంగి ప్రవహిస్తున్న సమయంలో ఆయన తన ప్రాణాలను సైతం లెక్కచెయ్యక ఆమెను చేరడానికి గుర్రాన్ని నదిలోకి దూకించాడని ఒక కథ ప్రచారంలో వుంది. ఇంతవరకు ఈ కథ నమ్మదగ్గదే. మోహోద్రేకంతో ఇటువంటి దుస్సాహసాలకు పాల్పడిన వారు ఆయనకు ముందు చాలా మంది వున్నారు. కులీ మొదటివాడు కాదు. చివరి వాడూ కాదు. ఈ సంఘటన కులీ తండ్రికి తెలిసింది. యువరాజుకు ప్రాణాపాయాన్ని నివారించడానికి గాను మూసీనది పైన వంతెన నిర్మాణానికి రాజు ఆదేశించాడని చెబుతారు. ఈ వంతెన నేటికి కూడా ఉంది. దీనినే 'పురానా పూల్' లేక పాత వంతెన అని పిలుస్తున్నారు. ఈ వంతెన నిర్మాణానికి ఆ కాలంలో లక్ష రూపాయలు ఖర్చయ్యాయని, రెండు సంవత్సరాలు పట్టిందని చరిత్రకారులు రాశారు. అయితే, చరిత్రలో దాదాపు ఇదే కాలంలో దయామయుడయిన మొగల్ చక్రవర్తి అక్బర్ తన కుమారుడు సలీమ్, అనార్కలీల ప్రేమపట్ల చూపిన కఠిన వైఖరికి పూర్తి విరుద్ధంగా కుతుబ్‌షా ప్రణయ ఘట్టం కనబడుతుంది. మొగలు చక్రవర్తి అనార్కలీని సజీవంగా ఇటుక గోడల మధ్య సమాధి చేశాడని ఒక కథ ప్రచారంలో వుంది. కులీ దుందుడుకు చర్యకు శిక్షగా ఆయనని యువరాజు మందిరంలోనే బంధించి వుంచి, ఒక సామాన్య గ్రామీణ యువతి మీద లగ్నమై వున్న కులీ మనసును మళ్ళించడానికి ప్రపంచంలో పేరెన్నికగన్న అందగత్తెలను ఆయన సేవలకు వినియోగించారని మరొకగాథ కూడా చెపుతారు.

ఆ తర్వాత కొద్దికాలానికే రాజు చనిపోయి యువరాజు సింహాసనాన్ని అధిష్టించాడు. ఆయన భాగమతితో తన ప్రేమకలాపాలను అడ్డు అదుపు లేకుండా కొనసాగించాడు. ఆమెకు ఎన్నో గౌరవాలను ప్రసాదించాడు. రాజు సందర్శనానికి ఆమె బయలు దేరినప్పుడు వెయ్యి గుర్రాలు ఆమె వెంట రావాలని ఆదేశించాడు.

క్రీ.శ. 1591 లో మహమ్మద్ కులీ భాగమతిని పెళ్ళాడి, ఆమె పేరిట 'భాగ్యనగర్' అనే ఒక కొత్త నగరాన్ని నిర్మించాడు.

ఈ కథలోని వివరాలు ఎలావున్నప్పటికీ భాగమతి చారిత్రక స్త్రీ అనే విషయంలో భిన్నాభిప్రాయం వ్యక్తం కాలేదు. ప్రాథమిక చారిత్రక సత్యాలకు కథకుల వ్రాతల్లో అతిశయోక్తులు కొన్ని చేరడం సహజమే. చరిత్ర కారుడు ఫరిష్తా (1570-1623) ఈ విషయమై 1619-20లో యిలా రాశాడు: "భాగమతి అనే వేశ్యపట్ల సుల్తాన్ అపరిమితంగా ఆకర్షితుడయ్యాడు. ఆమె దర్బారుకు దయచేసినప్పుడు, ఆమెకు లభించే గౌరవం ఉన్నత రాజ వంశీకులకు ఏ మాత్రం తగ్గరాదని ఆయన ఆదేశించాడు. నాలుగు కోసుల దూరంలో, మహమ్మద్ కులీ కుతుబ్‌షా ఒక నగరాన్ని నిర్మించి జన సమ్మర్దం చేసి ఆ నగరానికి తొలుత భాగ్యనగర్ అని పేరు పెట్టాడు. ఆ తర్వాత తప్పు చేశానని భావించి 'హైదరాబాద్'గా పేరు మార్చాడు. అయినా జన సామాన్యం మాత్రం దాన్ని భాగ్యనగర్ అనే వ్యవహరించే వారు."

క్రీ.శ. 1591-94 మధ్య కాలంలో అహమద్ నగర్‌లో అక్బర్ చక్రవర్తి అధికార ప్రతినిధిగా ఉన్న ఫైజీ మొగలు చక్రవర్తికి ఈ సంఘటనను నివేదిస్తూ మహమ్మద్ కులీ భాగ్యనగర్ అనే నగరాన్ని నిర్మించి ఆ నగరానికి చిరకాలంగా తన ఉంపుడుగత్తెగా వున్న ముసలిడొక్కు భాగమతి పేరు పెట్టినట్టు తెలియజేశాడు. మరొక సమకాలీన చరిత్రకారుడు నిజముద్దీన్ బక్షీ 1594 ప్రాంతంలో రాసిన 'తబ్‌ఖతె అక్బర్ షాహీ'లో విషయాన్నీ ధృవీకరించాడు. ఖాఫీఖాన్, నిహావంది కూడా తను పుస్తకాలలో ఈ ఉదంతాన్ని ప్రస్తావించారు. గోలుకొండను క్రీ.శ. 1648 లో 1652 లో రెండు సార్లు సందర్శించిన టావెర్నియర్, 1665-66 లో సందర్శించిన తేవ్‌నాట్, ఆ తరువాత 21 సంవత్సరాలకి గోలుకొండ సందర్శించిన బెర్నియర్ 'భాగ్యనగర్' లేక 'భాగ్‌నగర్' ప్రస్తావన చేశారు. 1214 హిజ్రీ (క్రీ.శ. 1799) నాటి 'హదీఖతుల్ ఆలమ్' లోనూ బీదర్‌కు చెందిన ఖాదిర్ ఖాన్ మున్షి 1306 హిజ్రి (క్రీ.శ. 1888) లో రాసిన తారీఖ్-ఎ-కుతుబ్‌షా (పేజి 16) లోనూ, 1260 హిజ్రి

(క్రీ.శ. 1844) గుల్జార్-ఎ- అసఫీ లోనూ ఈ ప్రస్తావన వుంది. ఈ చారిత్రక గ్రంథాలలోని ప్రత్యక్ష ప్రస్తావనలతో పాటు కవి వజాహీ రాసిన దీర్ఘ కవిత ' కుతుబ్ ముస్తారీ' లో కూడా భాగమతిని గురించిన వర్ణనాత్మక ప్రస్తావన ఉంది. ఈ గ్రంథం గురించి, మహమ్మద్ కులీ కవిత్వం గురించి చెప్పిన వెనుకటి అధ్యాయంలో వివరించాము. బహుశ 'కుతుబ్ ముస్తారీ' లోని నాయకుడు 'కులీ' యే అయి ఉండవచ్చు. అలాగే కథానాయిక పాత్ర భాగమతిని ఆధారం చేసుకుని మలిచింది అయి వుండవచ్చు!

ఆ తరువాత చరిత్రకారులు, రచయితలు ఈ కథను చరిత్రలో అంతర్భాగంగా ఆమోదించారు కానీ కీ.శే. ప్రొఫెసర్ షేర్వానీ ఈ విషయంలో వివాదాన్ని లేవనెత్తారు. భాగమతి అనే వ్యక్తి ఉండేదనడంలోనూ, ఆమె పేరే నగరానికి పెట్టారనడంలోనూ గల విశ్వసనీయతను ఆయన ప్రశ్నించాడు. మొదట ఒక కరపత్రంలో, ఆ తరువాత 1967లో ఆయన మహమ్మద్ కులీ పై రాసినఒక జీవిత చిత్రణలోనూ భాగమతికథను పూర్తిగా ఖండిస్తూ సుదీర్ఘ వివరణ ఇచ్చారు. అసఫ్ జాహీల కాలంలో కుతుబ్ షాహి సామ్రాజ్యాన్నీ వంశాన్నీ అపఖ్యాతి పాలు చేయడానికి అల్లిన ఒక కల్పిత గాధగా ఆయన భాగమతి కథను కొట్టివేశారు.

గమనించవలసిన విషయం యేమిటంటే, భాగమతి కథను ప్రొఫెసర్ షేర్వాని తప్ప మరెవ్వరూ వ్యతిరేకించిన దాఖలాలు లేవు. ఇటీవల ప్రొఫెసర్ (శ్రీమతి) సయిదా జాఫర్ తాను సంకలనం చేసిన మహమ్మద్ కులీ పద్యాలకు రాసిన పరిచయ వాక్యాలలో షేర్వాని మార్గాన్ని అనుసరించారు! 1940లో డా. జోరె ప్రచురించిన మార్గదర్శక రచన బాణీలోనే 1985లో జాఫర్ ప్రచురించిన ఈ సంకలనం రూపుదిద్దుకుంది. ఇందులో డా. జోరె పుస్తకంలోని అంశాలకు ఎన్నో సవరణలు, మార్పులు చేర్పులు జరిగాయి. భాగమతి విషయంలో కూడా ప్రొఫెసర్ సయీదా వాదన డా. జోరె వాదానికి పూర్తి విరుద్ధంగా ఉంది. మహమ్మద్ కులీ జీవితంలోని కొన్ని అంశాలపట్ల డా. జోరె, ప్రొఫెసర్ షేర్వాని రెండు విభిన్న వాదాలను ప్రతిపాదించారని చెప్పవచ్చు. డా. జోరె సల్తనత్ సుల్తాన్ పట్ల

అభిమానాన్ని వ్యక్తం చేస్తూనే కుతుబ్‌షాహి చక్రవర్తుల విజయాలను విశ్లేషణాత్మకంగా పరిశీలించారు. డా. జొరె, మహమ్మద్ కులీని గట్టిగా సమర్ధించారు. కులీ ఒక ఆదర్శప్రాయమైన, కచ్చితమైన పాలకుడని ఆయన ప్రతిపాదించారు. ప్రొ. షేర్వానీ కులీ బలహీనతలను గుర్తించారు. ఒకరు సాహిత్యకారులు. మరొకరేమో చరిత్రకారులు. కానీ, భాగమతి విషయంలో షేర్వాని వద్ద కచ్చితమైన ఆధారాలు లేనట్లు కనిపిస్తుంది. ఆయన తన వాదనను సాగదీసినట్లు అనిపిస్తుంది. అసలు భాగమతి అనే వనిత లేనే లేదనే ఆయన వాదన బలహీనంగా ఉంది. షేర్వాని మిగిలిన విషయాలలో ఫరిష్తాతో ఏకీభవించి భాగమతి విషయంలో మాత్రం ఫిరిష్తా చెప్పిన దానిని ప్రశ్నించారు. ఫైజీ ధృవీకరణకూడా షేర్వానీకి ఆమోద యోగ్యం కాలేదు. ఎక్కడో దూరంగా అహమద్‌నగర్‌లో వుండి, కర్ణాకర్ణిగా విన్న మాటల ఆధారంగా ఫైజీ అలా రాశాడని షేర్వానీ అభిప్రాయం. కాగా, పైన పేర్కొన్న పలువురు ఫ్రెంచి యాత్రికుల వివరణలు అనుమానాలను రేకెత్తించేవిగా ఉన్నాయని షేర్వాని ఉద్దేశం ఒకరు. భాగమతి పేరును గందరగోళం చేయగా, మరొకరు ఆమె పేరును తప్పుగా రాశారు. ఆ తరువాత చరిత్రకారులకు కూడా షేర్వాని దృష్టిలో మౌలికత లేదు. ఇస్లాం మత విశ్వాసాలు గల రాజు విగ్రహారాధకురాలైన ఒక నర్తకికి అంతటి గౌరవ మర్యాదలు ఇస్తాడా అనే అనుమానాన్ని సంయాదా జాఫర్‌కూడా వ్యక్తం చేసింది. కాని అనేకమంది చరిత్రకారులు ఎలాంటి అనుమానాలు లేకుండా భాగమతి కథను ఆమోదించారు. తరతరాలుగా ప్రజలు ఆకథను నమ్ముతున్నారన్నది రుజువైన వాస్తవం. 1665-66లో హైదరాబాద్ సందర్శించిన తేవ్‌నాట్ "ఈ రాజ్యపు రాజధాని నగరాన్ని 'భాగ్యనగర్ ' అని పిలుస్తారు. పర్షియన్లు దీనిని ఐదర్-ఆబాద్ అని పిలుస్తారు" అని ధృవీకరించాడు. ఒక పట్టణం పేరు మారినప్పటికీ సాధారణ ప్రజలలో పాతపేరు కొనసాగుతుంది. ఫిరిష్తా కూడా దీనిని ప్రస్తావించాడు.

భారతీయ నామవాచకాలను ఉచ్చరించడంలో తేవ్‌నాట్ 'హెచ్ ' అన్న అక్షరాన్ని వదలి వేయడం వల్ల ఆయన పేర్కొన్నది పూర్తిగా భిన్న విషయమని

అనలేము. 'హెచ్' అక్షరం, ఈ సంబంధిత వాక్యాలలో భాగ్యనగర్, హైదరాబాద్ రెంటిలోనూ వదిలివేయబడిందని గమనించాలి. ఫ్రెంచి భాషలో ఉచ్చారణ, లిపి- రెండూ సున్నితంగా ఉంటాయన్నది జగమెరిగిన వాస్తవం. తేవ్‌నాట్ ఇతర యాత్రికులు, ఇతర రచయితలు నామవాచకాల ఉచ్చారణలోనూ, రాయడంలోనూ ఒక నిర్దిష్ట విధానాన్ని పాటించలేదు. ఇష్టం వచ్చినట్లు రాశారు. ఫ్రెంచి యాత్రికుడి 'స్పెల్లింగ్' ఉద్యానవన నగరం అనే అర్థం వచ్చేదిగా ఉంది కనుక ఉద్యానవననగరమే అసలు పేరు అనే నిర్ణయానికి రావడం విపరీతమే అవుతుంది.

పదాల గుణింతాన్ని అంత కచ్చితంగా పట్టించుకోదలిస్తే తేవ్‌నాట్ ఒక్క 'భాగమతి' లోనే కాదు, 'భాగ్' అన్న పదంలో కూడా 'జి' తరువాత ఉండవలసిన 'హెచ్' ను వదిలి వేశాడని గమనించవలసి వుంటుంది. బాగ్ (Bagh) లో 'హెచ్' అక్షరం లేకపోతే ఆ పదానికి అర్థం ఉద్యానవనం అని కాదు, (Bag) 'పులి' అని వస్తుంది. దీనిని పట్టుకొని నగర పరిసరాలలో ఆనాడు పులులు యెక్కువగా ఉండేవని వాదించవచ్చు. అయితే ఒక్క తేవ్‌నాట్ తప్ప పార్శీ భాషలో రాసిన ఫిరిస్తా, ఇతర యాత్రికులూ ప్రామాణికగుణింతాన్నేవాడారు. ప్రొ. షేర్వాని పేర్కొన్నట్లు నగరం పేరు నిజంగా 'భాగ్యనగరం' కాక 'బాగ్‌నగర' మే అయినట్టయితే, ఫిరిస్తా తదితరులు ఈ విషయాన్ని స్పష్టంగా పేర్కొని వుండే వారు. యూరోపియన్ చరిత్రకారులు భారతీయ వ్యక్తుల, ప్రదేశాల పేర్లను తప్పుగా రాసిన సంఘటనలు యితరత్రా కూడా లేకపోలేదు. 'జర్నల్ ఆఫ్ పి. డబ్ల్యు ఫ్లోరిస్' మహమ్మద్ కులీ మరణాన్ని నమోదు చేస్తూ నిరంకుశత్వానికి మూలాధారమయిన మీర్ సుమెలా పట్ల సుల్తాన్ మహమ్మద్ వైరి వైఖరిని గురించి ప్రస్తావించడం ఇందుకు ఒక ఉదహరణ. ఇక్కడ ఫ్లోరిస్, మీర్ జుమ్లా అని రాయడానికి బదులు మీర్ సుమెలా అని రాశాడు. ఇదే విధంగా పులికాట్‌ను ఫాలియాకట్టి (Palea Cattee) అని పేర్కొన్నాడు. అలాగే క్రీ.శ. 1614లో వ్యాన్ రాలెస్టిన్ అనే డచ్చి వ్యాపారి తన లేఖనంలో కుతుబ్‌షాను 'కొటెబిక్సా' (Cotebixa) అని రాసుకొన్నాడు. బ్రిటిష్

హిందువులు ఆ నగరాన్ని భాగ్యనగర్ అనే పిలుస్తున్నారని కూడా రాశారు. (సంపుటి-2, పేజి; 552). ఖుదాబక్ష ఓరియంటల్ పబ్లిక్ లైబ్రరీ, పాట్నా వారి జర్నల్‌లోని ఒక వ్యాసంలో (సంపుటి;47, 1988, పేజి; 87-106) అలీఘర్ కు చెందిన డా. నజీర్ అహమద్ చరిత్రలో భాగమతి ఉనికిని రుజువు చేసేందుకు అవసరమైన సాక్ష్యాధారాలను పొందుపరిచారు.

ఇక్కడ, నాకు తెలిసినంతవరకు, ఎవరూ గమనించని ఒక అంశం ఉంది నూతన నగరానికి ఆ కాలంలో పెట్టిన పార్శీ పేరు 'ఫర్‌కుందా బునియాద్' అనే విషయంలో ఎవరికీ ఎలాంటి అభిప్రాయ భేదం లేదు. ఆనాటి సామాన్య భాషలో 'భాగ్యనగరం' ఆ పర్షియా పేరుకు పర్యాయపదం. ఇది యాధృచ్ఛికంగా జరిగిందా లేక, పార్శీ భాషావేత్తలు యెంతో పరిశ్రమించి భాగ్యనగరం అనే పేరును పర్షియన్ భాషలోకి యింత సుందరంగా అనువదించారా? ఒక కథను యింతమంది ప్రజలు నాలుగు శతాబ్దాలుగా విశ్వసిస్తున్నారంటే, అది నిజమే అయి వుండాలి. అంతేకాక ఈ కథ ఆ రాజు నడవడికీ ఆకాలపు స్వభావానికీ అతుకుతున్నది కూడా. ఈ కథకు కొంత కాల్పనిక స్వభావం కూడా వుంది. ఈ కథ కల్పితమని అనుమానించే వారికి, భాగమతి ఒకవేళ లేనట్టయితే ఆ పాత్రను సృష్టించవలసిన అవసరం వచ్చేదని సమాధానం చెప్పాలనిపిస్తుంది. ఎందుకంటే, ప్రేమకు చిహ్నంగా ఈ నగరం రూపు దిద్దుకుందని తరతరాలుగా ప్రజలు విశ్వసిస్తున్నారు. ఈ కథ ప్రేమతత్వాన్నీ, లౌకిక భావాన్నీ గట్టిపరుస్తోంది.

సుల్తాన్‌కి భాగమతి ఒక్కతే ప్రియురాలు కాదు. ఇంకా ఎందరో ఉన్నారు. వారిలో కొందరిని ఆయన పద్యాలలో కీర్తించాడు. లభ్యమవుతున్న సమకాలీన సాక్ష్యాధారాలను బట్టి సుల్తాన్‌కి సదా శృంగార దేవత అయిన భాగమతి ధ్యాసే. ఈ రాజవంశపు సుల్తానుల అధికారిక చరిత్రలో భాగమతి ప్రస్తావన లేని మాట యెంతనిజమో మహమ్మద్ కులీ భార్య లేక భార్యల ప్రస్తావన కానరాని మాట కూడా అంతే నిజం. అధికారికచరిత్ర రచనల్లో కొన్ని సన్నివేశాలనూ సంఘటనలను చాలా తెలివిగా కప్పిపెట్టడం జరుగుతూనే వుంటుంది. భాగమతి అధ్యాయం

కూడ బహుశ అటువంటిదే కావచ్చు. మహమ్మద్ కులీ తరువాత అధికారం లోకి వచ్చిన ఆయన వారసుడికి భాగమతితో కులీకి గల సంబంధాలు రాజదర్బారుకు తగనివని అనిపించి ఉండవచ్చు. ఫలితంగా భాగమతి చరిత్రను చెరిపి వేయమని ఆయన ఆదేశించి వుండవచ్చు. అయితే, ప్రాచ్య పాలకుల 'జనానా' ల లోని అసంఖ్యాక స్త్రీలకు, జాతి, కుల, మత, ఆర్థిక పరిమితులు లేవన్న వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే మహమ్మద్ కులీ అంత:పురంలో భాగమతికి లభించిన విశిష్టస్థానం అపకీర్తి దాయకంగా కానీ ఆశ్చర్యకరంగా కానీ నేడు యెవ్వరూ భావించవలసిన అవసరం లేదు.

ఇతర చక్రవర్తుల అర్థ రహిత ప్రేమకలాపాల రీతిలో కాక, కులీ శృంగార జీవితం ఒక ప్రయోజనాన్ని సాధించింది. అది ఆయన కవిత్వంలోని అధిక భాగానికి అనుభవ పూర్వకమయిన ముడిపదార్థంగా ఉపయోగపడింది. ఆయన తన కోరిక తీర్చుకొని శృంగార సంతృప్తి చెందిన తరువాత ఒక నిర్మల సిద్ధాంతిలా ఆ అనుభవాన్ని మననం చేసుకొని వివరంగా అక్షరబద్ధం చేశాడు. ఆయన కవిత్వంలో అధిక భాగం అలా అవతరించిందే. ఆ విధంగా కవితా స్వేచ్ఛతో కలిసి పటిష్టపడిన ఒక రాచరిక ప్రయోజనం కులీకి వుండేది. ఫలితంగా సిద్ధించిన ప్రయోజనం అసామాన్యమయినది. అందుకే కులీ ప్రణయ చేష్టలను మనం తప్పు పట్టము. ఆలా కాకపోయినా, ఆ దశలో ఆయనను నిలువరించగల వారెవరు? మహా మేధావి తాను చేయవలసింది చేసి తీరతాడు. కులీ నిస్సందేహంగా ప్రేమ కవితలో ఒక సృజనాత్మక మేధావి. కానీ ఆయన తన శృంగార జీవన విధానానికి మూల్యం చెల్లించక తప్పలేదు. కులీకుతుబ్‌షా 46 సంవత్సరాల నడి వయసులోనే మరణించాడు. ఉల్లాస భరితమైన, ప్రతిభావంతమయిన ఈ సుల్తాన్ జీవిత చరిత్రలో మనం బాధపడవలసిన విషయం ఇదొక్కటే.

# మహా భవన నిర్మాత

మహమ్మద్ కులీ గొప్ప భవన నిర్మాత. అపురూపమయిన అద్వితీయమయిన మహా భవనాలను నిర్మించాలనే ఆయన తపన మొగలు చక్రవర్తి షాజహాన్‌ను మరిపిస్తుంది. ఆయన నిర్మించిన అనేక భవనాలను, ఆయన పెంచి పోషించిన పలు అద్భుత ఉద్యానవనాలను ఆ తరువాత విజయోత్సాహంతో చెలరేగిన మొగలు సైన్యాలు ధ్వంసం చేశాయి. అయినప్పటికీ ఆయన నిర్మించిన మహోత్కృష్ట కళాఖండం చార్మినార్, మరికొన్ని చెప్పుకోదగిన కట్టడాలూ ఈ నాటికీ మిగిలి ఉన్నాయి. అన్నింటినీ మించి కులీ నిర్మించిన నగరం గుర్తు పట్టలేనంతగా పెరిగిపోయి, యిప్పుడు చతుశ్శతాబ్ది ఉత్సవాలను జరుపుకుంటోంది.

గోలుకొండ కోట కులీ తండ్రి ఇబ్రహీమ్ కాలంలోనే కిక్కిరిసి పోయింది. అక్కడ విపరీతంగా పెరిగిపోయిన జనాభా అనారోగ్య హేతువయింది. జనసాంద్రతను తగ్గించేందుకు ఆ కాలంలోనే కొంత జనాభాను ఇతర ప్రాంతాలకు తరలించిన దాఖలాలు కనిపిస్తున్నాయి. ఇబ్రహీమ్ క్రీ.శ. 1578లో మూసీనదిపైన ఒక వంతెన నిర్మించాడు. ఆయన తన కోటకు పశ్చిమ, ఉత్తర దిశలుగా నగరాన్ని విస్తరించాలని తలపోశాడు. తదనుగుణంగా ప్రస్తుత నగరానికి పశ్చిమంగా ఉన్న ఇబ్రహీమ్ బాగ్‌ను నిర్మించాడు. కానీ, ఆ ప్రాంతమంతా శిలామయం కావడం వల్ల అక్కడ తగినంత నీరు లభించక ఆయన ప్రయత్నం విఫలమయింది. అయితే మూసీనది మీద ఉన్న (నేటి) పాత వంతెన (పురానా ఫూల్) పుణ్యమా అని మూసీకి ఆవలి తీరాన ఒక అనుకూల ప్రాంతాన్ని గుర్తించడం జరిగింది. ఆ ప్రాంతం కోటకు సమీపంగా వుంది. సువిశాలమయిన బయలు ఉండీ లేనంత ఏటవాలుగా వుంది. ప్రధాన వాణిజ్య మార్గం పక్కన నీటి పారుదలకి అనువయిన పల్లపు భూమి. జల్లి నెల్లి చెరువు రూపంలో చక్కని నీటి సౌకర్యం వంటి అనేక అంశాలు అక్కడ కలగలిసి కనిపించాయి. అక్కడే 'చిచలం' అనే గ్రామం ఒకటి ఉండేది. ఈ గ్రామాన్ని నూతన నగరానికి కేంద్ర బిందువుగా చేసుకున్నారు. నేడు చార్మినార్ నిలిచి వున్నది

ఆ 'చిచలం' లోనే. కొత్త సులతాను కులీ ప్రేయసి, భాగమతిది ఈ చిచలం గ్రామమే అంటారు. భౌగోళిక అనుకూలత, ప్రేమ భావన-రెండూ ఆ ప్రాంతం ఎంపికకు దోహదం చేశాయి.

చరిత్రకారుడు ఫిరిష్తా ఉల్లేఖనని బట్టి ప్రపంచంలో అద్వితీయమైనదిగా, స్వర్గానికి ప్రతిబింబంలా ఉండాలని సుల్తాన్ భావించిన నగరం నమూనాను రూపొందించే పని చంద్రుడు సింహరాశిలోనూ, బృహస్పతి స్వగృహంలోనూ ఉన్న శుభప్రదమైన రోజున ప్రారంభించాలని మహమ్మద్ కులీ ఆదేశించాడు.

**నగరం నమూనా :** నగరాన్ని 'గ్రిడ్' విధానంలో బృహత్తరమయిన నలువీధుల కూడలిగా రూప కల్పన చేశారు. చార్మినార్ నగరానికి ప్రధాన కేంద్రం. చార్మినార్ నుంచి నాలుగుదిక్కులకూ నాలుగు ప్రధాన మార్గాలు వెళతాయి. ఈ నాలుగు రహదారుల్లో రెండు అప్పటికే వున్నాయి. తూర్పు తీరంలోని మచిలీ పట్నానికి వెళ్ళే మార్గం (ఇదే ఆనాటి ప్రధాన వాణిజ్య రహదారి) అప్పటికే ఉంది. ఈ మార్గానికి యిటు చివరన ఎనిమిది కిలోమీటర్ల దూరంలో, వంతెనకు ఆవల గోలుకొండ కోట వుంది. దానికి కుడిగా ఉత్తర, దక్షిణ దిశలను కలుపుతూ మరో దారి వేశారు. ఈ మార్గం ఉత్తరదిశన మూసీనదికి పోతుంది. దక్షిణ దిక్కుగా కోహి-ఎ-తూర్ రాజభవనానికి వెళుతుంది. ఆ భవనం నేడు లేదు. ఇప్పుడు ఫలక్‌నుమా పాలేస్ ఉన్న స్థలంలోనె కోహి-ఎ-తూర్ పాలేస్ ఉండేదని తెలుస్తోంది.

ఈ నమూనా ఈ ప్రాంతాన్నంతటినీ నాలుగు భాగాలుగా విభజించింది. పశ్చిమోత్తర భాగాన్ని రాజభవనాలకూ, ప్రభుత్వ కార్యాలయాలకు నిర్దేశించారు. పూర్వోత్తర భాగాన్ని రాజవంశీకుల నివాసాలకు కేటాయించారు. నాలుగు ప్రధాన మార్గాలనూ ఇరువైపులా పద్నాలుగు వేల దుకాణాలు, మసీదులు, సత్రాలు, భోజనశాలలూ, స్నానఘట్టాలు, పాఠశాలలతో కళకళలాడేలా ఊహచేశారు.

**చార్మినార్ :** చార్మినార్ తోనే నగర నిర్మాణం ప్రారంభమయ్యింది చార్మినార్‌ను 'తజియా' వలె నిర్మించారని ఒక అభిప్రాయం వుంది. 'తజియా' అంటే ఇమామ్:

హుస్సేన్ సమాధి మీద నిర్మించిన స్మారక భవనం. అయితే ఈ అభిప్రాయాన్ని చాలా మంది ఆమోదించలేదు. వీరి దృష్టిలో ఇది కేవలం నగరానికి కేంద్రం మాత్రమే. గానుగ సున్నంతోనూ, రాళ్ళతోనూ, నిర్దుష్టమయిన చతురస్రాకారంలో దీనిని నిర్మించారు. ప్రతి పార్శ్వం కచ్చితంగా 18.26 మీటర్ల పొడవుంది. నాలుగు వైపులా నాలుగు ఆర్చీలు ఉన్నాయి. ప్రతి ఆర్చీ వెడల్పు 7.3 మీటర్లు ఎత్తు 9.14 మీటర్లు, మినార్లు భూమినుంచి 48.7 మీటర్లకూ, ఎత్తుకు కట్టడం పై కప్పు నుంచి 24.4 మీటర్ల ఎత్తుకూ పైకి లేచి ఉన్నాయి. ఒక్కొక్క మినార్‌ను నాలుగు అంతస్తులుగా విభజించారు. ప్రతిమినార్ లోనూ చివరి అంతస్తు వరకు యెక్కడానికి 146 మెట్లున్నాయి. పై కప్పు మీద పశ్చిమ దిశలో మసీదు ఉంది. షియాలు పరమ పవిత్రంగా భావించే ఐదుగురు ఇస్లామ్ ప్రముఖులు ప్రవక్త మహమ్మద్. అలీ, ఫాతిమా, హసన్, హుస్సేన్‌కు ప్రాతినిధ్యం వహించేలా మసీదుకు ఐదు ఆర్చీలు కట్టారు. ప్రతి ఆర్చీని వంకీల ఆర్చిలో ఇమిడ్చారు. మొగలుల నిర్మాణ శైలి ప్రభావంతో యిలా చేశారని అంటారు. గోలుకొండ అప్పటికి ఇంకా స్వతంత్ర రాజ్యమే అయినప్పటికీ, ఒక్క భవన నిర్మాణంలోనే కాక, వస్త్రధారణ, ప్రవర్తన, ఆహార విషయాలలో మొగలుల ప్రభావం యిక్కడ వేగంగా వ్యాపించింది. అంతేకాక మొగలులకు, కుతుబ్ షాహీలకు యిరువురికి కూడా ప్రధాన స్ఫూర్తి పర్షియానే. మినార్‌లు కట్టడపు శోభను ఇనుమడింప జేశాయి. చూపరులకు వీలుగా ఎత్తును తక్కువగా చూపడం కోసం పై స్తంభాల మధ్య రెండు తెరల ప్రవేశ మార్గాలను ఏర్పరిచారు.

మసీదు ప్రాంగణంలోని విశాలమయిన సమావేశ మందిరంలో పై కప్పు గల 45 ప్రార్థనా స్థలాలున్నాయి. మసీదు ముందు భాగాన తగినంత ఖాళీ స్థలం ఉంది. చార్మినార్ రెండవ అంతస్తులో ఒక పాఠశాల ఉండేదని చెబుతారు.

అదే నిజమయితే ఇంత అనువు కాని చోట వున్న బడి ఆ రోజుల్లో బహుశ మరొకటి వుండేదికాదని చెప్పవచ్చు. అలాగే జల్లపల్లి చెరువునుంచి నీరు తొలుత చార్మినార్‌కు వచ్చి అక్కడినుంచి రాచనగరుకూ, నగరానికీ సరఫరా అయ్యేదని

పేర్కొన్నారు. కానీ నీటిని నిలువ చేయడానికి గానీ, సరఫర చేయడానికి గానీ చార్మినార్ భవనంలో ఏ కాలంలోనూ ఎలాంటి యేర్పాట్లూ వున్న సూచనలు లేవు. ఇంత విస్తృతమైన మహత్తరమయిన నగరాన్ని రూపొందించ గలిగిన ప్రణాళికా రచయితలు అద్భుత భవనాలను నిర్మించగలిగిన వాస్తు శిల్పులు 'ఇంతకంటే' మంచినీటి సరఫరా వ్యవస్థను నిర్మించ లేకపోయారా? ఒక శోభాయ మానమయిన వాస్తుశిల్ప కళాఖండంలో చిన్న పాఠశాలనూ మసీదునీ, నీటి సరఫరా వ్యవస్థనీ కలగలిపి కంగాళీగా చేశారనడం వాస్తవ దృష్టితో చూసినా, కళా దృష్టితో చూసినా పొసిగే విషయం కాదు. అయితే 'గాలరీల' వరకు నీటిని పంపేవారని తెవ్‌నాట్ పేర్కొన్నాడు. అలాగే చార్మినార్‌లో ఒక పాఠశాల ఉండేదని కూడా చాలామంది అంగీకరిస్తున్నారు. ఎస్.ఎ.ఎ. బిల్‌గ్రామి అంచనాల ప్రకారం చార్మినార్ నిర్మాణానికి ఆకాలంలోనే తొమ్మిది లక్షల రూపాయలు ఖర్చయ్యాయి. గోలుకొండను ఔరంగ జేబు జయించిన పిదప, బహదూర్ దిల్ ఖాన్ హైదరాబాదుకు సుబేదారుగా ఉన్న కాలంలో పిడుగుపడి ఒక మినారు తునా తునకలయి పోయింది. ఈ సంఘటన జరిగినప్పుడే నగరంలోని ఒక పెద్ద వ్యాపారి చనిపోయాడు. అతడికి వారసులు ఎవరూ లేనందున 125,000 రూపాయల ఆస్తి సుబేదారుకు సంక్రమించింది. ఒక కథనం ప్రకారం, సుబేదారు ఆ ఆస్తిలో అరవై వేల రూపాయలను మినార్ పునర్నిర్మాణానికి ఖర్చుచేసి మిగిలిన సంపదను పేదలకు పంచి పెట్టాడు. క్రీ.శ. 1824లో పూర్తి కట్టడానికి లక్షరూపాయల వ్యయంతో సున్నం మెత్తారు. 1886 లో చార్మినార్ చుట్టూ ఇనుప బద్దీలను అమర్చి ఉత్తరదిక్కున 'గేటు' పెట్టించారు.

చార్మినార్ నేటికి కూడా దేశంలోని అద్భుతమయిన కళాఖండాలలో ఒకటిగా విరాజిల్లుతోంది. నిర్మించినప్పటి నుంచి హైదరాబాదు నగరానికి ప్రతీకగా నిలుస్తోంది. నగర సందర్శకులకు ఒక తప్పనిసరి దర్శనీయ స్థలంగా ఉంది. చార్మినార్ చివరి అంతస్తు నుంచి పాతనగరాన్ని పూర్తిగా చూడవచ్చు. 1756లో ఫ్రెంచి కమాండర్ బుస్సీ సైనికులు చార్మినార్‌ను, దాని చుట్టు ప్రక్కల వున్న ఉద్యానవనాలను ఆక్రమించారు. క్రీ.శ. 1884లో 'అఫ్జల్ సిటీ పోలీస్ గార్డ్' ను చార్మినార్ రక్షణకై నియమించారు.

నిర్మాణం పూర్తయినప్పటి నుంచీ చార్మినార్ సోమరిపోతుల బాతాఖానీకి కేంద్రంగా కూడా సేవలందిస్తూ వుంది. నగరంలో వ్యాపించే వదంతులు చాలా వరకు చార్మినార్‌లో యిటువంటి పోకిరిరాయుళ్ళు జరిపే పనికిమాలిన సంభాషణలలోనే పుడుతుంటాయి. వాటిని 'చార్మినార్ కీ గప్ (చార్మినార్ వదంతులు)' అంటారు. చార్మినార్ చుట్టుప్రక్కల గల అనేక ఈరానీ హోటళ్ళు, చవుక రకం టీ దుకాణాలు కూడా ఇందుకు ఉపయోగపడుతున్నాయి.

చార్మినార్ నిర్మాణం పూర్తయినప్పుడు దానికి పెట్టిన పేరు 'యాహాఫీజ్' అంటే రక్షణ కొరకు దైవాన్ని వేడుకోవడం చార్మినార్ నిర్మాణం 1000 హిజ్రి, లేక క్రీ.శ. 1592లో పూర్తయింది.

## చార్‌కమాన్

చార్మినార్‌కు ఉత్తరంగా సుమారు 76 మీటర్ల దూరంలో ప్రస్తుతం 'చార్ కమాన్ ' (నాలుగు స్థూపాలు)గా వ్యవహరించ బడుతున్నదే ఆనాటి 'సెంట్రల్ ప్లాజా' (కేంద్రీయ విపణి) తొలుత దీనిని 'జింఖానా' లేక రక్షక కూడలి (గార్డ్)స్క్వేర్) అని పిలిచేవారు. దీని మధ్యలో దాదాపు ఎనభై సంవత్సరాల నాటి 'చార్‌సుకా హౌజ్' అనే ఫౌంటెన్ (జలయంత్రం) (నాలుగు దిక్కుల ఫౌంటెన్) ఉండేది. కేంద్రం నుంచి మొత్తం నాలుగు ముఖ్యమయిన దిక్కులలో సుమారు 114.3 మీటర్ల దూరంలో నాలుగు ఆర్చి ద్వారాలు ఉన్నాయి. ప్రతి ఆర్చి 18.3 మీటర్ల ఎత్తు 11 మీటర్ల వెడల్పు, వుంది. మందం 1.8 మీటర్లు. పశ్చిమ ప్రాకారం రాజ మందిరాల ప్రాంతానికి సింహ ద్వారం. దీనిని మొదట షేరె అలీ (అలీ సింహం) అని పిలిచేవారు. దీనికి 18.3 మీటర్ల ఎత్తు, 10 మీటర్ల వెడల్పుగల గేటు రక్షణగా ఉండేది. షేష్వామీర్ మునీమ్ ఈ గేటు పక్కన ఒక రాతి స్థూపాన్ని స్థాపించి రాజవంశీకుల మీద ప్రయోగించబడే మాయలు మంత్రాలు చేతబళ్ళూ మొదలైన వాటిని తిప్పి కొట్టేందుకు ఒకశిలా స్తంభం పైన కొన్ని ఖురాన్ వాక్యాలను చెక్కించాడని చెపుతారు. అందువలన ఈ ఆర్చికి కమాన్-ఎ-సెహార్-బాతిల్ (అబద్ధ మంత్ర విద్యల విరోధ ఆర్చి) అని పేరు వచ్చింది. షేర్ (పులి) సెహార్

**ఉద్యానవనాలు :** ఒకసారి మహమ్మద్ కులీ వేటలో చాలా అలిసి పోయాడు. బాగా దాహమయింది. ఆయన పరిచారకులు నీటికోసం నలుదిశలకు పరుగెత్తారు. ఒక చిన్నకొండ పక్కనే వున్న సరసొకటి వారి కంటపడింది. అదే నేటి సువిశాల జలాశయంహుస్సేన్‌సాగర్. సుల్తాన్‌ను ఆగుట్ట, ఆదృశ్యం ఆకర్షించాయి. వెంటనే అక్కడ ఒక మండప నిర్మాణానికి ఆదేశించాడు. ఆ గుట్టకు 'నౌబత్‌ఘాట్' లేక ఉద్యానవనపు గుట్ట అని పేరు పెట్టాడు. ఇప్పుడు దీనినే నౌబత్ పహాడ్ అని పిలుస్తున్నారు. ఆ తరువాత ఆసఫ్ జాహీల కాలంలో నగారా (నౌబత్) మోగించి ముఖ్యమైన ప్రకటనలు చేయడానికి ఈ కొండను ఉపయోగించడం వల్ల దానికి నౌబత్ పహాడ్ అనే పేరు వచ్చింది. నగరంలోని ఉద్యానవన విభాగాన్ని ఆ తరువాత కుడివైపుగా నది వరకు విస్తరించారు. క్రమంగా బషీర్ బాగ్, పబ్లిక్ గార్డెన్స్, ఫతేమైదాన్, రెసిడెన్సీ ఇందులో కలిసిపోయాయి. ఈ మొత్తం విస్తీర్ణం సుమారు ఇరవైమూడు చదరపు కిలోమీటర్లు. ఆ విధంగా నగర ప్రవేశం ఉద్యానవనాల ద్వారా జరిగేది. 18వ శతాబ్దంలో ఔరంగజేబు సైన్యం విడిది చేసిన ప్రాంతం ఫతేమైదాన్ విజయానికి గుర్తుగా ఈ ప్రాంతానికి ఔరంగజేబు ఆ పేరు పెట్టాడు. గత ముప్పయి సంవత్సరాలలోనే, ఈ రచయిత కళ్ళముందు యింకా కదులుతున్న జ్ఞాపకాల పరిధిలోనే, బషీర్‌బాగ్ ప్యాలేస్‌లో ఒక ప్రభుత్వ శాఖ కార్యాలయం యేర్పడిన సంఘటన జరిగింది. ఆ తరువాత ఆ రాజ ప్రాసాదాన్ని కూల్చివేసి పలు అంతస్తుల భవనసముదాయాలు నిర్మించారు. బహిరంగ సభలు, సైనిక కవాతులు, క్రికెట్ మ్యాచ్‌లు నిర్వహించడానికి వీలుగా ఫతెమైదాన్ ప్రాంతాన్ని స్టేడియమ్‌గా మార్చి చుట్టూ గోడలు కట్టారు. ప్రస్తుతం బహిరంగ సమావేశాలకు హైదారాబాదులో ఎక్కడా అనువయిన మైదానం లేదు. నానాటికీ కుంచించుకు పోతున్న నిజామ్ కాలేజి మైదానాన్నే అందుకు ఉపయోగిస్తున్నారు.

చార్మినార్‌కు దక్షిణాన కూడా ఇటువంటి మండపాన్నే ఒకదానిని నిర్మించారు. అక్కడవున్న కోహ్-ఎ-తూర్ కొండ మీంచి దృశ్యం మనోహరంగా వుండేది. వాతావరణం ఎంతో ఆరోగ్యప్రదంగా వుండేది. అక్కడ ఒక చిన్న

జలాశయం కూడ వుండేది. ఇది చార్మినార్‌కు కేవలం మూడు కిలోమీటర్ల దూరంలో వుంది. తరువాత 'ఫలక్‌నుమా ప్యాలేస్' నిర్మాణం జరిగింది అక్కడే. ఈ విధంగా నౌబత్‌ఘాట్ నుంచి కోహ్-ఎ-తూర్ వరకు ఆకుపచ్చని తివాచీ పరచినట్టుండేది. ఇప్పుడు ఆ పచ్చదనం మచ్చుకి కూడా కానరాదు. కొద్దోగొప్పో మిగిలి ఉన్న దానిని కాంక్రీటు కట్టడాలు కబళించి వేస్తున్నాయి. ఈ విధంగా మహమ్మద్ కులీ ఒక సుందర ఉద్యానవన నగరాన్ని నిర్మించాడు. ఇప్పటికి కూడా కొన్ని ప్రాంతాల పేర్లలో-అక్కడ కనీసం గడ్డిపరకయినా కానరాకపోయినా-పేరుకువెనుకనో, ముందో 'బాగ్ '(తోట) అనే పదం ఉంటోంది. ఆనాటి ఉద్యానవనాల సాంప్రదాయం నేడు కేవలం పేర్లలో కొనసాగుతోంది.

ఈ విధమయిన ఉద్యానవనాల విస్తరణ నగరంలో అన్ని దిశలలోనూ జరిగింది. నగరం చుట్టూ ఉద్యానవనాలు వుండడమే కాక, నగరంలోపల ప్రతి ప్రాంతంలో ఒక ఉద్యానవనం, ప్రతి భవన ప్రాంగణంలోనూ ఒక తోట కళకళలాడేవి. ఈ నూతన నగర ఉద్యాననగర కళనూ, వైభవాన్నీ సమకాలిక విదేశీ పర్యాటకులు, ఆ తరువాత కాలాలలోని చరిత్రకారులు ఎంతో శ్లాఘించారు. రఫీ ఉద్దీన్ సిరాజి క్రీ.శ. 1608లో రాసిన 'తజ్‌కురాతల్ ముల్క్' లో అద్భుతమైన తోటలుగల అనేక సుందర భవనాలతో నూతన నగరం అలరారుతోంది. ఈ తోటలలోని కొన్ని చెట్లు ఆకాశాన్ని అందుకునేంత ఎత్తుగా ఎదిగాయి. వీధులు, ఇళ్ళు, సమస్తం చెట్లతో నిండిపోయి మొత్తం నగరమే ఒక ఉద్యానవనంలా కనిపిస్తోంది. కుర్‌సాన్, పోర్చుగల్ తదితర ప్రాంతాల ఫలాలను తలదన్నే స్థాయిలో వివిధరకాల పళ్ళు నూతన నగరంలో సమృద్ధిగా పండుతున్నాయి అని పేర్కొన్నాడు.

క్రీ.శ. 1665-66లో హైదరాబాద్ నగరాన్ని సందర్శించిన తేవ్‌నాట్ నగరం చుట్టూ, నగరంలోపల విస్తృతంగా ఉన్న ఉద్యానవనాల గురించి రాశాడు. "ఇక్కడ ఇళ్ళ పైకప్పుల మీద కూడా చెట్లున్నాయి. అక్కడ అవి ఎలా పెరుగుతున్నాయో" అని ఆశ్చర్యపోయాడు.

ఆయన మాటలలో నగరంలో అనేక సుందర ఉద్యానవనాలున్నాయి. సుదీర్ఘ వన మార్గాలను పరిశుభ్రంగా ఉంచడంలో, అద్భుతమైన ఫల వృక్షాలలో ఈ తోటల అందం యిమిడి వుంది. ఈ ఉద్యాన వనాలకు (పెద్ద యెత్తున) నీటి సరఫరా యేర్పాట్లు కనపడవు. అనేక పీపాలతో నీరు పోసి సరిపెడుతున్నారు. నగరం వెలుపలి ఉద్యానవనాలు అత్యంత సుందరంగా వున్నాయి. అటువంటి ఒక తోటను మాత్రమే వర్ణిస్తాను. ఈ రాజ్యంలోని అత్యంత ఆహ్లాదకరమయిన ఉద్యానవనం అది. ముందుగా మనం 'ప్రథమ ఉద్యాన వనం' అని పిలువబడే మహా సుందర ప్రాంతంలో ప్రవేశిస్తాం. ఇక్కడ ఒకదాని ప్రక్కన ఒకటిగా ఈత చెట్లు, కొబ్బరి చెట్లు, పోక చెట్లు దర్శనమిస్తాయి. ఇవి సూర్యకాంతి చొరబడలేనంత దగ్గర దగ్గరగా ఉన్నాయి. ఉద్యానవనంలోని కాలిబాటలు తిన్నగా, పరిశుభ్రంగా, ఇరువైపులా తెల్లటి పూల, మొక్కల వరుసలతో అందంగా ఉంటాయి. ఈ పూలను 'ఘోల్ దావుదీ' (డేవిడ్ పూలు) అంటారు. కెమోమైల్ (చామంతి లాంటి పువ్వు) పువ్వుల వంటివే; ఈ వనంలో వేరే పూలతో పాటు పుష్పసంతతికి చెందిన భారతీయ బంతి పువ్వులు కూడా ఉన్నాయి. ఈ పూలతోట చివర ఒక నివాస భవనం వుంది. ప్రధాన భవన భాగానికి అటు యిటు రెక్కల్లో రెండు విభాగాలున్నాయి. ఇది రెండంతస్తుల భవనం. మొదటి అంతస్తులో మూడు విశాలమైన మండువాలు. వీటిలో మధ్య మండువా విశేషమైనది. భవనం ప్రధాన భాగంలోను, అనుబంధ భాగాలలోను ఒక్కొక్క ద్వారం చొప్పున మొత్తం మూడు ద్వారాలు ఉన్నాయి. మూడు కిటికీలు ఉన్నాయి. పెద్ద హాలుకు మాత్రం ఇతర ద్వారాల కంటే ప్రత్యేకంగా, రెండు యెత్తయిన ద్వారాలు అదనంగా ఉన్నాయి. ఇవి 'దివాన్' (సమావేశ మందిరం) లోనికి తెరుచుకుంటాయి. ఈ దివాన్‌హాలు రెండు వరుసలలో వున్న ఎనిమిది బలమైన స్తంభాల పైన నిలిచి వుంది. మధ్యహాలునూ, దివాన్ హాలునూ దాటి వచ్చి రెండు మెట్లు కిందికి దిగితే మరో దివాన్ లోకి ప్రవేశిస్తాము ఇది కూడా మొదటి దివానే పోలి ఉంటుంది కాని దానికంటే పొడవయినది. దీనికి కూడా మొదటి దాని వలనే రెండు వైపులా రెండుగదులు, తలుపులు, కిటికీలు ఉన్నాయి. భవనం రెండవ

అంతస్తు కూడా మొదటి అంతస్తునే పోలి వుంటుంది. కాని, ఇందులో ఒకే దివాన్, మీదికి కూడా విస్తరించి వుంది. ఈ పై కప్పుకు ఆధారంగా భారీ పరిమాణంలో ఉన్న ఆరు కొయ్య స్తంభాలున్నాయి. అష్టభుజాకారంలో ఉన్న ఈ కొయ్య దిమ్మలు ఒక్కొటి ఆరు లేక ఏడు బారల పొడవుంటాయి.

క్రింది దివాన్ నుంచి మొదలయి, రెండు వందల అడుగుల పొడవు యాభైఅడుగుల వెడల్పుతో కప్పు పై భాగాన నడిచేందుకు ఒక తోవ వుంది. ఇది ఇంటి ముందు భాగాన్నంతా చుడుతోంది. ఈ దారికి యిరువైపులా చిన్న చెట్ల గుబుర్లున్నాయి. ఈ పాద మార్గాన్ని రాళ్ళలో పొదిగారు. ఇది, ప్రధమవనాని కంటే పెద్దదయిన రెండవ ఉద్యానవనానికి ముందుభాగాన వుంది. దాదాపు ఒకటిన్నర బారల ఎత్తు ఉంది. అటు దిగడానికి అందమైన మెట్లు ఉన్నాయి. ఇక్కడ ముందుగా చూడవలసింది (ఎదురుగా) ఇక్కడున్నగొప్ప జలాశయం. దీని ఒక్కొ పార్శ్వం పొడుగు రెండు వందల అడుగులకు పైబడి ఉంది. జలాశయం నీటికి ఒక అడుగుపైన అనేక పైపులు ఉన్నాయి. నీటి మట్టానికి ఒక అడుగు ఎత్తులో ఆరుఅడుగుల వెడల్పు గల వంతెనా, దానికి కొయ్యతో చేసిన కంచె చట్రాలు ఉన్నాయి. ఆ వంతెన పొడవు ఎనభై అడుగులు ఈ వంతెన జలాశయం మధ్యలో వున్న ఒక అష్టభుజ వేదికకు దారి తీస్తుంది. ఆ వేదిక నుంచి నీటిలోకి దిగడానికి మెట్లున్నాయి.ఈ వేదికకు ఉన్నఎనిమిది కోణాలలోనూ, వంతెన కమ్మీల తాలూకు స్తంభాలలోనూ నీటి పైపులున్నాయి. వాటిలో నుంచి నీరు అన్ని దిక్కులకు విరజిమ్ముతోన్న ఆ దృశ్యం ముగ్ధ మనోహరంగా ఉంటుంది. వేదికమధ్యలో రెండంతస్తులచిన్నయిల్లు ఉంది. అది కూడా అష్టభుజాకృతిలోనే నిర్మితమై వుంది. ప్రతి అంతస్తులోనూ ఎనిమిది ద్వారాలు గల ఒక చిన్నగది వుంది. రెండవ అంతస్తు చుట్టూ నడవడానికి వీలుగా 'బాల్కనీ' ఉంది. ఈ ఇంటి పైకప్పు చదునుగావుంది. నలువైపులారక్షణకు పిట్టగోడల వంటివి వున్నాయి. ఈ కప్పు వేదికను పూర్తిగా చుడుతోంది. ఈ పై కప్పు పదహారు కొయ్య దూలాల పైన నిలబడి ఉంది. ఒక్కొ దూలం మనిషి శరీరం పరిమాణంలో, దాదాపు మూడు బారల ఎత్తు ఉన్నాయి.

ఈ దూలాలు ప్రతి మూలనా రెండేసి చొప్పున ఒకటి గోడకు ఆన్చి, రెండవది ఇంటి చుట్టూ వున్న కంచె దిమ్మలకు పూన్చీ వున్నాయి.

ఈ జలాశయం గల ఉద్యానవనం పుష్ప, ఫల వృక్షాలతో కళకళలాడుతూ వుంది. అన్నీ చక్కగా క్రమ పద్ధతిలో వున్నాయి. ఈ ఉద్యాన వనంలోనూ, ప్రధమ ఉద్యానవనంలోనూ చక్కని కంకర రోడ్లు ఉన్నాయి. ఈ మార్గాలకి ఇరువైపులా పలు రకాల పూలు శోభిస్తున్నాయి. ప్రధాన మార్గం మధ్యన ఒక కాలువ ప్రవహిస్తూ వుంది. ఈ మార్గ మధ్యంలో నిర్దిష్టదూరంలో యేర్పరిచిన జలయంత్రాల నుంచి వచ్చే నీటిని తీసుకు పోతోంది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ ఉద్యానవనం చాలా విశాలమయినది. దీని చుట్టూ ఒకగోడ, ఆ గోడకి ఒక పెద్ద ద్వారం - ఆ ద్వారం ఫల పుష్ప సంపదలతో విరాజిల్లే ఒక సువిశాల లోకంలోకి తెరుచుకుంటుంది.

**బాద్ షాహి ఆషుర్ ఖానా :** చార్మినార్ తరువాత నిర్మించిన, మతపరమైన తొలి భవనం ఆషుర్ ఖానా కర్బలా మైదానంలో ప్రవక్త మనుమడు హుస్సేన్ ధరించిన ఆయుధ పతాకం ప్రతిరూపాలు వుంచడానికి ఈ మత భవనాన్ని 1596లో నిర్మించారు. మొహరం మాసంలోని మొదటి పదిరోజులూ రోజుకు వెయ్యి దీపాల చొప్పున మహమ్మద్ కులీ అక్కడ వెలిగించే వాడు. చివరి రోజున పదివేల దీపాలతో ఈ ప్రాంగణమంతా మిరుమిట్లు గొలిపేది మొహర్రం సందర్భంగా ఆయన స్వయంగా స్మృతి గీతాలను కూర్చి శోక సమావేశాలకు సారధ్యం వహించేవాడు. ఆ కాలంలో ఆయన మద్యపానానికి, విలాస మయ భోగ జీవితానికీ దూరంగా వుండే వాడు. శోక సూచకమయిన నల్ల వస్త్రాలు ధరించేవాడు. ఇప్పటికీ పవిత్ర ప్రతిరూపాలు ( ఆలమ్‌లు) ఉన్న ఇతర ఆషుర్‌ఖానాలలో మొహరం సందర్భంగా శోక సమావేశాలు జరుగుతున్నట్లే ఈ ఆషుర్ ఖానాలో కూడా జరుగుతున్నాయి.

ఆషుర్ ఖానాలో గోడలలో పొదిగిన ఎనామిల్ పెంకుల మీద పర్షియన్ భాషలో, శైలిలో రాసిన అనేక శాసనాలున్నాయి. ఒక లేఖనంలో మహమ్మద్ కులీని అలీ బానిసగా పేర్కొన్నారు. ఈ పెంకులను అత్యంత కళాత్మకంగా రూపొందించి

ఎంతో నైపుణ్యంతో పేర్చారు. అవి ఈనాటికీ ఆనాటి కళతో వెలిగి పోతున్నాయి. భవనం గురించి మహమ్మద్ కులీ వారసులు, ఆ తదనంతరం వచ్చిన ఆసఫ్‌జాహి పాలకులు కూడా శ్రద్ధ వహించారు. ఈ ఆఘర్ ఖానా నిర్వహణకు రెండవ ఆసఫ్ జాహి 12 వేల రూపాయల ఆదాయం లభించే ఒక జాగీర్ ఏర్పాటు చేశాడు. ప్రస్తుతం ఈ భవనానికి వెళ్ళే దారి ఇంతగొప్ప కళా నిలయానికి కొని పోయే దారిలా లేదు. ఈ కట్టడానికి ఉన్న విశాల ప్రాంగణం యిప్పుడు ఇనుప తుక్కు వేలం వేయడానికి ఉపయోగ పడుతోంది!

**జామా మసీదు :** చార్మినార్ లోని రెండవ అంతస్తులో ఉన్న మసీదు తర్వాత ఈ నూతన నగరంలో నిర్మించిన ఈ రెండవ మసీదులో ఒకే సమయంలో ఏడెనిమిది వందల మంది ప్రార్థన చేసుకోడానికి తగిన వసతి ఉంది. ఎదుటి నుంచి కాక ప్రక్కనుంచి ప్రధాన ద్వారం ఉండటం ఈ మసీదు ప్రత్యేకత. బహుశ, చార్మినార్ నుంచి ఉత్తరదిశగా వెళ్ళే ప్రధాన మార్గం వైపు మసీదు ప్రధాన ద్వారం వుండాలని భావించి ఇలా నిర్మించి వుంటారు. ఒక పక్క మహోన్నతమయిన చార్మినార్, మరో ప్రక్క చార్‌కమాన్ ప్లాజా, దక్షిణ ఆర్చిల పక్కన ఈ మసీదు మరీ చిన్నగా కుదించుకు పోయినట్లు కనబడుతుంది. చార్‌మినార్ జామా మసీదుల మధ్యగల లక్ష్య పరమయిన వ్యత్యాసాన్ని కూడ ఈ మసీదుని చూసి గుర్తించవచ్చు. జామా మసీదు ప్రవేశ ద్వారాన్ని ప్రస్తుతం కొందరు పుస్తకవిక్రేతలు ఆక్రమించి మూసివేశారు. కాబట్టి మసీదులోకి ఇప్పుడు ప్రధాన ద్వారం నుంచి కాక ప్రక్కన ఉన్న మరో ద్వారంలోంచి వెళ్ళవలసి వస్తోంది. ఇలా అక్రమంగా వెలిసిన ఒక దుకాణం బోర్డు ప్రధాన ప్రవేశ ద్వారం పైన వున్న చారిత్రక శాసనాన్ని పూర్తిగా కప్పివేసింది. ప్రారంభంలో ఈ మసీదుకు అనుబంధంగా ఒక పాఠశాల, ఒక ఆరామం, ఓ స్నానశాల వుండేవి. కాల క్రమేణా అవి శిథిలమై పోయాయి. ఈ కట్టడం నిర్మాణ కాలాన్ని సూచించే ఒక వాక్యం వుంది. ఆ వాక్యం అనువదిస్తే అది "మహోన్నతమైన ప్రయోజనదాయకమైన ఈ భవనం ఎంత అద్భుతంగా ఉందో!" ఎస్.ఎ.వి. బిల్‌గ్రామి అభిప్రాయం ప్రకారం నగరంలో పవిత్ర ఖురాను కంఠస్థం చేసే సంప్రదాయం ఈ

మసీదులోనే ప్రారంభమయింది. షారఫీ ఉద్దీన్ ఖలీషా హఫీజ్ ఖాజి మిర్ షుజాఉద్దీన్, బుర్ హాన్ ఫ్వూర్ నుంచి వచ్చి ఈ మసీదులో మకాం చేసిన తరువాత ఖురాన్ కంఠస్థ సంప్రదాయం మొదలయింది. ఆయన ఈ మసీదులోనే విద్యార్థులకు అరబ్బీ పాఠాలు బోధించడం ప్రారంభించాడు.

## దారుష్షిఫా

వీటి తరువాత చెప్పుకోదగిన ప్రధాన ప్రభుత్వభవనం, ఏకైక లౌకిక నిర్మాణం క్రీ.శ. 1595లో నిర్మించిన దారుష్షిఫా (ప్రభుత్వ ఆసుపత్రి) ఈ రెండంతస్తుల భవనం ఆక్రమించిన భూమి విస్తీర్ణం 2,326 చదరపు మీటర్లు. దీనిలో మూడు విభాగాలలోనూ ప్రతి అంతస్తులో 12 'డబుల్ రూములు' ఉన్నాయి. అయితే ప్రవేశ ద్వారం వైపున మాత్రం ప్రతి అంతస్తులో ఎనిమిది గదులే ఉన్నాయి. ప్రతి అంతస్తులోనూ మూడు దిక్కులలో కనిపించే ఆర్చీలు పదకొండున్నాయి. పైకి వెళ్ళే మెట్ల మీద నేడు ఆక్రమణ దారులు బైఠాయించి వున్నందున రెండవ అంతస్తులో ఎన్ని గదులున్నదీ పరిశీలించే అవకాశం లేదు. మధ్యలో ఆ తరువాత చాలా కాలానికి నిర్మించిన మరో భవనం వుంది. ఇందులో పవిత్ర 'ఆలమ్'లను ఉంచుతారు కానీ నిర్మాణ శైలి పరంగా ఈ భవనం దారుష్షిఫా కాలానికి చెందినది కాదు.

దారుష్షిఫా భవనంలో ఆనాడు ఒక వైద్య కళాశాల, యునాని ఆసుపత్రి వుండేవి. ఈ కళాశాలలో చదివే విద్యార్థులకు ఉపకార వేతనాలు ఇచ్చేవారు. చదువు పూర్తయిన తరువాత ఉద్యోగం లభించగలదన్న హామీ కూడా వుండేది. ఆసుపత్రి మూసీనది తీరాన వుండటం వలన పరిశుభ్రమైన గాలి లభించేది. ఈ నిర్మల వాతావరణం చికిత్సకు తోడ్పడేది. రోగులు తొందరగా కోలుకోవడానికి దోహదం చేసేది. ఈ ఆసుపత్రికి అనుబంధంగా ఒక టర్కిష్ స్నానఘట్టం ఉండేది. అది యిప్పుడు లేదు. ఒక మసీదు మాత్రం చెక్కుచెదరక నేటికీ నిలిచి ఉంది. సత్రం మురికివాడగా మారిపోయింది. దారుష్షిఫా ఆసుపత్రి పేరుతో అనేక మంది ప్రముఖ వైద్యుల, శస్త్ర వైద్యుల పేర్లు ముడిపడి వున్నాయి.

పందొమ్మిదవ శతాబ్దంలో నిజామ్ తాత్కాలిక సైనికుల విడిదిగా ఈ భవనాన్ని ఉపయోగించారు. ప్రస్తుతం భవనంలో అధిక భాగం ఆక్రమణదారుల పరమయింది దారుష్షిఫా ఇప్పటికీ తన 'ఉనికి'ని కాపాడు కుంటూ వున్నదనే చెప్పాలి

**మహమ్మద్ కులీ సమాధి మందిరం :** ఒక భవన నిర్మాతగా మహమ్మద్ కులీ నిర్మించిన అద్భుత భవనాల జాబితాలో మహమ్మద్ కులీ సమాధి మందిరాన్ని కూడా చేర్చడం విచిత్రంగా కనిపించవచ్చు. తమ జీవిత కాలంలోనే తమ సమాధులను నిర్మించడం మధ్యయుగాల చక్రవర్తులలో కనిపించే ఒక మంచి సంప్రదాయం. ఆ కాలంలోని వైభవాలనూ, అనిశ్చితమయిన అధికార ప్రవృత్తినీ ఈ సంప్రదాయం ప్రతిబింబిస్తుంది. "వైభవోపేతమయిన దారులు సమాధుల వద్దకే వెళతాయి" అన్న నానుడిని కూడా ఈ సంప్రదాయం నిరూపిస్తుంది. తరువాతి తరాలలో అధికారాసనాన్ని అధిష్టించిన వారు ఈ సమాధులను బట్టే పూర్వ చక్రవర్తుల ఘనతను అంచనా వేసే వారు.

చనిపోయిన తరువాత కూడా ఒక ప్రాంగణంలో కలిసి ఉన్న రాజవంశం బహుశా ఒక్క కుతుబ్ షాహీలదే కావచ్చు. కుతుబ్‌షాహీ రాజవంశంలో ఆఖరి చక్రవర్తి తానాషా మాత్రమే తాను జీవించి ఉన్న కాలంలో తన సమాధిని నిర్మించుకోలేదు. తానాషా ఔరంగజేబు నిర్బంధంలో 14 సంవత్సరాలు వుండి ఆ తరువాత ఔరంగాబాద్‌లో మరణించాడు. కుతుబ్‌షాహీ సమాధులలో మహమ్మద్ కులీ సమాధి, ఇతర చక్రవర్తుల, రాజ వంశీకుల సమాధుల కన్నా విశిష్టంగా, ప్రత్యేకంగా వుంటుంది. జీవితంలో వలెనే మరణంలో కూడా ఆయన తన ప్రత్యేకత నిలుపుకున్నాడు.

మహమ్మద్ కులీది రెండు పైకప్పులతో కూడిన పెద్ద సమాధి. ఖననం జరిగిన ప్రధాన వేదిక భూమికి 5.5 మీటర్ల ఎత్తులో నిర్మించారు. క్రింది పైకప్పు వైశాల్యం 38.5 చదరపు మీటర్లు. దీనిపైన ఉన్న రెండవ కప్పు వైశాల్యం 6.7 చదరపు మీటర్లు. సమాధి మీద నిర్మించినగోపురం భూమి నుంచి 37.6 మీటర్ల

ఎత్తు వుంది. గోపురం వెలుపలి చుట్టుకొలత 21.7 మీటర్లు. సమాధి చుట్టూ సమాన దూరంలో ఆర్చిరూపం స్తంభాలు అమర్చి వున్నాయి. ఆగ్నేయ దిశలో వున్న మెట్ల ద్వారా సుల్తాన్ ఖననం చేయబడిన స్థలానికి చేరవచ్చు. దీనికి అలంకారంగా, ఈశాన్య దిశగా నిర్మించిన ఒక ద్వారంగోపురం వరకు దారి తీస్తుంది. సమాధిలోకి నాలుగు వైపుల నుంచి ప్రవేశించే వీలుంది. సమాధికి తూర్పున ఉన్న ప్రవేశ ద్వారం వద్ద కళాత్మకమైన అల్లిక పనితనంతో అలరారుతున్న అడ్డతెర. ఇందులోంచి ఉదయ సూర్య కిరణాలు సమాధి పైకి ప్రసరిస్తూ వుంటాయి. సుల్తాన్ తాను నిర్మించిన అద్భుత కళాఖండాన్ని, తన శాశ్వత విశ్రాంతి మందిరం నుంచి చూసుకోడానికా అన్నట్టు, పై కప్పునుంచి చూస్తే చార్మినార్ స్పష్టంగా కనిపిస్తూ వుంటుంది.

మెరుగు పెట్టిన నల్ల పింగాణీ తో నిర్మించిన ఈ సమాధి పైన షియాల విశ్వాసాలను, ఖురాన్ వాక్యాలను ప్రఖ్యాత 'తక్వీ' శైలిలో చెక్కారు. సుల్తాన్ మరణించిన తేదీ, ఆయన పాలనా కాలం, చనిపోయినప్పుడు ఆయన వయసు వంటి వివరాలను పర్షియన్ లిపిలో నస్ఖ్ శైలిలో రాశారు.

మహమ్మద్ కులీ నిర్మించిన భవనాల జాబితాకు అంతులేదు. ఆయన సాక్షత్తూ ఒక నగరాన్నే నిర్మించాడు. నగరం అంటే కేవలం భవనాలు మాత్రమే కాదు. నగరం అంటే ప్రధానంగా ప్రజలు. నగరంలో నివసించే ప్రజలు. అక్కడే పుట్టి అక్కడే పెరిగి, అందులోనే జీవన పరిపూర్ణతను అన్వేషించుకునే ప్రజలు. అరిస్టాటిల్ మాటల్లో చెప్పాలంటే, మనిషి జీవనాన్ని సాధ్యం చేయడానికే నగరం ఉనికిలోకి వస్తుంది. మానవ మనుగడను మెరుగుపరచడానికి నగరం మనుగడ కొనసాగుతుంది. నగర నిర్మాణం యేనాటికీ పరిపూర్తికాదు. నగరం సదా పెరుగుతూనే వుంటుంది. నిరంతరం పరిణామం చెందుతూనే వుంటుంది. హైదరాబాద్ నగరం కూడా అంతే. అయితే నగరానికి ఒక లాంఛన ప్రాయమైన ప్రారంభం వుంది. ఇక నగరం పుట్టుక. ఇది క్రీ.శ. 1596లో జరిగినట్టు తెలుస్తోంది. రాజు, ఆయన పరివారం, బంధుజన- ప్రజలు నూతన నగరం 'భాగ్‌నగర్' లోకి



హైదరాబాద్ నగరంలోని మహమ్మద్ కులీకుతుబ్‌షా సమాధి



హైదరాబాద్ నగరంలోని మహమ్మద్ కులీకుతుబ్‌షా సమాధి

రూపొందించే బాధ్యత అబూతాలిబ్‌కీ ఖుదాదాద్ మహల్, దాద్ మహల్, కీహి-ఎ-తీర్ మహల్‌ల బాధ్యత షెహరియర్ జవాన్‌కీ అప్పగించినట్లు తెలుస్తోంది. నిర్మాణం పూర్తి అయిన పిదప మీర్ అబూ తాలిబ్‌కు నజరుల్ ముల్క్ బిరుదు ప్రదానం చేశారు. ఆ కాలంలో తూర్పు దేశాలకు స్ఫూర్తి దాయకంగా ఉన్న ఇరాన్ నగర నిర్మాణ పద్ధతుల ఆధారంగా నూతన నగర ప్రణాళికను రూపొందించారు. మహమ్మద్ కులీ వారసుడు మహమ్మద్ కుతుబ్‌షాని ఉద్దేశించి మీర్ మూమిన్ రాసిన ఒక పార్శీ పద్యంలో "మహారాజు అబ్బాస్ వల్ల ఇస్పహన్ నగరం నూతనత్వాన్ని సంతరించుకుంటే, మీ వల్ల హైదరాబాద్ నగరం కొత్త ఇస్పహాన్ నగరం వలె భాసించడం మొదలు పెట్టింది" అని ప్రశంసించాడు. ఆగ్రా, లాహోర్ వంటి మొగలాయిల మహానగరాలు సందర్శించిన చరిత్రకారుడు, ఫరిష్తా (1570-1623) "దేశం మొత్తంలో హైదరాబాద్ అంతటి ఆకర్షణీయమయిన, అద్భుతమయిన నగరం మరొకటి లేదు" అని పేర్కొన్నాడు. అలాగే 17వ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించిన యూరప్ యాత్రికులు ఈ నగరాన్ని గురించి చెప్పిన గాథలు అనేకం వున్నాయి. వారిలో ఇటలీకి చెందిన మనూచ్చి (Menucci), డచ్‌దేశస్థుడు స్కారర్ (Schoerer), బ్రిటిష్ యాత్రికుడు మెత్‌హోల్ట్ ఫ్రెంచి యాత్రికులు టావెర్నర్, తేవ్‌నాట్, బెర్నియర్ ముఖ్యులు. ఈ విధంగా ఈ నూతన నగరాన్ని గురించి, నగర ప్రజల జీవితం గురించి విస్తృతమయిన సమాచారం అందుబాటులో ఉంది.

హైదరాబాదు నగరాన్ని క్రీ.శ. 1648లోనూ, తిరిగి 1652లోనూ సందర్శించిన టావెర్నర్, 1665-66లలో హైదరాబాదు సందర్శించిన తేవ్‌నాట్‌ల నగర వర్ణనలు యథాతథంగా ఇక్కడ ఇవ్వడం సముచితం. ఆ కాలంలో, ఆ గాలిని పీల్చి, ఆనాటి ప్రజలతో కలిసి తిని, తాగిన పరిశీలకుల, కత్తిరింపులకు లోను కాని ప్రత్యక్ష కథనాల కంటే సమర్థవంతంగా ఆ కాలాన్ని, ఆ నగరాన్ని, రుచిని మన కళ్ళకు కట్టగల సాధనం మరొకటి లేదు. హైదరాబాద్‌కు చెందిన సమకాలీన భౌగోళికశాస్త్రవేత్త ప్రొఫెసర్ మన్సూర్ ఆలమ్ నగరం అభివృద్ధి ఆరు అంచెలుగా జరిగిందని పేర్కొన్నారు. అది ఈ దశలలోని తొలిదశ. తూర్పు దేశాలను ఆరుసార్లు సందర్శించిన వజ్రాల వ్యాపారి టావెర్నర్ (1605-1688) ఇలా రాశాడు.

"రాజ్యం రాజధాని పేరు భాగ్యనగరం కానీ, నగరానికి కేవలం రెండు కోసుల దూరంలో ఉన్న గోలుకొండ కోట పేరున 'గోలుకొండ' అని పిలుస్తారు. ఈ కోట రాజు నివాసం. కోట వృత్తాకారంలో రెండు లీగుల (ఆరుమైళ్ళు) వైశాల్యంతో వుంది. లోపల, వెలుపల రక్షణకు పెద్ద సైన్యం వుంది. నిజానికిది రాజు తన ఖజానాను భద్రపరచుకునే పట్టణం. ఔరంగజేబు పంపిన సైన్యం దాడి తరువాత రాజు భాగ్యనగర్ లోని తన నివాసాన్ని వదలి ఇక్కడకు ఖజానాను తరలించాడు. ఈ వివరాలను ముందు ముందు రాస్తాను. అప్పట్లో భాగ్యనగరాన్ని సాధారణంగా గోలుకొండ అని పిలిచే వారు. ఈ నగరాన్ని ప్రస్తుత పాలకుడి ముత్తాత, తాను ఎంతో ప్రేమించిన భార్య కోరికమేరకు నిర్మించాడు. ఆమె పేరు నగర్ గతంలో చక్కని ఉద్యాన వనాలతో ఇది కేవలం రాజుగారి విలాసాల విడిదిగా వుండేది. ఈ స్థలంలో ఒక రాజభవనాన్నీ, ఒక నగరాన్నీ నిర్మించమని ప్రక్కనే నది ప్రవహిస్తుండటం వల్ల ఇది ఎంతో అనువైన ప్రదేశమనీ ఆయన భార్య తరచూ సూచిస్తూ వుండేది. ఈ ప్రేరణతో రాజు నగర నిర్మాణానికి పూనుకొని, ఆ నగరానికి తన భార్య పేరున బాగ్‌నగర్ 'నగర్ తోట' అని పేరు పెట్టాడు. ఈ నగరం $16^{0}58''$ అక్షాంశం పైన ఉంది నగరానికి పొరుగున వున్నదంతా మైదాన ప్రాంతం. నగరం సమీపంలో అనేక కొండలు, గుట్టలు కనిపిస్తాయి. ఆగ్నేయపుటంచున పెద్దనది ప్రవహిస్తోంది ఇది మచిలీపట్నం సమీపంలో బంగాళాఖాతంలో కలుస్తుంది. పారిస్‌లోని పాంట్ న్యూయిఫీ వంతెనకు ఏ మాత్రం తీసిపోని ఓ రాతివంతెన మీదుగా ఈ నదిని భాగ్యనగరం వద్ద దాటవలసి వుంటుంది.

*1 భాగ్యనగరం లేదా సౌభాగ్యనగరానికి కుతుబ్‌షా మహమ్మద్ కులీ తన ప్రియ సఖి పేరున ఆ పేరు పెట్టాడు. ఆమె పేరు భాగ్‌మతి, టావెర్నర్ పేర్కొన్నట్లు 'నగర్' కాదు. 'నగర్' అంటే కేవలం పట్టణం అన్న అర్థం వస్తుంది. మూసీనది ఒడ్డున నిర్మించిన ఈ నగరం, నదికి ఏడు మైళ్ళ దూరంలో వున్న గోలుకొండ స్థానంలో ప్రభుత్వ కేంద్రస్థానమయింది. తేవ్‌నాట్ ప్రకారం పర్షియన్లు అప్పుడు కూడా, ఇప్పుడు వాడుకలో వున్న హైదరబాద్ అనే పేరుతోనే నగరాన్నీ వ్యవహరించే వారు. బాగ్ అంటే ఉద్యానవనం అని అర్థం.*

2. గోలుకొండ వాస్తవ అక్షాంశరేఖ $17^{0}22'$ ఉత్తరం రేఖాంశం $78^{0}26'30$తూ.

3. మూసీనది (అనువాదకుడు: వి. బాల్ పాదసూచిక)

విస్తీర్ణంలో సుమారుగా అర్‌వీక్స్ నగరం అంత వుంటుంది. ఎంతో చక్కగా నిర్మించిన విశాలమైన నగరం. నగరంలో అనేక విశాలమైన చక్కని వీధులున్నాయి. కాని పేవ్‌మెంట్లు లేవు. భాగ్యనగరం రోడ్లపై పర్షియా, భారత దేశాలలోని ఇతర నగరాల కన్నా ఎక్కువగా వీధుల్లో దుమ్ము, ధూళీ, ఇసుక వుంది. వేసవిలో ఇది చాలా ఇబ్బందికరంగా వుంటుంది.

వంతెనకు వెళ్ళేదారిలో ఔరంగాబాద్ అనే పెద్ద శివారు గ్రామం వుంది. ఈ గ్రామం సుమారు ఒక కోసు (రెండు మైళ్ళ) పొడవు ఉంటుంది. వర్తకులు, దళారులు, వృత్తిపనివారు, సామాన్య ప్రజలు, అందరూ ఇక్కడే నివసిస్తారు. నగరంలో నివాసం రాజ ప్రసాద అధికారులు, మంత్రులు, సైనిక సిబ్బంది, తదితర ఉన్నతస్థాయి వారికే పరిమితం. ఉదయం పది లేక పదకొండు గంటల నుంచి సాయంత్రం నాలుగైదు గంటల వరకు వర్తకులు, దళారులు విదేశీ వర్తకులతో వ్యాపారం చేయడానికి నగరానికి వచ్చి తిరిగి ఔరంగాబాద్ వెళ్ళిపోయే వారు. ఈ శివారులో రెండు మూడు అద్భుతమయిన మసీదులు ఉన్నాయి. ఇవి బాటసారులకు, కొత్తవారికి, యాత్రికులకు సత్రాలుగా కూడా ఉపయోగపడతాయి. పరిసరాలలో చూడదగిన మందిరాలు కూడా వున్నాయి. నగరం నుంచి గోలుకొండ కోటకు కూడా ఈ శివారు మీదుగానే వెళ్ళాలి.

వంతెన దాటిన వెంటనే రాజమహలుకు దారివేసే విశాలమైన వీధిలో ప్రవేశిస్తాము. ఈ మార్గానికి కుడి వైపున రాజ వంశీకుల భవనాలు, నాలుగైదు రెండంతస్తుల సత్రాలూ కనిపిస్తాయి. సత్రాలలో చల్లగా వుండే పెద్ద పెద్ద గదులు, మందిరాలూ వున్నాయి. ఈ దారి చివర పెద్ద కూడలి కనబడుతుంది. ఇక్కడే రాజభవనానికి చెందిన ఒక నిలువెత్తు గోడ వుంది. ఆ గోడ మధ్యనే వున్న బాల్కనిలో కూర్చుని రాజు అవసరమయిన ప్రజలకు దర్శనమిస్తాడు. రాజ ప్రాసాదపు ప్రధాన ద్వారం ఈ కూడలిలో లేదు. అది సమీపంలోని మరొక కూడలి వద్ద వుంది. ముఖ

ద్వారం నుంచి ముందుగా చుట్టూ పలుమండపాలున్న ఒక పెద్ద లోగిలిలోకి ప్రవేశిస్తాము. ఇందులో చుట్టూ అందమయిన డాబాలు అనేకం కనిపిస్తాయి.* రాజభవనంలోని పైకప్పుల పైన ఏనుగులను ఉంచినట్టే, ఇక్కడ ఈ ఇళ్ళ కప్పులపైన అందమైన తోటలు, పెద్ద పెద్ద చెట్లు దర్శనమిస్తాయి. ఈ కట్టడాలు అంత బరువును ఎలా మోస్తున్నాయా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఈ భవనానికి రాజ భవన లక్షణాలన్నీ వున్నాయని చెప్పవచ్చు.

ఈ పట్నంలో యాభైయేళ్ళ క్రితం ఒక అద్భుతమయిన ఆరాధనా గోపుర నిర్మాణం ప్రారంభించారు. ఇది గనుక పూర్తయితే మొత్తం భారతదేశంలోనే ఒక మహాద్భుత దేవాలయం అవుతుంది. నిర్మాణానికి ఉపయోగిస్తున్న రాళ్ళ పరిమాణం ఆశ్చర్యంగొలిపేదిగా ఉంది. అలాగే ఒక మహాశిలలో తొలిచిన ప్రార్థనా స్థలం మరొక అద్భుతం. దీని నిర్మాణానికి బ్రహ్మాండమయిన ఏకశిలను ఉపయోగించారు. ఈ శిలను త్రవ్వి తీయడానికే ఐదేళ్ళు పట్టింది. ఈ పనికి 500 నుంచి 600 మందిని నిర్విరామంగా వినియోగించారు. ఆ శిలను నిర్మాణ స్థలానికి తరలించే వాహనం మీదికి యెక్కించడానికి ఇంకా ఎక్కువ కాలం పట్టింది. ఇందుకు 1400 ఎద్దులను ఉపయోగించినట్లు వారు నాకు చెప్పారు. అది అసంపూర్ణం ఎందుకయిందో?! ఈ నిర్మాణం పూర్తయి వుంటే, అది ఆసియాలోని అత్యద్భుత కట్టడాలను మించిపోయేది!

నగరానికి రెండవ వైపున మచిలీపట్నం వెళ్ళే మార్గంలో రెండు చెరువులున్నాయి. ఒక్కో చెరువు వ్యాసార్థం కనీసం కోసు వుంటుంది. ఈ తటాకాల్లో రాజు విలాస నౌకాయానానికి ఉద్దేశించిన, అలంకరించిన పడవలున్నాయి. ఈ రెండు చెరువుల తీరం పొడవునా ముఖ్యమయిన రాజుద్యోగుల నివాస భవనాలు బారులు తీరి వున్నాయి.

నగరానికి మూడు కోసుల దూరంలో, గోలుకొండ రాజుల సమాధులున్న సుందరమయిన మసీదు ఒకటి వుంది. ప్రతిరోజూ సాయంత్రం నాలుగుగంటలకు అక్కడ చేరిన పేదవారికి రొట్టె, పలావు పెడతారు. మీరు ఏదయినా అసలయిన అందాన్ని చూడ దలుచుకుంటే పండగ రోజుల్లో పర్వదినాలలో ఈ సమాధుల వద్దకు వెళ్ళాలి. ఉదయం నుంచి సాయంత్రం వరకు ఈ సమాధులను అద్భుతమైన విలువయిన తివాచీలతో కప్పి వుంచుతారు.

నగరంలో శాంతి భద్రతలను గురించి, పోలీసులను గురించి నేను గమనించగలిగింది చెపుతాను. ఎవరైనా కొత్తవారు నగరం ప్రవేశ ద్వారం చేరగానే అతని వద్ద ఉప్పుగాని, పొగాకుగాని వుందేమో క్షుణ్ణంగా సోదా చేస్తారు. ఎందుకంటే, రాజుకు ప్రధాన ఆదాయం లభించేది వీటినుంచే. కొత్తవారు నగర ప్రవేశ అనుమతి పొందడానికి కొన్ని సందర్భాల్లో రెండేసి రోజులు నిరీక్షించవలసి వుంటుంది. మొదట సిపాయి కొత్తవారు నగర ప్రవేశానుమతి కోరుతున్న విషయాన్ని అక్కడి అధికారికి తెలియజేస్తాడు. ఆ అధికారి ఈ సమాచారాన్ని 'దరోగా' కు పంపిస్తాడు. అయితే దరోగా పని ఒత్తిడిలో వుండవచ్చు. లేక నగరం వెలుపల కవాతులలో తలమునకలయి వుండవచ్చు. ఒక్కోసారి కొత్తవారి సమాచారాన్ని దరోగాకు చేరవేయడానికి వెళ్ళిన సైనికుడు దరోగా గారి దర్శనం కాలేదని చెప్పి, అనుమతి సంపాదించడంలో తాను పడుతున్న శ్రమకు మరింత మంచి ప్రతిఫలం ఆశిస్తూ వుండవచ్చు. నేను ముందే చెప్పినట్లు, కొత్తవారు ఈ చిక్కు ముడులన్నీ వీడేవరకు నిరీక్షించక తప్పదు. అందుకు ఒకటి రెండు రోజులు తేలికగా పడుతుంది.

నేను ఇంతకుముందు పేర్కొన్నట్టు, రాజు న్యాయ వ్యవహారాలలో తీర్పు చెప్పేప్పుడు కూడ లివైపునకున్న బాల్కనీలోకి వస్తాడు. ఆ సందర్భంలో అక్కడ హాజరు అయిన వారందరూ రాజు కూర్చున్న బాల్కనీకి ఎదురుగా, కింద నిలబడతారు. ప్రజలకీ, రాజభవనంగోడకీ మధ్య మూడు వరుసలలో చిన్న బరిసె పొడవున్న కర్రలను పాతుతారు. ఈ కర్రల బారులకు ఆచివరి నుంచి ఈ చివరి వరకు తాళ్ళను కడతారు. ఈ హద్దు దాటి వెళ్ళే అనుమతి ఎవరికీ లేదు. ఎంతటి

వారయినా రాజు పిలవనిదే లోపలికి ప్రవేశించలేరు. ఈ అడ్డుగోడ, రాజు ఈ దర్బారు నిర్వహించే సమయంలోనే వుంటుంది. ఇది కూడలి అంతా విస్తరించి ఉంటుంది. మిగతా సమయాలలో ఈ అవరోధం ఉండదు. బాల్కనీకి ఎదురుగా మాత్రం రాజ పిలిచిన వారు లోపలికి వెళ్ళేందుకు దారి వుంటుంది. ఈ దారికి ఇరువైపులా ఒక తాడు పట్టుకు నిలుచున్న ఇద్దరు మనుషులు రాజు పిలుపు అందిన వారు ప్రవేశించడానికి వీలుగా తాడును కిందికి జార్చి దారి విడుస్తారు. బాల్కనీ కింద ప్రజల ఫిర్యాదులు స్వీకరించడానికి ఒక ప్రభుత్వ కార్యదర్శి వుంటాడు. కార్యదర్శికి అయిదారు ఫిర్యాదులు అందిన తరువాత, ఆయన వాటిని, రాజు ప్రక్కన నిలబడి వున్న కొజ్జా ఒక తాడు సాయంతో జార విడిచిన సంచిలో వేస్తాడు. కొజ్జా ఆ సంచిని పైకి లాగి ఫిర్యాదులను రాజుకు నివేదిస్తారు.

ప్రధాన రాజవంశీకులు వంతులవారీగా ప్రతి సోమవారం రక్షణ బాధ్యతలు స్వీకరిస్తారు. వారికి మళ్ళీ వారం వరకు విశ్రాంతి వుండదు. ఈ రాజపురుషులలో ఐదువేల నుంచి, ఆరు వేల గుర్రాలు తమ స్వాధీనంలో గలవారు వున్నారు. వారు నగరం చుట్టూవున్న గుడారాలలో విడిది చేస్తారు. రక్షణ బాధ్యతలు స్వీకరించినప్పుడు ఎవరి యింటి నుంచి వారు బయలుదేరి సమావేశ స్థలానికి నేరుగా చేరుకొంటారు. అక్కడి నుంచి మాత్రం చక్కని క్రమశిక్షణతో పద్ధతి ప్రకారం బారులు తీరి కవాతు చేస్తూ వంతెన దాటి అక్కడినుంచి ప్రధాన మార్గం గుండా వెళ్ళి, బాల్కనీ ఎదుటగల కూడలి చేరుకుంటారు. దళం ముందు, ఆయా రాజ పురుషుల స్థాయిని బట్టి పది పన్నెండు ఏనుగులు నడుస్తుంటాయి. హోదాను బట్టి ఏనుగుల సంఖ్య మారుతూ ఉంటుంది. ఆ ఏనుగులలో కొన్నింటికి అంబారీలు వుంటాయి. అంబారి ఒక చిన్న బండి గూడులా వుంటుంది. కొన్నింటి పైన గూడుకు బదులు ఒక మావటాడు, మరో వ్యక్తి మాత్రమే వుంటారు. ఈ వ్యక్తి చేతిలో ఒక పతాకం వంటిది వుంటుంది.

ఏనుగుల తర్వాత జతలు, జతలుగా ఒంటెలు వుంటాయి. కొన్ని సందర్భాలలో యివి ముప్పయి, నలభై వరకు వుంటాయి. ప్రతి ఒంటె మూపునా

జీను వుంటుంది. జీను పైన ఒక ఫిరంగి అమర్చి వుంటుంది. ఒంటె మూపురంపై ఒక వ్యక్తి, ఆపాదమస్తకం తోలు దుస్తులు ధరించి, చేతిలో వెలుగుతున్న అగ్గిపుల్లతో కూర్చుని ఉంటాడు. రాజు కూర్చున్న బాల్కని ముందు ఒంటె మీదున్న ఈ వ్యక్తులు ఇటు నుంచి అటు చురుకుగా కదులుతూ వుంటారు.

ఒంటెల వెనుక శకటాలు కనబడతాయి. బళ్ళు కాలినడకన వచ్చే సేవకులు, వీరి వెనుక గుర్రాలు, ఆ వెనుక ఈ సమస్త సాధన సంపత్తికి అధికారి అయిన రాజ పురుషుడుంటాడు. రాజ పురుషుల ముందు పది, పన్నెండు మంది ఉన్నతస్థాయి ఉంపుడు కత్తెలుంటారు. వీరు వంతెన చివర తమ రాజ పురుషుడి కోసం ఎదురు చూస్తూ ఉంటారు. వంతెన చివరి నుంచి కూడలి వరకు రాజవంశీకుల ముందు ఈ స్త్రీలు గెంతుతూ, తుళ్ళుతూ నాట్యం చేస్తుంటారు. అతడి వెనుక అశ్వదళం, కాల్బలం ఒక క్రమంలో వస్తాయి. ఇది గొప్ప దృశ్యం. భాగ్యనగర్‌లో నేను ఒక్కోసారి వరుసగా మూడు నాలుగు నెలలు గడిపి ఉండటం వల్ల, నా మకాము ప్రదాన మార్గంలో ఉండటం వల్ల, ప్రతివారం క్రమం తప్పకుండా ఈ ఆహ్లాదకర దృశ్యాన్ని చూసి నేను ఆనందించే వాడిని.

సైనికులు ధరించే దుస్తులు కేవలం ఏడెనిమిది మూరల వస్త్రం మాత్రమే. ఈ బట్టను వారు శరీరం మధ్య భాగంలో ముందు వెనుక చుట్టుకొంటారు. పొడవాటి జులపాలు వుంటాయి. జుట్టును ఆడవారిలా తల మధ్యలో ముడి వేసుకుంటారు. తలపాగగా త్రిభుజాకారపు గుడ్డ ముక్కను కట్టుకుంటారు. ఈ గుడ్డలోని ఒక అంచును తల మధ్య భాగంలో వదిలేసి, మిగిలిన రెండు చివరలను మెడ కింద ముడి వేస్తారు. వీరి వద్ద పర్షియన్ల వలె పొడవయిన కత్తి వుండదు. అయితే స్విస్ సైనికులవలె ఖండించడానికి వీలయిన వెడల్పాటి ఖడ్గం వుంటుంది. దీనిని వీరు నడుముకు వేలాడే పట్కాలకు వేలాడదీస్తారు. వీరి తుపాకీ గొట్టాలు మన తుపాకుల కంటే బలమైనవి. ఇనుము శ్రేష్ఠమైనది. స్వచ్ఛమైనది. అందువల్ల గొట్టం పేలిపోయే అవకాశం లేదు. పదాతి దళం వారి వద్ద విల్లనంబులూ, డాలు, శిరస్త్రాణం, లోహకవచం వుంటాయి. కవచం లోహపు కోటు శిరస్త్రాణం నుంచి

భుజాల మీదుగా వేలాడుతూ వుంటుంది.

నగరంలో, నగర శివార్లలో, కోటలో అనేకమంది వేశ్యలున్నారు. సుమారు 20 వేలకు పైబడి వేశ్యలు 'దరోగా' వద్ద పేర్లు నమోదు చేయించుకున్నారు. 'దరోగా' వద్ద పేరు నమోదు చేయించుకోకుండా ఈ వ్యాపారం చేసే అనుమతి యెవరికీ లేదు. ఈ స్త్రీలు రాజుకు ఎలాంటి సుంకం చెల్లించరు. కాని, ప్రతి శుక్రవారం కొందరు, వారి 'నాయకురాలి' వెంట వచ్చి, సంగీత వాయిద్యాలతో బాల్కనీ ఎదురుగా కూడలిలో నృత్యంచేయవలసి వుంటుంది. అక్కడ రాజు ఉంటే, వారు రాజు ఎదుట నృత్యం చేస్తారు. రాజు లేనప్పుడు వాళ్ళను వెళ్ళి పొమ్మని కొజ్జా చేతితో సంజ్ఞ చేస్తాడు.

చల్లని సాయం సంధ్య వేళల్లో వేశ్యలు తమ ఇంటి గుమ్మాల్లో నిలబడి వుంటారు. సాధరణంగా వారి ఇళ్ళు పూరి గుడిసెలే. చీకటి పడిన తరువాత, సూచనప్రాయంగా గుమ్మంలో కొవ్వొత్తి లేక దీపం వెలిగించి వుంచుతారు. ఈ సమయంలోనే తాటి కల్లు దుకాణాలు కూడ తెరుచుకుంటాయి. తాడీ అనేది ఒక చెట్టు నుంచి తీసిన మధుపానీయం. ఇది మన కొత్త రకపు ద్రాక్షాసవీల వలె మధురంగా వుంటుంది. దీనిని అయిదారు కోసుల దూరం నుంచి తోలు సంచులలో, గుర్రాల మీద తీసుకొస్తారు. గుర్రానికి రెండు వైపులా రెండు సంచులు కట్టి వేగంగా వాటిని నగరానికి చేరుస్తారు. ఈ విధంగా రోజు నగరానికి అయిదారు వందల గుర్రాలు తాడీని తీసుకొస్తాయి. ఈ తాడీ మీద విధించే పన్ను రూపంలో రాజుకు గణనీయమైన ఆదాయం లభిస్తుంది. తాడీ వినియోగానికి వేశ్యలే కారకులు కనుక వారిని అనుమతించారు. అందువల్లనే తాడీ వ్యాపారులు వారి దుకాణాలను వేశ్యా వాటికల పరిసరాలలో ఏర్పాటు చేసుకున్నారు.

ఈ స్త్రీలు ఎంత అనువుగా, చురుకుగా వుంటారంటే, ప్రస్తుతం రాజ్యం చేస్తున్న రాజు మచిలీపట్నం సందర్శించాలనుకొన్నప్పుడు తొమ్మిది మంది వేశ్యలు ఎంతో నేర్పుగా, తమ శరీరాలతో ఒక ఏనుగు ఆకారాన్ని రూపొందించారు. నలుగురు

నాలుగు కాళ్ళుగా మరో నలుగురు శరీరంగా ఒకరు తొండంగా అమరిపోగా, ఈ ఏనుగు మీద వేసిన అంబారీలో కూర్చుని రాజు పట్నంలోకి ప్రవేశించాడు.

గోలుకొండలోని స్త్రీ పురుషులందరూ చక్కని శరీర సౌష్ఠవం, మంచి ఆకృతి, దానికి తగిన ఎత్తు గలవారు. అందమయిన మంచి రంగయిన ముఖాలు కలవారు. ఇక్కడి వ్యవసాయదారులు మాత్రం చామనచాయగా వుంటారు. బాప్టిస్ట్ టావెర్నల్ రచించిన "ట్రావెల్స్ ఇన్ ఇండియా" సంపుటి I 1676, అనువాదం ఎ.బాల్ (లండన్ : మాక్ మిలన్ అండ్ కంపెని/1889) పేజి : 150-159.) భారతదేశాన్ని క్రీ.శ. 1665-66 లలో సందర్శించిన జెన్.డి. తెవ్‌నాట్ (1633-67) యిలా పేర్కొన్నాడు :

'ఈ రాజ్య రాజధానిని భాగ్‌నగర్ అని పిలుస్తారు. పర్షియన్లు ఐదర్-ఆబాద్ అంటారు. ఇది విజయపూర్ నుంచి సుమారు నలభై అయిదు మైళ్ళ దూరంలో వుంది. పదిహేను డిగ్రీల పది నిముషాల అక్షాంశంలో వుంది. పొడవయిన మైదాన ప్రాంతంలో చిన్న చిన్న కొండలు గుట్టల మధ్య ఆహ్లాదకరమైన గాలులు వీచే ప్రశాంత వాతావరణంలో వుంది. అంతేకాక, గోలుకొండ రాజ్యం (సముద్రతలానికి) ఎంతో ఎత్తులో ఉంది. మేము తొలుత చేరిన నగర శివారు ప్రాంతంలో వున్న నివాసగృహాలు మట్టి గోడల పూరిళ్ళు. తక్కువ యెత్తులో తూతూ మంత్రంగా వున్నందున వీటిని గుడిసెలని తప్ప వేరే పేరుతో పిలువ లేము. మేము ఈ శివారు ప్రాంతంలో ఈ చివరి నుంచి ఆ చివరి వరకు తిరిగాము. ఇది చాలా పొడవైన మార్గం. శివారుకు ఆవలి అంచున గల వంతెన వద్ద మేము నగర ప్రవేశానికి కొత్వాల్ అనుమతి కోసం నిరీక్షిస్తూ ఆగాము. బిడారులోని వాణిజ్య వస్తువులను తనిఖీ నిమిత్తం కొత్వాలు ఇంటికి తీసుకువెళ్ళవలసి వుంది. అయితే, రాజుకు సన్నిహితుడైన అక్-నాజర్ అనే పర్షియన్ పెద్ద మనిషితో మా బిడారు నాయకుడికి పరిచయం వున్నందున, ఈ విషయం తెలిసిన వెంటనే ఆయన మేము బిడారుతో సహా నగరంలోకి ప్రవేశించడానికి అనుమతి పత్రాలను ఒక వ్యక్తి ద్వారా పంపించాడు. మూడు కమానులతో నిర్మించిన ఆ వంతెనను దాటి మేము అవతలకు చేరాము. ఇది

సుమారు మూడు బారల (18 అడుగుల) వెడల్పుతో, పెద్ద పెద్ద చదునైన బండరాళ్ళతో నిర్మించిన వంతెన. ఈ వంతెన క్రింద 'నెర్వా (Nerva)' నది ప్రవహిస్తోంది. ఆ సమయంలో ఈ నది చిన్న వాగులా కనబడింది కానీ వర్షాకాలంలో పారిస్‌లోని 'లోరే ', (Louvre) ముందున్న 'సైనీ నది' అంత విశాలంగా ప్రవహిస్తుంటుంది. వంతెన చివర అడ్డు గోడల కంటే పెద్దగా అనిపించని నగర ప్రవేశ ద్వారాలను చూశాము. ద్వారం నుంచి నగరంలోకి ప్రవేశించిన మేము, ఇరువైపులా ఇళ్ళుగల మార్గంలో పావుగంట నడిచాము. ఈ ఇళ్ళు కూడా నగర శివార్లలోని ఇళ్ళ వలెనే, అటువంటి సామగ్రితో నిర్మించినవే. అయితే ఇక్కడ ఇళ్ళముందు అందమయిన తోటలు వుండడం విశేషం.

మేము ఇదే వీధిలో 'నీమతుల్లాహ్' అనే బిడారు సత్రంలో ప్రవేశించాము. అందరూ అక్కడే వసతి ఏర్పరచుకొన్నారు. నెలకు రెండు రూపాయల అద్దెతో నేను రెండు పెద్ద గదులు తీసుకొన్నాను. ఈ నగరం వెడల్పు కంటే, పొడవు అధికంగా- ఒక రకంగా శిలువ ఆకారంలో వుంది. వంతెన నుంచి 'నాలుగు గోపురాల' (చార్‌మినార్: అను.) వరకు వీధి వంపులు లేకుండా తిన్నగా వుంది. అయితే 'గోపురాలు' దాటిన తరువాత అంత చిన్నగా లేదు. నేను నడుస్తూ నగరం పొడవును కొలిచాను. నాలుగు గోపురాల వద్దకు చేరాక, అక్కడ నుంచి ఎడమకు తిరిగి ఒక మైదానంలోకి ప్రవేశించాను. అక్కడి నుంచి మరొక వీధి 'నగర ద్వారం' వద్దకు చేర్చింది. నా కొలతలను సరిచూసుకొని లెక్కవేస్తే 'బాగ్‌నగర్' అయిదు వేల ఆరువందల యాభై అడుగుల పొడవుంది. వంతెన నుంచి 'నాలుగు గోపురాల' వరకు రెండు వేల నాలుగు వందల యాభై అడుగుల దూరం వున్నట్లు తేలింది. నగర ముఖద్వారం అవతల కూడ పదకొండు వందల అడుగుల పొడవు గల శివారు ప్రాంతం వుంది.

నగరంలో అనేక మైదానాలు, లేక బహిరంగ ప్రదేశాలు వున్నప్పటికీ, రాజమహల్ ముందున్న మైదానమే అన్నింటిలోనూ అందమైనది. ఈ మైదానానికి తూర్పు, పడమర దిశలలో భూమి కింద రెండు విశాలమయిన సమావేశ మందిరాలున్నాయి. ఈ దివానుల పై కప్పును నాలుగు కొయ్య స్తంభాల పైన

ఐదడుగుల ఎత్తున కలపలో నిర్మించారు. ఈ కప్పు చదునుగా ఉంది. కమాను మార్గంలో కంకర రాళ్ళతో చేసిన చక్రాలున్నాయి. ఈ మార్గం అంచులు వంపులు తిరిగి అందంగా వున్నాయి. ఈ మందిరాలు కొత్వాలు కార్యాలయాలుగా పనిచేస్తాయి. ఈ మందిరాల కింద కొత్వాల్ కారాగారాలున్నాయి. వీటి ముందు రెండు నీటి నిలువలు ఉన్నాయి. పైకప్పు పైన కూడా ఇదే విధమైన కంకర కమ్మీలున్న మార్గాలున్నాయి. ఈ మైదానానికి ఉత్తరంగా రాజ భవనం, మైదానానికి ఎదురుగా పైన రాజ భవనపు ముందరి ఆర్చీ వుంది. రాజు నగరంలో వున్నప్పుడు, సంగీత విద్వాంసులు రోజూ అనేక పర్యాయాలు ఆర్చీమీద చేరి గానం, వాద్య సంగీతం వినిపిస్తారు.

ఈ స్థలం మధ్యన రాజమహల్ నుంచి కనబడేలా, మూడు అడుగుల మందం ఆరు బారల పొడవు, అంతే యెత్తుతో, ఏనుగుల పోరాటం కోసం నిర్మించిన ఒక గోడ వుంది. ఏనుగులను పోరాటానికి ప్రేరేపించేటప్పుడు రెండు ఏనుగుల మధ్య ఈ గోడ వుంటుంది. ఏనుగులు పూర్తిగా రెచ్చిపోయినప్పుడు పరస్పరం ఢీకొనే క్రమంలో గోడను పడగొడతాయి. ఇక్కడ సామాన్యుల గృహాలు రెండు నిలువలకు మించిన ఎత్తు ఉండవు. వేసవి కాలంలో వడగాడ్పు నుంచి రక్షించుకోడానికి ఇళ్ళను అంతకంటే ఎత్తుగా నిర్మించరు. వాటిలో చాలా వరకు మట్టితో కట్టినవి. ఉన్నత వర్గాల వారి ఇళ్ళు మాత్రం చాలా అందంగా వుంటాయి.

ఆరువేల నూటా ఇరవై అంగల పొడవుగల రాజభవనం ఆ మైదానంలో ఒకవైపంతా ఆక్రమించడమే కాక, నాలుగు గోపురాల వరకు విస్తరించి ఒక విశాలమైన మండపంతో ఆగిపోతుంది. పెద్ద పెద్ద రాళ్ళతో నిర్మించిన రాజభవనం గోడలపైన ఒక దాని ప్రక్కన ఒకటి కొద్ది దూరం వ్యత్యాసంతో అర్ధ ప్రాకారాలు నిర్మితమై వున్నాయి. ఈ మైదానం వైపునకు అనేక కిటికీలున్నాయి. బయటి ప్రదర్శనలు చూడడానికి ఒక ఆరు బయటి గాలరీ ఉంది. రాజ మందిరం లోపల ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుందనీ, నీటి సరఫరా చివరి అంతస్తువరకు జరుగుతుందనీ చెబుతారు. బహు దూరం నుంచి తెప్పించిన నీటిని 'నాలుగు గోపురాల' లోని పై

భాగాన నిలువ చేసి, అక్కడి నుంచి గొట్టాల ద్వారా రాజ భవనంలోకి సరఫరా చేస్తారు. రాజు నుంచి అత్యవసర ఆనతి ఉంటే తప్ప ఎవ్వరూ రాజ భవనంలోకి ప్రవేశించలేరు. ఎప్పుడోగాని రాజు యిలా అనుమతించడు. ఎవ్వరూ సాధారణంగా రాజభవనం సమీపంలోకి రారు. రాజభవనం చుట్టూ ఒక హద్దు వుంటుంది. దానిని ఎవరూ దాటలేరు. నగరంలో మరొక నలుచదరపు మైదాన ప్రాంతం వుంది. ఈ ప్రాంతంలో గొప్ప గొప్పవాళ్ళు ఆడంబరంగా నిర్మించుకొన్న గృహాలున్నాయి. ఇక్కడి బిడారు సత్రాలు సాధారణంగా చాలా అందంగా వుంటాయి. వాటిలో రాజోద్యాన వనానికి ఎదురుగా వున్న 'నీమతుల్లాహ్' మరీ బాగుంటుంది. ఇది చాలా విశాలమైన సత్రం. ఈ కూడలి వివిధ రకాల చెట్లతో, ముస్లిమ్‌లు పరిశుభ్ర పరచుకునే ( ఉజూ) జలాశయంతో చాలా ఆకర్షణీయంగా వుంటుంది.

'నాలుగు గోపురాలు' అని పిలువబడే కట్టడం, చతురస్రాకారంలో వుంది. ప్రతివైపు నాలుగు బారల వెడల్పు, ఏడు బారల ఎత్తు కలిగి ఉంది. ఈ కట్టడానికి నాలుగు వైపులా నాలుగు కమానులు లోనికి దారి తీస్తాయి. ఈ కమానులు ఒక్కొక్కటి నాలుగుబారల ఎత్తు, నాలుగు బారల వెడల్పుతో వున్నాయి. నాలుగు కమానుల ముందు, అంతే వెడల్పు గల మార్గాలున్నాయి. ఈ కట్టడంలో ఒకదాని పైన ఒకటి రెండు అంతస్తులు వున్నాయి. వాటికి పై కప్పులున్నాయి. టెర్రేస్ అంచున రాతితో నిర్మించిన బాల్కనీ వుంది. ఈ కట్టడం నలుమూలలా సుమారు పది బారల ఎత్తుగల గోపురాలు ఉన్నాయి. ప్రతి గోపురంలోనూ బయటివైపు చిన్న చిన్న ఆర్చీలతో గ్యాలరీలు ఉన్నాయి. ఈ ప్రాంగణమంతా అందమైన గులాబి, జాజి పూల మొక్కలు చక్కగా అమర్చి ఉన్నాయి. కట్టడం లోపలి వైపును విల్లులా వంచి నిర్మించారు. లోపల నుంచి ఇది ఒక డోమ్‌లా కనబడుతుంది. లోపలి వైపున అంతా రాళ్ళతో నిర్మించిన చట్రాలు, గుచ్చి, పేర్చి ఉన్నాయి. బయటి వైపుకి వున్న గ్యాలరీల వలె ఈ రాతి చట్రాలు ఎలాంటి పూతగాని, మెరుగు కానీ లేకుండా వెలుపలికి ఉబికి వున్నాయి. లోనికి ప్రవేశించడానికి గోడలలో అనేక ద్వారాలున్నాయి. ఈ డోమ్ క్రింద నేలకు ఏడెనిమిది అడుగుల ఎత్తున ఒక మందిరంలా ( దివాన్)

నిర్మించి వుంది. పైకి వెళ్ళడానికి మెట్లున్నాయి. దివాన్‌లో ఏడెనిమిది అడుగుల ఎత్తులో ఒక పెద్ద బల్ల అమర్చి వుంది. బల్లవరకు వెళ్ళడానికి మెట్లున్నాయి. ఈ కట్టడంలోని గ్యాలరీలన్నీ నీటిని పైకి పంపడంలో తోడ్పడతాయి. అక్కడి నుంచి నీరు రాజభవనం పై అంతస్తులకు సరఫరా అవుతుంది. ఈ కట్టడం పరిసర ప్రాంతమంతటి మనోజ్ఞమైన ప్రదేశం నగరంలో మరొకటి లేదు. అయితే ఈ కట్టడం చుట్టుపక్కల చెక్కతో, గడ్డితో చేసినందువలన అసహ్యంగా కనిపించే దుకాణాలున్నాయి. ఈ దుకాణాల్లో పళ్ళు అమ్ముతారు. ఇవి ఈ కట్టడపు శోభను పాడు చేస్తున్నాయి.

'బాగ్‌నగర్' లో అనేక మంది అధికారులు, న్యాయనిపుణులూ వున్నారు. అందరిలోనూ గణనీయుడు కొత్వాల్. ఈయన నగరానికి 'గవర్నర్' మాత్రమే కాదు. రాజ్యంలో శిస్తులు వసూలు చేసే ప్రధాన అధికారి కూడా. అంతేకాదు ఇతడు టంకశాలకు అధిపతి. నగరంలోని అత్యున్నత న్యాయమూర్తి. నగరంలోని సివిల్, క్రిమినల్ కేసులన్నీ ఈయన పరిధిలోనివే. రాజుగారి స్థలాలన్నింటినీ ఈయన అద్దెకు తీసుకొని పెద్ద మొత్తంలో బాడుగ చెల్లిస్తాడు. ఈ నగరంలో పెద్ద సంఖ్యలో ధనవంతులైన వర్తకులు, ఆభరణాల విక్రేతలు ఆర్థిక వ్యవహార వేత్తలూ, అనేకమంది నైపుణ్యంగల పని వారూ వున్నారు. బాగ్‌నగర నివాసులలో, నలభైవేల మందిగల ఆశ్విక దళం కూడా వుంది. వీరిలో పర్షియన్, మొగల్, తార్‌తార్ యోధులు వున్నారు. రాజు వీరందరినీ పోషిస్తాడు. గతంలో వలె శత్రువుల దాడిని చేష్టలుడిగి చూస్తూ ఊరుకునే పరిస్థితి తిరిగి దాపురించకుండా, రాజు వారిని పోషిస్తున్నాడు.

భారతీయ వ్యాపారులతో పాటు భాగ్‌నగర్‌లో అనేక మంది పర్షియా, ఆర్మేనియా వర్తకులు కూడా వున్నారు. అయితే ప్రభుత్వ యంత్రాంగంలోని బలహీనతల వల్ల 'ఒమ్రా'లు ఈ విదేశీ వర్తకులను అప్పుడప్పుడు పీడిస్తూ వుంటారు. నేను ఇక్కడ ఉన్నప్పుడు ఒక యూదేతర ఆర్థిక వ్యాపారిని ఒక ఒమ్రా తన ఇంటికి కబురు పెట్టి పిలిపించుకుని నిర్బంధించి వెయ్యి చెకిన్స్ (Chequins) వసూలు చేశాడు. ఈ విషయం తెలిసినసాటి ఆర్థిక వ్యాపారులందరూ కార్యాలయాలను మూసి వేశారు.

అయితే రాజు యూదే తర బ్యాంకరు కోల్పోయినదంతా తిరిగి లభించేలా ఆదేశాలు జారీ చేశాడు. ఆవిధంగా ఆ వివాదం ముగిసింది.

నగరంలోని వృత్తిపనివారు, వ్యవసాయదారులు స్వదేశీయులే. రాజ్యంలో అనేక మంది ప్రవాస పౌరులున్నారు. అయితే వీరిలో ఎక్కువ మంది తమ దేశంలో నేరాలు చేసి పారిపోయి వచ్చిన పోర్చుగీసువారు. ఇంగ్లీషు, డచ్చివారు కూడా ఆలస్యంగా నయినా కొందరు ఇక్కడ స్థిరపడ్డారు. వీరిలో డచ్చివారు బాగా లాభం పొందారు. డచ్చివారు ఇక్కడ (మూడు సంవత్సరాల క్రితం) ఒక కర్మాగారాన్ని ఏర్పరిచారు. ఇక్కడ వీళ్ళు తన కంపెనీకోసం వస్త్రాలను కొనేవారు. ఈ వస్త్రాలను, దుస్తులను ఇతర ప్రాంతాలలో అమ్మేవారు. భాగ్‌నగర్‌లోనూ, గోల్కొండ రాజ్యంలోని యితర పట్నాలలోనూ నుంచి గిరాకీ వున్న వస్తువులను మచిలీపట్నం రేవు నుంచి, ఎడ్లబండ్ల మీద వేసుకొచ్చి అమ్మేవారు. ఇలా నగరానికి దిగుమతి చేసే వస్తువులలో మిరియాలు, లవంగాలు, దాల్చిన చెక్క, వెండి, రాగి, తగరం, సీసం తదితర వస్తువులుండేవి. ఈ వ్యాపారంలో డచ్చివారు విపరీత లాభాలుగడించారు. అమ్మకాల మీద లాభం అయిదు నుంచి ఇరవై రెట్లు వరకు వున్నట్లు వారు చెబుతారు. ఈ లాభం ఏటా పదకొండు, పన్నెండు వందల వేల ఫ్రెంచి లీరాలు వుంటుందని వారు నాకు నమ్మకంగా చెప్పారు. వారు (అధికారులకు) బహుమానాలు ఇవ్వడం ద్వారా నగరంలో యింతటి ఆదరణ పొంద గలుగుతున్నారు. నేను భాగ్‌నగరం నుంచి తరలి వెళ్ళడానికి కొన్ని రోజుల ముందు డచ్చివారి నాయకులు మేళతాళాలతో, అధికార ధ్వజంతో ఊరేగడం చూశాను.

రాజ్యంలో వెలయాళ్ళను అధికారికంగా అనుమతించారు. పురుషులు వేశ్యల ఇంటికి వెళ్ళి రావడం ఆక్షేపణీయం కారాదనే యిలా చేశారు. సానులు తరచూ బాగా అలంకరించుకొని విటులను ఆకర్షించడం కోసం తమ వాకిళ్ళలో నిలుచుంటారు. కానీ వీరిలో చాలా మంది రోగాలతో కుళ్ళిన వారని అంటారు. సాధారణ ప్రజలు ఇక్కడ భార్యలకు అసాధారణమయిన స్వేచ్ఛనిస్తారు. పెళ్ళి సమయంలోనే భార్య నగర వీధిలోకి వెళ్ళడాన్ని, తప్పు పట్టననీ, ఇరుగు పొరుగు

ఇళ్ళకు వెళ్ళడాన్ని, గోల్కొండ ప్రజలకు అత్యంత ప్రియమైన కల్లు తాగడాన్ని తప్పుగా భావించననీ వరుడు వాగ్దానం చేసేలా వధువుల తల్లిదండ్రులు మాట తీసుకుంటారు.

భాగ్‌నగర్‌లో లేక రాజ్యంలో మరెక్కడయినా దొంగతనం చేస్తే దొంగ రెండు చేతులు నరికి శిక్షిస్తారు.ఇది అనేక భారత రాజ్యాలలో ఉన్న ఆచారమే. ( ది ట్రావెల్స్ ఆఫ్ మానిసర్ డి. లెవ్‌నాట్ ఇన్‌టుది లెవాంట్ వాల్యూమ్: III అనువాదం ఎ. లోవెల్ (లండన్, హెచ్.క్లార్క్ సెయింట్ (ఫ్రాన్స్ చర్చియార్డ్) పేజీలు : 94-97

**1672లో అబ్బెకార్ :** "ఈ భాగ్‌నగర్ మొత్తం కొత్తవారితో, వర్తకులతో నిండి వుంది. భారతీయులూ, విదేశీయులూ, జాతీయత గురించీ, చేసే వ్యాపారాల గురించీ యెట్టి ఆంక్షలూ లేకుండా వ్యాపారం చేసుకొంటారు. అన్ని జాతుల వర్తకులూ, ధనికులతో, అన్నిరకాల వ్యాపార వస్తువులతో తూర్పున అన్ని వ్యాపారాలకు కేంద్రంగా కనిపిస్తుంది."

ఇంతేకాదు; నిజామ్‌పట్నంలో (1608-14) పనిచేసిన ఒక 'అజ్ఞాత రచయిత' అధికారిక అవసరాలకోసం మోర్‌లాండ్ 'రిలేషన్స్' లో నమోదు చేసిన వివరాలు కూడా మనకు తూర్పుతీరం నుంచి ఆనాటి దృశ్యాన్ని చూపిస్తాయి.

"సుందర వాతావరణం, చక్కని నీటి సౌకర్యం, సారవంతమైన భూమి. భారతదేశంలోని నగరాలన్నింటిలోకి భౌగోళికంగా అత్యుత్తమ స్థానంలో నిలిచి వున్న నగరం యిది. ఇక రాజభవనం గురించి చెప్పనక్కరలేదు. భారతదేశాన్ని సందర్శించిన యాత్రికుల దృష్టిలో, ఈ రాజ భవనం మొగలు చక్రవర్తుల లేక ఏ యితర రాజుల రాజప్రాసాదాలకంటే కూడ విస్తృతిలోనూ, సమృద్ధిలోనూ ఎంతో పెద్దది. పన్నెండు మైళ్ళ ప్రాకారంతో దృఢంగా నిర్మించిన రాజభవనం యిది. కొన్ని ముఖ్యమైన భాగాలలో సాధరణంగా మనం ఇనుము వాడే చోట బంగారాన్ని ఉపయోగించారు. కిటికీ చువ్వలు, గడియలు,మొదలయిన వాటిలో, రాజు వైభవానికి ఉచితమనితోచిన ప్రతిచోటా బంగారంతో చేసిన వస్తువులను

ఉపయోగించారు. ఏనుగుల్లో, ఆభరణాల్లో ఈ రాజు భారతదేశంలోని అతి సంపన్న రాజులలో ఒకడు".

చివరగా, ఒక అసాధారణ సమాచారాన్ని చూద్దాము : భాగ్‌నగర్‌ను వర్ణించిన వారిలో, అసాధరణంగా, అమీర్ అలీ అనే బందిపోటు కూడా వున్నాడు. మెడోస్ టేలర్ రాసిన "కన్ఫెషన్స్ అఫ్ ఎ థగ్" పుస్తకం 1839లో ప్రచురితమయ్యింది. అమీర్ అలీ 19 వ శతాబ్దపు రెండవ దశకం చివరి భాగంతో హైదరబాద్‌ను 'వృత్తి రీత్యా' సందర్శించాడు. అప్పుడు హైదరాబాదును నిజామ్ అక్బర్ అలీఖాన్ సికిందర్ రజా ఆసఫ్ ఝూ III పరిపాలిస్తున్నాడు. అప్పటికే ఈ నగరం నిర్మించి 230 సంవత్సరాలయింది.

అమీర్ అలీ ఆల్వాల్ మీదుగా హైదరాబాద్ చేరుకున్నాడు. తాను హైదరాబాద్ నగరంలోకి ప్రయాణించిన మార్గాన్ని అతను అభివర్ణించాడు. టాంక్‌బండ్ నుంచి అతను హుసేన్‌సాగర్ తటాకాన్ని చూశాడు. హుసేన్‌సాగర్ ఉపరితలం వెయ్య అలలుగా ఉంగరాలు తిరిగి వుంది. కెరటాలు, రాతితో నిర్మించిన గట్టుకి వచ్చి ఢీకొంటూ వుంటే, నీటితరగలు మన ముఖాల మీద చిందుతూ వుంటాయి. ఆ నీటి బిందువులు రత్నాల్లా మెరుస్తూ వుంటాయి. ఇది మా అందరికి ఓ నూతన అనుభవం. అందుకే మేమక్కడ చాలాసేపు నిలబడి పోయాము. సముద్రం యెప్పుడయినా మా ఎదట వున్న ఈ సరస్సంత గొప్పగా వుంటుందా అని విస్తుపోయాము. ఆమీర్ అలీ అప్పటికింకా సముద్రాన్ని చూడలేదు.

ఆ తరువాత అతడు ఎదురుగా వున్న నౌబత్‌పహాడ్ ను చూసి ఆ దిశగా కదిలిపోయాడు. అక్కడి నుంచి అద్భుతమయిన నగర దృశ్యాన్ని తిలకించి ఉక్కిరి బిక్కిరయ్యాడు. "దక్కన్ రాజధాని నగరం నేను చూసిన యితర దేశాలలో అంతగా ప్రశంసలందుకోవడం న్యాయమే". అని పేర్కొన్నాడు. ఆ తరువాత అరణ్యంలా వున్న చెట్ల మధ్యగ తెల్లగా ప్రకాశిస్తున్న అందమయిన సుందర భవనాలు పైకప్పులను చూశాడు. చుట్టూ వున్న సుందరమయిన భవనాల మధ్య చార్మినార్, మక్కా

మసీదులు గర్వంగా తలయెత్తి సమున్నతంగా నిలబడి వున్నాయి. అపాగ విస్తీర్ణం గల నగరాన్ని చూసి అతడు ఇది ప్రధానంగా ఉద్యానవనాలు, విశాల ప్రాంగణాల నగరం అని భావించాడు. అతడితో ఉన్న సహచరులు కూడా ఆ అందమైన దృశ్యాన్నీ అతడు ఆదే పనిగ పొగుడుతోంటే అవునని ఆంగీకరించారు. అయితే నగర వీధులు ఇరుకుగా, మురికిగా వుండడాన్ని, నగరం వెలుపలి నుంచి దూరం నుంచి చూసి వూహించిన దానికీ నగరం లోపలి దృశ్యం సరిపోలక పోవడాన్నీ అమీర్ అలీ గుర్తించాడు. అయినప్పటికీ, ఏనుగు అంబారీల మీద ప్రయాణం చేసే రాజ పురుషులు, ఉన్నతోద్యోగులు, వెంట నడిచే సాయుధ రక్షకభటులు రాజ్య సంపదకు చిహ్నాలని అతడు అంగీకరించాడు. చార్మినార్ చుట్టూ మాత్రం అతనికి విశాలమయిన వీధులు కనిపించాయి. "నా గుర్రాన్ని ఆపి, మబ్బుల్లోకి దూసుకు పోయినట్టున్న గోపురాలను చూస్తూ ఎంత బ్రహ్మాండంగా వున్నాయో అని నేను ఆశ్చర్యపోయాను. అన్నాడు అమీర్ అలీ. "ఈ ఒక్క నిర్మాణాన్ని చూసేందుకే ఢిల్లీ నుంచి యిక్కడికి ప్రయాణించవచ్చు"" అన్నాడతను.

కుతుబ్ షాహి పాలకుల గోరీలను సందర్శించిన కొద్ది మందిలో అమీర్అలీ కూడ ఒకడు. అజీమా అనే మహిళ తన ఇంటి బాల్కనీలో నిలుచుని వుండడం గమనించకుండా కింది నుంచి ఇతడు వెళుతూ వుండగా ఆమె చూసింది. చూసిన మొదటి చూపులోనే ప్రేమించింది. అజీమా 'కల్లు' అనే తన సేవకురాలిని యువకుడయిన ఈ బందిపోటుకు రాయబారం పంపి తనను కాపాడమని కోరింది. గొప్ప సౌందర్యవతి అయిన ఆజీమా క్రూరుడైన ఒక వృద్ధుడితో కాపురం చేస్తోంది. అమీర్ అలీ, అజిమాలు మర్నాడు ఉదయం హజరత్ షావలీ దర్గా వద్ద కలుసుకొని, అక్కడి నుంచి లేచి పోవాలని నిర్ణయించుకున్నారు.

ఈ దర్గా కుతుబ్షాహీ సమాధులకు సమీపంలో వుంది. అజిమా రావడం ఆలస్యం అయినందువల్ల ఈ 'బంధిపోటు' ఆ గోరీలను చూస్తూ సమయాన్ని గడిపాడు. ఆ గోరీల భారీ పరిమాణాన్నీ, అధ్భుత శిల్పకళను చూసి ఆశ్చర్య పోయాడు. గోరీ ప్రాంగణం లోపలి దృశ్యాన్ని అతడు ఇలా వర్ణించాడు.

"అక్కడ నిశ్శబ్దం నిర్మానుష్యం అతి భారంగా వున్నాయి. మేము ఒకరితో ఒకరం ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రాజవంశీకుల సమాధుల లోపల ఒక్కొక్క భాగాన్నీ అలా నిశ్శబ్దంగా చూసుకొంటూ వెళ్ళాము. కొన్ని గదులయితే చీకటి గుయ్యారాలు; గబ్బిలాలతో, అడవి పావురాలతో నిండి వున్నాయి. వాటి కూతలు సమాధుల గుమ్మటాలలో ప్రతిధ్వనిస్తున్నాయి. మరికొన్ని గదులలో విశాలమైన ఆర్చీలు జాలీలు పగటి వెలుగును లోనికి ప్రసరింప జేస్తున్నాయి. మేము ఆ కాంతిలో ఒకరినొకరం చూసుకొని ఆనందించాము"

ఈ 'బందిపోటు' కథనం ప్రకారం, యిలా లేచిపోయిన 'ఆయిద్దరూ' పెళ్ళి చేసుకున్నారు.

రాజు వ్యక్తిగత కోశాధికారి మీర్ అబుతాలిబ్ లెక్కలను పరిశీలిస్తే, మహమ్మద్ కులీ కుతుబ్‌షా కాలంలో ప్రజోపయోగకర భవన నిర్మాణాలకుడెబ్బయి ఎనిమిది లక్షల హన్లు (ఒక హోను సుమారు నాలుగున్నర రూపాయలు) ఖర్చు చేసినట్లు కనిపిస్తోంది. ప్రతి సంవత్సరం అరువై వేల హోన్లుపేదలకు పంపిణీ చేసేవారు. ఇందులో 12,000 హోన్లు ఒక్క మొహర్రం మాసంలోనే దానాల రూపంలో ఇచ్చేవారు." అది బ్రిగ్స్ పెర్కొన్నాడు.[2]

**ఒక కొత్త అన్వయం :** పిరిష్తా ఉల్లేఖనల ప్రకారం, మహమ్మద్ కులీ నగరం స్వర్గానికి ప్రతిబింబంగా వుండాలని ఆదేశించాడు. దీనిని ఒక కవితోపమానంగా స్వీకరించాలి. అయితే ఇటీవల జాన్ పీపర్ అనే జర్మన్ పండితుడు దీనికి ఒక కొత్త వివరణనూ, కొత్త అన్వయాన్నీ ఇచ్చాడు. 1988లో ప్రచురించిన తన వ్యాసంలో [3] సుల్తాన్ ఆదేశాలనుఅక్షరాలా స్వీకరించి వుంటారని నిరూపించే ప్రయత్నం చేశాడు. 'వాస్తవానికి ఈ నగరాన్ని' 'ఈడెన్‌గార్డెన్' నమూనాలో రూపొందించారు. అని పీపర్ వాదించాడు. ఇది ఎంతో ఆసక్తికర వివరణ. ఆసక్తికరమయిన వ్యాఖ్యానం కూడా. ఈ అధ్యాయాన్ని ముగించే ముందు దీనిని కొంత వివరించడం అవసరం. కూడళ్ళ నుంచి నలుదిక్కులకూ వెళ్ళే వీధులు ప్రధానదిశలలోకి వెళ్ళడం లేదని

జాన్ పీపర్ అభిప్రాయం వ్యక్తం చేశాడు. నగరానికి పునాదులు వేసిన నాటి గ్రహ నక్షత్ర రాశి స్థితికి సంబంధించి లభిస్తున్న వివరాలకు కూడా కూడలి వీధుల నిర్మాణం అనుగుణంగా లేదు. తూర్పు నుంచి పడమరకు పోయే ప్రధాన వీధి నిజానికి తూర్పు నుంచి దక్షిణ దిశకు $10^0$ వైదొలగి వున్నదనీ, నిజానికి, ఈ వీధిని మక్కా దిశలోకి మలపడానికి యిలా బుద్ధి పూర్వకంగానే చేశారనీ ఆయన అన్నాడు. "దీనిని బట్టి చార్మినార్ పైఅంతస్తులో వున్న మసీదు 'కిబ్లా' దిశ ప్రాతిపదికగా హైదరాబాదుకు రూపకల్పన జరిగిందని తెలుస్తోంది."

రెండు కూడలులున్నాయి చార్మినార్ వద్ద ఒకటి, చార్మినార్‌కు 225 అడుగుల (నిజానికి 250 అడుగులు, లేదా 75 మీటర్లు) దూరంలో చార్ కమాన్ దగ్గర నాలుగు వైపులా నాలుగు పెద్ద ఆర్చీలు గల కూడలి మరొకటి. ఈ కూడలి మధ్యలో 'చార్-సు-కా-హౌజ్' (నాలుగుదిక్కుల నీటి బుగ్గ) రాజభవనాల నుంచి చూస్తే ముఖ్యంగా కనబడేది ఇదే. పశ్చిమంగా రాజ ప్రాసాదాలున్నాయి. దారిని ఒక ఆర్చి మూసి వేస్తుంది. ఆర్చి వద్ద ఒక ద్వారం వుంది. ఈ ద్వారం పై నుంచి సువర్ణవస్త్రం ఒకటి వేలాడుతూవుంటుంది. ఆర్చి వెనుక వ్యతిరేక దిశలో (ప్రస్తుతం కాలీ కమాన్ అని పిలుస్తున్నారు) రాజ ఢంకాశాల వుంది. ఈఆర్చి పైన సంగీత విద్వాంసులు కూర్చొని రోజుకు అయిదు పర్యాయాలు సన్నాయి వాయిస్తారు. దీనివెనుక రాజుగారి భద్రతాదళాల బారకాసులు (బేరక్స్) వున్నాయి. ఈ ప్రాంతం ఇక్కడి అనేక వాస్తు నిర్మాణాల అర్థవంతమైన సంబంధం. అంతా జాన్ ఫీవర్ ప్రకారం ఖురాన్ వర్ణించిన 'అనంత ఉద్యానవనం' లక్షణాల మీద ఆధార పడి వున్నాయి.

ముందుగా పేర్కొనదగినది నీటిబుగ్గ. (జలయంత్రం) దీని పేరే ఖురాన్ లోని సూరా 47-16(నిజానికిది 16 కాదు 14) వాక్యాన్ని గుర్తుకు తెస్తుంది. "స్వర్గంలో ఎన్నటికీ కలుషితం గాని నీటి ప్రవాహాలు, స్వచ్ఛమైన తేనె వాగులు వుంటాయి". ఈనాలుగు సెలయేళ్ళుస్వర్గం మధ్య భాగం నుంచి నాలుగు దిశలకూ ప్రవహించే అదృశ్యంగా వున్న నీటి చెలమలనుంచి ప్రారంభమవుతాయి.

చార్-సు-కా-హౌజ్ ఆ నీటి చెలమకు పర్యాయపదంగా కనిపిస్తుంది. ఈ కూడలిలో నాలుగు దిక్కులకూ విస్తరించే మార్గాలు, ఆ సెలయేళ్ళకు ప్రతీకాత్మకమయిన వాస్తు పరిణామాలు.

అదే విధంగా, ఖురాన్ లోని వర్ణనకు అనుగుణంగా ఈ ఆకర్షణీయమైన నీటిబుగ్గ ప్రక్కన చెట్లు నాటడం జరిగింది. ఇక్కడ వున్న చెట్ల సంఖ్య రెండో, నాలుగో తెలియదు కానీ రెండు రకాల చెట్లు-కొబ్బరి, పోకచెట్లు వున్నాయి. ఫీపర్ చెప్పిన దాని ప్రకారం ఇది. ఖురాన్ లోని 56,58 సూరాలకు అనుగుణంగా వుంది. ఆ సూరాల్లో "కుడి చేతి అనుచరులు ముళ్ళు లేని సిద్ర్ చెట్ల క్రింద, బారులు తీరిన 'తల్' చెట్ల విశాల ఛాయలో, ప్రవహాల గట్టున నివాసముంటారు. అని ఉంది. ఖురాన్ పేర్కొన్న అద్భుత వృక్షాలతో పోల్చదగిన చెట్లు భూమండలం పైన లేవు. స్వర్గంలోగల 'జీవిత వృక్షాని'కి కొబ్బరి చెట్టు ప్రతి రూపమని జాన్ ఫీపర్ నమ్మకం. అలాగే ఖురాన్ పేర్కొన్న తల్ వృక్షానికి పోకచెట్టును ఒక విలోమ ప్రతీకగా భావించి వుండవచ్చు.

హైదరాబాద్ నిర్మాణ వ్యూహం (వాస్తు) ఈడెన్ గార్డెన్‌కు యెలా అనుగుణంగా వుందో వివరించిన జాన్ ఫీపర్ మరొక అడుగు ముందుకు వెళతాడు. అనుగ్రహం పొందిన వారి నివాసం ఇరువైపులా ఎత్తయిన గోడతో మూయబడి వుంటుందని 'ఖురాన్' సూరా 7, 47 లోని వాక్యాలు ప్రస్తావిస్తున్నాయి. ఈ నాలుగు ఆర్చీలు ఆ గోడకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయని ఫీపర్ అన్నాడు. ఉత్తరాన, దక్షిణాన గల ఆర్చీలు రాజుగారి భద్రతా దళాల నిఘా కేంద్రాలు. ఖురాన్ పేర్కొన్న ప్రాకారపురుషుల (Men of the wall) ను వారు సూచిస్తున్నారు. తూర్పు, పశ్చిమ ఆర్చీలు ఖుర్ఆన్ పేర్కొన్న ఆనందాలకు ప్రతీకలు. పశ్చిమ ఆర్చీ పై నుంచి గాలిలో తేలియాడే పెద్ద బంగారు తెర, తూర్పు ఆర్చీ పై నుంచి సంగీత విద్వాంసులు వినిపించే సన్నాయి 55వ సూరాకు ప్రతీకలని ఫీపర్ అభిప్రాయం. ఈ సూరాను అనుసరించి స్వర్గ ప్రవేశం చేసిన వారికి అందమైన యువతులు సేవలు చేస్తారు. వారు "నీల విశాల నేత్రాలతో, తేలియాడే గుడారాలలో మీకోసం నిరీక్షిస్తూ

వుంటారు. సన్నని స్వరంతో పాటలు పాడుతూ, సంగీత వాయిద్యాలను ప్రయోగిస్తూ అలౌకిక గాన మాధుర్యంతో స్వర్గ ఉద్యానవనాన్ని ఆనందడోలికల్లో ముంచెత్తుతారు" అనే వర్ణన వుంది. ఫీపర్ డబుల్ క్రాస్, కూడలి రహస్యాన్ని కూడా ఛేదించాడు. అందరికీ ఒకటే స్వర్గం లేదనీ, అవి హోదాని బట్టి వుంటాయనీ 55 వ సూరా తెలియజేస్తోంది. చక్కని ఫలపుష్పాలు, వైభవోపేత జీవితానికి కావలసిన విలాస సదుపాయాల నందించే రెండు ఉద్యానవనాలు, వన మయూరికలు, పళ్ళు, సుఖవంతమైన కుటుంబ జీవనానికి కావలసిన సర్వసౌకర్యాలతో మరో రెండు ఉద్యానవనాలు వున్నాయి". ఈ రెండు ఉద్యానవనాలు ప్రభువుతో ప్రశాంతితో గడిపే వారికోసం కేటాయించ బడ్డాయి.

పశ్చిమ ఆర్చి వెనుక రాజు, అంటే ప్రభువు నివాసముంటాడు. నగరంలోని ఇతర నివాస స్థలాలలో ప్రజలు ప్రభువుతో, శాంతితో, సుఖంగా జీవిస్తారు.

ఈ అన్వయం బలవంతంగా సాగదీసినట్లు కనిపిస్తోంది. అద్భుతమయిన ఊహ కూడా అనిపిస్తుంది. అయితే మహమ్మద్ కులీ కవి. ఆయన భావాలు అద్భుత శిఖరాలను అందుకోగలవు. దానికి తోడు ఇరాన్ నుంచి ప్రత్యేకంగా ఆహ్వానించిన అపురూప శిల్పులు వుండనే వున్నారు. మహమ్మద్ కులీకి మీర్ మోమిన్ స్ఫూర్తి ప్రదాత. మీర్ మోమిన్ కూడా మంచి కవి, వాస్తుశిల్పి గ్రిట్టి షియా, బహుముఖ ప్రజ్ఞాశాలి. ఈ ఇద్దరు మహానుభావులు చేతులు కలిపాక, ఏమో ఏమి చెప్పగలం!

# ఉప సంహారం

మహమ్మద్ కులీ 46 సంవత్సరాల నడి వయసులోనే క్రీ.శ.1611లో ణిపోయాడు. కుతుబ్‌షాహీల కాలంలో, కులీ పాలనా కాలం వివిధ రంగాలలో శిష్టతను సంతరించుకుంది. సరిహద్దులలో, అంతకు ముందరి స్థితితోపోలిస్తే ాంతి నెలకొంది. బయటి శత్రువులతో ప్రత్యక్ష సంఘర్షణలు కూడా నామ మాత్రమే. వాణిజ్యం, కళలు విలసిల్లాయి. సుల్తాన్ వ్యక్తిగత ఆసక్తి, ప్రత్యేకమయిన అభిలాషవలన సాహిత్యానికి మంచి ప్రోత్సాహం లభించింది. పలు వాణిజ్య సంస్థల స్థాపన కారణంగా కులీ కాలంలోనే ఐరోపా నిశ్శబ్దంగా, అనితర సాధ్యంగా దక్షిణ భారతంలోకి ప్రవేశించడం ప్రారంభమయింది.

మహమ్మద్ కులీకి కుమారులు లేరు. ఆయన కూతురు హాయాత్ భక్షీ గోలుకొండ రాజకీయాలలో ప్రముఖ పాత్ర పోషించింది. సుల్తాన్ కుమార్తెగా, ఆయన వారసుని భార్యగా, ఆ తదుపరి పాలకుని తల్లిగా ఆమె గోలుకొండ రాజకీయాలలో ఒకవెలుగు వెలిగింది. మహమ్మద్ కు లీ మరణానంతరం ఆయన మేనల్లుడు, ఏకైక అల్లుడు, సుల్తాన్ మహమ్మద్ సింహాసనాన్ని అధిష్టించాడు.

సుల్తాన్ మహమ్మద్ కాలంలోనే మొగల్ యువరాజు ఖుర్రమ్ మాలిక్ అంబర్‌ను లొంగదీశాడు. ఆ తరువాత ఖుర్రమ్ షాజహాన్‌గా బిరుదు పొందాడు. మాలిక్ అంబర్ లొంగుబాటు వల్ల గోలుకొండ కూడా మొగలు చక్రవర్తికి కప్పం చెల్లించవలసివచ్చింది. అయితే, ఆ వెంటనే షా జహాన్ తన తండ్రి పైన తిరుగుబాటు చేసినప్పుడు సుల్తాన్ మహమ్మద్ రెండుసార్లు ఆయనా, ఆయన కుటుంబం తన భూభాగం గుండా సురక్షితంగా వెళ్ళే వీలు కల్పించాడు. సుల్తాన్ మహమ్మద్ 1617లో మక్కా మసీదు నిర్మాణాన్ని ప్రారంభించాడు. మసీదుకు పునాది వేసే ఉత్సవంలో ఆయన ఈ పవిత్ర కార్యాన్ని, జీవితంలో ఒక్కసారి కూడా ప్రార్థన (నమాజు) మానని వ్యక్తి చేతులతో జరపాలని ప్రకటించాడు. ఎవరూ ముందుకు రాకపోవడం చూసి, తాను 12వ ఏటి నుంచి రోజూ విధిగా చేయవలసిన అయిదు

నమాజులలో ఒక్కటి కూడా మానలేదని పేర్కొని, తానే పునాదిరాయి వేశాడు. సుల్తాన్ మహమ్మద్ తన మామ మహమ్మద్ కులీ రచనలన్నింటిని ప్రచురించే పనిని చేపట్టాడు. ఇరాన్, గోలుకొండల మధ్య సంబంధాలు ఈయన కాలంలో మరింత స్థిరపడ్డాయి.

మహమ్మద్ పెద్ద కుమారుడు అబ్దుల్లా; జ్యోతిష్యుల సలహా మేరకు మహమ్మద్ తన కొడుకును 12 ఏళ్ళపాటు చూడలేదు. తండ్రికొడుకులు కలుసుకొన్న తరువాత కొంతకాలానికే తండ్రి జబ్బుపడి చనిపోయాడు! ఆ విధంగా, అబ్దుల్లా 12 ఏళ్ళ పిన్నవయసులోనే సింహాసనాన్ని అధిష్టించి క్రీ.శ. 1626 నుంచి 1672 వరకు 46 సంవత్సరాలు గోలుకొండ రాజ్యాన్ని పాలించాడు. ఇతడి పరిపాలనా కాలంలో ఇరాన్-గోలుకొండల మధ్య సంబంధాలు మరింత దృఢతరమయ్యాయి. అయితే రాజ్యపతనం కూడా అబ్దుల్లా కాలంలోనే ప్రారంభమయింది.

షాజహాన్ 1628లో మొగలు చక్రవర్తిగా అధికార పీఠమెక్కాడు. ఆయన మొదట బీజపూర్‌ను స్వాధీనం చేసుకొని తాను తిరుగు బాటు జరిగినప్పుడు తనకు సహాయం చేసిన గోలుకొండ వైపు దృష్టి సారించాడు. 1638లో అబ్దుల్లా మొగలాయిలతో ఒక అవమానకరమైన ఒప్పందం పై సంతకం చేయక తప్పలేదు. ఆయన గోలుకొండను మొగలు సామ్రాజ్యంలో కేవలం ఒక సంస్థానం స్థాయికి దిగజార్చివేశాడు. ఫలితంగా గోలుకొండ అధికారిక మతవిశ్వాసమయిన 'షియా' స్థానంలో సున్నీతత్వం వేళ్ళూనుకుంది. బంగారు, వెండి నాణాలు మొగలు చక్రవర్తి పేరుతో వెలువరించ బడ్డాయి. ఇదే సంవత్సరంలో దక్కన్‌కు ఔరంగజేబును వైస్రాయిగా నియమించారు. గోల్కొండ సామ్రాజ్యం దక్కనులో అంతర్భాగమే.

గోలుకొండ దర్బారులోని ఉన్నతాధికారి మీర్‌జుమ్లా మొగలుల పక్షంలోకి ఫిరాయించడం ఈ కాలంలో జరిగిన మరొక ముఖ్యమయిన రాజకీయ ఘటన. ఔరంగజేబు కుమారుడు, మహమ్మద్ సుల్తాన్ 1656లో చక్రవర్తి షాజహాన్ ఆజ్ఞమేరకు గోలుకొండను ముట్టడించాడు. తరువాత అతడి తండ్రి ఔరంగజేబు

కూడా ముట్టడిలో పాల్గొన్నాడు. గోలుకొండ సుల్తాన్ అబ్దుల్లా తన కుమార్తెను ఔరంగజేబు కుమారునికిచ్చి వివాహం చేయడం వంటి అనేక షరతులు అంగీకరించిన తరువాత గోలుకొండ ముట్టడిని విరమించారు. ముట్టడి తొలగిన నెలరోజుల తరువాత వివాహం జరిగింది. అబ్దుల్లా మరణానంతరం మొగలు రాకుమారుడు మహమ్మద్ సుల్తాన్ గోలుకొండను పాలిస్తాడని కూడా ఒప్పందం కుదిరింది.

అబ్దుల్లా ఈ విధమయిన అవమానకర స్థితినీ, రెచ్చగొట్టే చర్యలనూ తట్టుకుని చాలాకాలం జీవించాడు. ఔరంగజేబుకు, మొగలాయి రాజధాని ఆగ్రాలో వున్న షాజహాన్ ముద్దుల కుమారుడు దారాషికోకీ మధ్య తలెత్తిన విభేదం నుండి రాజకీయ ప్రయోజనం పొందుతూ అబ్దుల్ తన అధికారాన్ని నిలుపుకుంటూ వచ్చాడు. అయితే వారసత్వ పోరాటంలో విజయం సాధించి, ఔరంగజేబు చక్రవర్తి అయినప్పుడు అబ్దుల్లా యిందుకు మూల్యం చెల్లించక తప్పలేదు.

రాచరికం పతనావస్థలో ఉన్నప్పటికీ, అబ్దుల్లా కాలంలోనే, గోల్కొండ రాజ్యపు కర్నాటక గవర్నర్ నెక్నామ్ ఖాన్ మద్రాస్‌లో శాన్‌థామ్‌ను ఆకలితో మలమల మాడ్చి లొంగదీశాడు. కుతుబ్ షాహిలు మద్రాసులోని సెయింట్ ఫోర్ట్ వద్ద గిడ్డంగి నిర్మించడానికీ, నేరుగా సుంకాన్ని వసూలు చేసుకోడానికీ బ్రిటీషు వారు అంగీకరించక తప్పని స్థితి కల్పించాడు. డచ్చివారు బ్రిటిష్ వారిని వేధించరాదంటూ అబ్దుల్లా ఒక ఫర్మానా కూడా జారీచేశాడు.

గోలుకొండ ఆఖరి సుల్తాన్ చాలా అసాధరణ రీతిలో అధికారం లోకి వచ్చాడు. మొగలాయీలతో అబ్దుల్లా కుదుర్చుకొన్న ఒప్పందం ప్రకారం, అబ్దుల్లా మరణానంతరం, మొగలు రాకుమారుడు సుల్తాన్ మహమ్మద్ అధికారాన్ని చేపట్టవలసి వుంది. కాని, విధివశాత్తు, అధికారంలోకి రావలసిన ఆ రాకుమారుడి విశ్వాసఘాతుకం వల్ల ఔరంగజేబు అతడిని బంధించి చెరసాలలో పెట్టడంతో అబ్దుల్లా తదనంతరం అతడు రాజ్యానికి వచ్చే ప్రశ్నే తలెత్తలేదు.

అబ్దుల్లాకు మగపిల్లలు లేరు అతని మరో ఇద్దరు కుమార్తెలలో చిన్న కుమార్తెను 'నాయిఫ్' (Naif) కు చెందిన సయ్యిద్ సుల్తాన్ అనే అతనికిచ్చి పెళ్ళి చేయాలనుకున్నప్పుడు, మక్కా కు చెందిన అబ్దుల్లా పెద్ద అల్లుడు దీనికి అభ్యంతరం చెప్పాడు. ఈ పరిస్థితులలో, రాజ కుటుంబంతో దూరపు బంధుత్వం గల అబుల్‌హసన్ నగరం వెలుపల సూఫీ గురువు 'షా రాజూ' వద్ద శిష్యరికం చేస్తూ వుండగా అతన్ని తీసుకువచ్చి రాకుమార్తె నిచ్చి వివాహంచేశారు. కోటలో జరిగిన మంత్రాంగం, కుతంత్రం ఫలితంగా అబుల్ హసన్ ఇలా గోలుకొండ ప్రభువయ్యాడు.

అబుల్‌హసన్ తానాషా కథ ఒక విషాదాంత ప్రేమగాథ లా సాగుతుంది. ఎలా రాజయ్యాడు? ఎలా పద్నాలుగేళ్ళు పాలించాడు? చివరకు పద్నాలుగేళ్ళు ఔరంగజేబుకు బందీగా యెలా ఉన్నాడు? ఔరంగజేబు చెరలో ఔరంగాబాదులో ఎలా చనిపోయాడు? అనే ప్రశ్నలకు అనేక సమాధానాలు చెప్పే శతానేక కథనాలున్నాయి. సున్నితమనస్తత్వం, నాజూకుతనం కారణంగా తానాషాగా ప్రసిద్ధుడయ్యాడు. కానీ ఆయన నియంతృత్వ ధోరణివల్ల కాదు. ఇప్పుడు ఆ పదానికి నిరంకుశత్వం, అనూహ్య ప్రవర్తన అనే అర్థాలు స్థిర పడిపోయాయి.

ఈయన పాలనలో మాదన్న అదే హిందువు ప్రధానమంత్రి పదవి నిర్వహించాడు. రాజ్యాన్ని పటిష్టం చేయడానికి మాదన్న ప్రయత్నించాడు. అందుకు వీలుగా, తనకు నమ్మకస్తులైన అనేకమందిని ప్రధాన పదవులలో నియమించాడు. అవిశ్వాసిని (ముస్లిమ్ విశ్వాసాలు లేని వ్యక్తి) పేష్వాగా నియమించడాన్ని ఔరంగజేబు తప్పు పడుతూ గోలుకొండపై దాడికి యిదే కారణమని బుకాయించాడు. మరాఠాల నేత శివాజీ కూడా గోలుకొండను సందర్శించాడు. తానాషాతో సమావేశమయ్యాడు. తన సోదరునితో, మొగలాయీలతో బీజపూర్ రాజుతో సాగిస్తున్న పోరాటానికి తానాషా సహాయాన్ని కూడా పొందాడు. గోలుకొండకు పూర్వ వైభవాన్ని పున:ప్రతిష్ఠించాలని తానాషా చేసిన ప్రయత్నాలు చాలా ఆలస్యంగా, చాలా బలహీనంగా జరిగాయి. మొగలులు

బీజపూర్ మీద దండెత్తి, బీజపూర్ ముట్టడి కొనసాగుతుండగనే అప్పటికే బీజపూర్‌కు తానాషా సహాయ పడుతున్నందువల్ల గోలుకొండ మీద కూడా దాడి చేయాలని నిర్ణయించారు.

గోలుకొండ ముట్టడి ఎనిమిది చాంద్రమాన మాసాల పాటు కొనసాగింది. మొగలు చక్రవర్తి స్వయంగా నడిపిన సైన్యాలను ఢీకొని గోల్కొండ సైన్యాలు జరిపిన సాహసోపేత, ధీరోదాత్త పోరాటం కుతుబ్‌షాహీ వంశచరిత్రకు వైభవోపేతమయిన అత్యంత ప్రతిష్ఠాత్మకమయిన ముగింపు యిచ్చింది. తానాషా, ఆయన సైన్యాధికారులు మొండిగా యెదురు నిలిచారు. గోలకొండ వైపు నుంచి పెద్దయెత్తున ఫిరాయింపులు జరిగి వుండకపోతే మొగలాయీలు గెలిచేవారు కాదు. ఒక రాత్రి ఒక ఫరియా కుక్క, మొరగడంతో కోటలోకి చప్పుడు కాకుండ ప్రవేశించడానికి ప్రయత్నిస్తున్న మొగలాయీ సైనికులను గోలకొండ సైనికులు నిరోధించగలిగారు. ఈ కుక్కను బంగారు మెడ పట్టీతో గౌరవించడమే కాక తానాషా సింహాసనం సరసన గౌరవ ఆసనం కూడా వేశారు. గోలుకొండ రాజరికపు అంతిమ దశలో, గోలుకొండలోని చిన్నా, పెద్దా అధికారులు ప్రదర్శించిన అసాధారణ సాహసంతోపాటు కొందరు అతినీచమయిన విద్రోహ కార్యకలాపాలకు దిగజారడం కూడా జరిగింది. మోసం చేసి లంచాలు ఎర చూపి మొగలులు కోటను హస్తగతం చేసుకున్నారు. కుప్పకూలుతున్న రాజవంశాల ఆఖరిచక్రవర్తి అబుల్‌హసన్ తానాషా, చివరకు బందీగా వెళ్ళే సమయంలో కూడా యెంతో సాహసంతో నిబ్బరంగా వ్యవహరించాడు. తానాషా తన ప్రాత:కాల ప్రార్థన ముగిసే వరకు మొగలు సైన్యాధికారి రుహుల్లా ఖాన్‌ను నిరీక్షింప చేసి, బందీగా కొనిపోయే ముందు తనతో కలిసి ఫలహారం తీసుకోమని ఆహ్వానించాడు. ఆ మొగలు సైన్యాధిపతికి నోటమాట రాలేదు.

1687లో తానాషాను బంధించి, ఔరంగాబాద్‌కు తరలించడంతో కుతుబ్‌షాహి రాజవంశం ముగిసిపోయింది. కుతుబ్‌షాహి వంశం 169 సంవత్సరాలు గోలుకొండను పాలించింది ఆ పిదప గోలుకొండ, ఔరంగాబాద్ రాజధానిగా వున్న

మొగలాయీల దక్కను రాజ్యంలో కలిసిపోయింది. గోలుకొండ కోట సమీపంలో అసంపూర్ణంగా మిగిలిన కుతుబ్‌షాహీల ఆఖరి రాజు తానాషా సమాధి విషాద స్మృతులను గుర్తు చేస్తుంది. నగరంలోని మక్కా మసీదు అలంకరణకు అదనపు ఆర్థిక సహాయం కోసం విజ్ఞప్తి చేసినప్పుడు ఔరంగజేబు ఎగతాళిగా అసంపూర్ణ వ్యవహారం అని వ్యాఖ్యానించిన విషాద సంఘటనను ఈ సమాధి జ్ఞాపకం చేస్తుంది. తానాషా ఔరంగాబాద్‌లో సమాధి అయ్యాడు. ఔరంగజేబు సమాధి చేయబడిన భూమిలోనే తానాషా సమాధి కూడా వుంది. నిజమే, మృత్యువును మించిన సమాన న్యాయం సాధించగల శక్తి మరొకటి లేదు!

హైదరాబాద్‌ను 1687లో జయించిన తరువాత ఔరంగజేబు, నగర స్థాపకుడు ప్రేమగా పెట్టుకొన్న 'ఫరిఖుందా బునియాద్' పేరును తొలగించి ప్రతీకారాన్ని ప్రతిధ్వనించడానికా అన్నట్టు 'దారుల్ జిహాద్' ('పవిత్ర యుద్ధభూమి') అని మార్చాడు. గోలుకొండ, ఔరంగాబాద్ రాజధానిగా గల మొగలుల దక్కన్ రాజ్యసీమలో భాగమయింది. ఈ విధంగా హైదరాబాద్ రాజధాని హోదాను కోల్పోయింది.1724లో దక్కనులో మొగలుల గవర్నర్ నిజాముల్ ముల్క్ మొగలు చక్రవర్తి నుంచి స్వతంత్రుడయినా ఔరంగాబాద్‌నే రాజధానిగా కొనసాగించాడు. డెబ్బయి ఆరు సంవత్సరాల తర్వాత 1763లో హైదరాబాదు తిరిగి దక్కను రాజధాని అయింది. శతాబ్దంలో మూడు వంతుల కాలం నిర్లక్ష్యానికి, నిరాదరణకు గురయిన నగరం తిరిగి జీవం పోసుకోసాగింది. నూతన ఆసఫ్‌జాహీ రాజవంశం, 1948లో హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో కలిసే వరకు హైదరాబాదును పాలించింది.

రాజుల, పరిపాలకుల ఈ సుదీర్ఘమయిన వరుసలో, ముఖ్యంగా క్రీ.శ. 1518 నుంచి 1948 వరకు పాలించిన వారిలో మహమ్మద్ కులీ కుతుబ్ షా బహుముఖ వ్యక్తిత్వం గల చక్రవర్తిగా చరిత్రలో నిలిచిపోతాడు. భారతదేశంలోని ఏ యితర ప్రాంతీయ పరిపాలకుడినీ ప్రజలు, ముందుతరాల వారు యింత ఆత్మీయంగా, గౌరవంగా గుర్తుంచుకోరు. ఇలా ఎందుకు అనే ప్రశ్నకు జవాబు -

కులీ ప్రత్యేకత. కులీ తనను గురించి భ్రమలు సృష్టించే ప్రయత్నం చేయలేదు. తన వ్యక్తిత్వాన్ని తాను యెంతో ధైర్యంగా నిలుపుకున్నాడు. ఆయన తన ప్రజలతో సహజసిద్ధంగా, సులువుగా కలసిపోయాడు. క్రూరత్వం, వైషమ్యాలూ సర్వ సాధారణమయిన కాలంలో కులీ ఆశ్చర్యకరమయిన స్థాయిలో సహనాన్నీ, ఔదార్యాన్నీ ప్రదర్శించాడు. ఆయనలోని కవిరాజు రాజును మించిపోయాడు. ఆయన తన ప్రజల హృదయాలలో ప్రతిస్పందనాతంత్రులను మీటగలిగాడు. ప్రజలతో ఆయన సాన్నిహిత్యం, కలుపుగోలుతనం మత కాల అవరోధాలను అధిగమించాయి. ఆయన తదనంతర తరాల స్త్రీ పురుషులందరూ ఆయన పేరును యెంతో ప్రియంగా స్మరించుకున్నారు. హైదరాబాద్ గాయకులు ఇప్పటికీ తమ కచేరీలలో ఆయన గీతాలు గానంచేస్తున్నారు. కులీ నిర్మించిన ఈ నగరం ప్రస్తావన ఆ కవితలలో వినబడినప్పుడు కరతాళ ధ్వనులు యిప్పటికీ మిన్నంటుతున్నాయి. మహమ్మద్ కులీ కుతుబ్‌షా పేరు, ఆయన జ్ఞాపకాలు న్యాయంగానే, సమంజసంగానే, ఒక హక్కుగానే చిరకాలం నిలిచి వుంటాయి.

